కాత్యాయనీ గ్రంథమాల.

ప్రథమపుష్పము.

తంగిరాల జగన్నాథశాస్త్రి

సంపాదకుఁడు

శ్రీరస్తు.

శ్రీమత్పరదేవతాఖ్యానము:

# దేవీభాగవతము.



## సప్తమస్కంధము.

ఇది

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులచే

రచియింపఁబడి,

శ్రీ సౌదామినీముద్రాక్షరశాలలో

కాత్యాయనీగ్రంథమాలవారిచే

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

తణుకు.

మొదటికూర్పు 1,000. కాపీలు.

1927.

చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-4-0

శ్రీమత్పరదేవతాయై నమః

# ఉపోద్ఘాతము.

మ॥ దురితానేకపసింహ, మార్తజనసందోహామరాగంబు, దు
స్తరదుఃఖాబ్ధిఁదరింపనావ, ఘనసంసారౌషధం బంబ!
పరసౌఖ్యప్రద, మంబుజోదరముఖస్వర్గీయసన్నృత్యంబు, దు
ర్నరకతారిణము, మోక్షదాయిని, భవన్నామంబు కాత్యాయనీ!

అని కాత్యాయనిదేవిని స్తుతియించుచుండఁ దన్నామంబుతో నొకగ్రంథమాలఁ స్థాపింప మనంబుత్సహించి, నాపితృవ్యపుత్రులగు బ్రహ్మశ్రీ తంగిరాల వేంకటసూర్యనారాయణ బి ఎ. బి యి. గారితో యోజించి తత్ప్రోత్సాహంబున నస్మద్గురులగు బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి శతావధానిగారి యనుగ్రహవిశేషమ్మున "దేవీభాగవతము సప్తమస్కంధము" ప్రథమపుష్పముగాఁబడయుభాగ్యముఁగంటిని. ఇందనేక విధమ్ములగు ధర్మమ్ములును చ్యవనమహర్షి చరిత్రయు, హరిశ్చంద్రోపాఖ్యానమ్మును, దేవీస్థానమ్ములును, భక్తిధ్యానయోగమ్ములును, దేవీపూజావిధానమ్ము మొదలగునవి సరసమగుశైలిని చదువరుల మనంబాకర్షించునట్లు వ్రాయఁబడినవి. వ్యాసఋషిరచితమగు దేవీభాగవత మాంధ్రీకరించునపు డస్మద్గురులు ప్రథమస్కంధమున

క॥ "ఎన్ని పురాణమ్ములఁదా,
మన్నియునాంధ్రీకరించి యనుకంపఁగా,
కున్నఁదీనిఁ విడుతురె?
నన్నయభట్టాది కవిజనమ్ములుమాకుఁ. ,,

# ప్రోత్సాహకులు.

1 బ్రహ్మశ్రీ. తంగిరాల వేంకట సూర్యనారాయణగారు.
బి. ఎ. బి. ఇ. లోకల్ ఫండు అసిస్టెంటు
ఇంజనీయరు నర్సాపురం.

2. " తంగిరాల వేంకట సుబ్బయ్యగారు.
పోలీసు సబ్ ఇనస్పెక్టరు జయపురం.

3. " గుళ్లపల్లి సోమయాజులుగారు.
గరల్సుస్కూల్ హెడ్ మాష్టరు భద్రాచలం.

4. " దివాకర్ల వేంకటావధానిగారు. కాకినాడ.

5. " చిలుకూరి నరశింహారావుగారు.
బి. ఎ. యల్. టి. కాకినాడ.

6. " నోరి సత్యనారాయణగారు. కాకినాడ.

# రాజపోషకులు.

7. " దేవరకొండ రామనాథంగారు.
ఇనాందారు. మండపాక.

8. " యర్రమిల్లి నారాయణమూర్తిగారు.
బి. ఎ. బి. యల్. వకీలు. నర్సాపురం.

9. మ॥రా॥శ్రీ బి. యస్. నారాయణగారు. కాకినాడ.

10. " పి. వెంకటామన్నగారు. కాకినాడ.

11. " గుమ్మడపు శ్రీనివాసరావుగారు.
తహశ్శీల్దారు. ఎల్లవరం.

12. " పుసులూరి. హనుమంతరావుగారు.
డి. పి. డబ్లియు, సబ్ ఓవరుశీయరు.
తాడేపల్లిగూడెం.

## పోషకులు.

13. బ్రహ్మశ్రీ ఝూమని సత్యనారాయణమూర్తిగారు.
యీనాందారు. తణుకు.

14. „ యీామని వెంకటరామయ్యగారు.
యీనాందారు తణుకు.

15. „ చావలి యజ్ఞేశ్వర సోమయాజులుగారు.
బి. ఎ. బి. యల్. వకీలు. నర్సాపురం.

16. „ ముదుకుట్ల సుబ్బారాయుడుగారు.
బి. ఎ. ప్లీడరు భీమవరం.

17. మ॥రా॥శ్రీ చిట్టూరి యింద్రయ్య చౌదరిగారు.
బి. ఎ. బి. యల్. వకీలు నర్సాపురం.

18. బ్రహ్మశ్రీ మేడూరి లక్ష్మీపతిగారు.
యీనాందారు మండపాక

19. „. మేడూరి సూర్యవర్ధనంగారు.
యీనాందారు మండపాక.

## అభిమానులు.

20. బ్రహ్మశ్రీ దేవరకొండ పాపయ్యశాస్త్రుల్లుగారు.
యీనాందారు మండపాక.

21. „ జోశ్యుల రామచంద్రరావుగారు.
యీనాందారు మండపాక.

22. శ్రీమాన్ పాతులూరి నరసింహాచార్యులుగారు.
యీనాందారు. మండపాక.

# విషయసూచిక.


పుట.

1 బ్రహ్మాద్యుత్పత్తి.

4 సూర్యవంశవిస్తారము.

10 సుకన్యాచ్యవనవివాహము.

13 అశ్వినులును సుకన్యయు సంభాషించుట.

15 చ్యవనునికి యౌవనప్రాప్తి.

21 శర్యాతియజ్ఞంబొనర్చుట.

25 రేవతుండు బ్రహ్మలోకమ్మున కరుగుట.

29 శశాదచరిత్ర.

31 మాంధాతృచరిత్ర.

33 సత్యవ్రతోపాఖ్యానము.

38 రాజనీతి.

41 వసిష్ఠుండు త్రిశంకునకు శాపంబిచ్చుట.

47 త్రిశంకుండు స్వర్గమ్మునకరుగుట.

50 రోహితోత్పత్తి.

55 హరిశ్చంద్రుఁడు నరమేధంబొనర్చుట.

61 వసిష్ఠవిశ్వామిత్రసంవాదము.

65 విశ్వామిత్రుండు హరిశ్చంద్రుని వంచించుట.

70 హరిశ్చంద్రుండు కాశికిఁబోవుట.

74 హరిశ్చంద్రుండు భార్యనమ్ముకొనుట.

78 రోహితుండు మృతుండగుట.

82 హరిశ్చంద్రుండు చాండాలుని చేఁ గ్రీతుండగుట.

85 హరిశ్చంద్రుండు శ్మశానమున నుండుట.

88 శైబ్యపుత్రమృతికి శోకించుట.

92 తలవరులు శైబ్యం గట్టితీసికొని పోవుట.

95 హరిశ్చంద్రుండు తనపత్నిని జంపఁబూనుట.

98 [illegible] మృతి [illegible] మునిపతికి దెల్పుట.

100 బ్రహ్మాదిదేవతలు ప్రత్యక్షంబగుట.

104 శతాక్షీమహిమ.

107 శతాక్షిదుర్గముంబరిమార్చుట

110 సనకాదులకు దేవిప్రత్యక్షం

114 దేవిస్థానములు. [బగుట.

118 గౌరీజన్మము.

123 దేవివిశ్వరూపదర్శనము.

129 మోక్షమునకు జ్ఞానంబావశ్యకమనుట.

133 యోగమంత్రవివేచనము.

138 ధ్యానయోగము.

141 భక్తియోగము.

144 దేవిస్థానోత్సవాదికము.

147 దేవిపూజావిధానము.

*

శ్రీమత్పరదేవతాయైనమః.

# దేవీభాగవతము.



తిరుపతివేంకటీయము.

## సప్తమస్కంధము.





రతత్త్వాదర నిస్తుల
తరపాండిత్యప్రకర్ష ధర్మోత్కర్షా
భరణ కలుషాపహరణ వి
తరణగుణనిదాన బ్రహ్మతత్త్వాధీనా.

వ॥ అవధరింపు మనంతరంబు శౌనకాదులు సూతుం గాంచి యవ్వలికత నొడువు మనుడు నక్కథకుం డిట్లను నట్లు పురాణకథనోన్ముఖుం డగువ్యాసునకు జనమేజయుం డిట్లనియె. ౨

చ॥ హిమకరుఁడున్ దివాకరుఁడు నేరికి వంశకరుల్ క్రమమ్ముగా
నమలినకీర్తులై వెలయునమ్మహిపాలురయోగ్యశీల్ వినం
గ మనము పుట్టె శక్తిపదకంజరతుల్ గద వీర, లిట్టియు
త్తములచరిత్రకన్న శుభదం బెఁక నెయ్యది మౌనిసత్తమా. ౩

వ॥ నావుడు వ్యాసుండు ప్రీతమనస్కుండై నరేంద్రా! సూర్యచంద్రవంశజులయు నన్యులయు జన్మమ్ములాదిగ నఖిలంబును విస్తరించెద నాకర్ణింపుము. ౪

### బ్రహ్మోత్పత్తి.

గీ॥ అబ్జలోచను నాభియం దవతరించి, మించి తపమున దేవి మెప్పించి
వరము, గైకొని జగంబు సృష్టింపఁగా గడంగి, మనుజుల సృజింప
లేక యవ్యాజనభవుఁడు. ౫

వ॥ మనస్సున బహుళభంగుల యోజించి మరీచ్యంగిరోఽత్రివసి
ష్ఠపులహక్రతుపులస్త్యు లనుమానసపుత్రుల నేడ్వురఁ బ్రథమమ్మున నొ
నరించె నంత రోషమ్మువలన రుద్రుండును నుత్సంగమ్మువలన నారదుం
డును నంగుష్ఠమ్మున దక్షుండును నుద్భవించిరి. తక్కుఁగలసనకాదులు
ను బ్రహ్మమానసపుత్రులకా నెఱుంగునది వామాంగుష్ఠమునుండి ద
క్షపత్ని యగువీరిణి జనియించె. ౬

గీ॥ మఱియును నసిక్ని యనఁగ నిమ్మగువ కింక, నొక్కనామమ్ము గల
దీపె కుద్భవించె, మరల నారదుఁ డనుడు నహ్మాని కిట్లు. లనియె జ
నమేజయుఁడు సంశయంబు గదుర. ౭

క॥ వీరిణికి దక్షునకు న, న్నారదుఁ డేకారణమ్మునన్ జనియించెన్, ధీ
రుం డతనికిఁ బూర్వశ, రీరం బెటు వ్రాయె నెట్లు మృత్యువ్వ ద్రో
డరెన్. ౮

ఉ॥ నావుడు వ్యాసుఁ డిట్లను జనస్తుత! ధాతయనుజ్ఞ దక్షుఁడుం
జేవ గలట్టిపుత్రుల సృజించెఁ గళత్రమునందు నైదువే
లావిమలాత్ము లందఱును నాత్మజులన్ సృజియించి సృష్టి నెం
తే వెలయించునయ్యెడల నిట్లని నారదమౌని వారికిన్. ౯

వ॥ భూపరిమాణం బెఱుంగక మున్న ప్రజాసృష్టిం బూనర్చు
బాలిశు లగుమీర లుపహాస్యత నొందుట నిక్కం బనవుడు నాహర్య
శ్వులు తమలోఁ దమరు మునివచనంబు విశ్వాసార్హం బని యెంచి
కొని భూపరిమాణం బరయ నందఱును బయలువెడలి నలుదిక్కులకుం
జనినంత దక్షుండు పుత్రు లేగుటకుఁ జింతించి మరలఁ గొండఱ నర్థా
ర్యంబునకుఁ బుట్టించిన వారలు తదాజ్ఞంజేసి సర్గంబున కుద్యమించున
డ నారదుండు యథాపూర్వమ్ముగ వారలం జూచి పల్కుడు వారలు
ను దద్వచనమోహితులై భూపరిమాణం బరయ నరిగిన దక్షుండు త
త్పుత్రవిరహమ్మున శోకార్తుండై నారదుం గాంచి. ౧౦

క॥ నాకొమరుల నిటు చేసిన, నీకయ్యెడి గర్భవాసనిష్ఠురదశ నా, కేకొ
మరుఁడ వగు మనుచున్, వే కనలి శపింపఁ బుట్టె వీరిణి కతఁడున్.

వ॥ పిమ్మట దక్షుం డఱువదిమంది కన్నియల సృష్టించి యందుఁ బదుమూఁగురఁ గశ్యపునకును బదుగుర ధర్మునకును నిరువదియేడ్వుర సోమునకును నిరువుర భృగువునకును నల్వుర నరిష్టనేమికిని నిరువురఁ గృశాశ్వునకును నిరువుర నంగిరసునకును నిచ్చిన నవ్వారల కందఱకును సంతానం బుద్భవించె.

క॥ వారల కుదయించినయ, వ్వారలు నవ్వారిసుతులు బలియురు శూ
రుల్, ధీరులు పరస్పరమ్మును, వైరులు సుర లసుర లగుచు వర్ధిలిరి
నృపా. ౧౩

క॥ నావుడు జనమేజయభూ,మీవిభుఁ డిట్లులను దెల్పుమీ రవికులమం
దావిర్భవించి ధర్మ, శ్రీ వెలసిన నృపవరుల చరిత్రము నాకున్. ॥

వ॥ వ్యాసుం డిట్లను నరేంద్రా! మున్ను నారదుండు నాకెఱిఁగించిన తెఱంగునఁ దెల్పెద నాలింపు మొక్కనాఁ డతండు నేను దపంబొనరించుసరస్వతీతీరమ్మున కరుదెంచిన నమ్మహాముహు నర్ఘ్యపాద్యాదికృత్యమ్ముల నర్చించి యాసనస్థితుఁ గావించి యిట్లంటి. ౧౫

గీ॥ పావితుఁడ నైతి నీరాకఁ బట్టి యేను, సప్త ముండగు మనువువంశ
మునఁ బుట్టి, జగతి పాలించు రాజులచరితములను, విన వలఁతు న
నఁ గరుణించి మునివరుండు. ౧౬

వ॥ నన్నుం గాంచి యిట్లు చెప్పం దొడంగె.

• క॥ విను సత్యవతీసుత! య, వ్వనజాక్షునినాభిఁ బుట్టెఁ బ్రథమమ్మున న,
వ్వనజాసనుఁ డీజగమున, కనఘుం డాతండ కర్త యఖిలవిధములన్.

వ॥ సర్వశక్తియుక్తుండును సర్వజ్ఞుండును నగునన్నలువ పదివేలవత్సరంబులు తపం బొనర్చి పర దేవతానుగ్రహంబు వడసి శుభలక్షణలక్షితులగుమానసపుత్రుల ననేకుల సృజించె నందు మరీచి యధికుండై సృష్టియందు నేర్పరియై మించె నతనికొమరుండు కశ్యపుఁ డతనికిఁ దక్షసుతలు పదుమూఁగురు భార్యలైరి ౧౭

## సూర్యవంశవిస్తారము.

గీ॥ కశ్యపున కుదయించి రకాంతలందు, సురలు నసురులు యక్షకిన్నరు లురగులు, మనుజులును బశువులుఁ బక్షులును గ్రమముగ, దానవీసృష్టి కాశ్యపి నానెసంగె. ౧౯

వ॥ అందు దేవతలలో సుప్రసిద్ధుండగు వివస్వంతునికొమరుండు వైవస్వతమనువు, తత్పుత్రుం డిక్ష్వాకుం డతనికతమ్మునసూర్యవంశంబు విస్తరించె నితనికి నెనమండ్రు తమ్ములు గలరు వీరి నామములు నాభాగుండును ధృష్టుండును శర్యాతియు నరిష్యంతుండును ప్రాంశుండును నృగోద్దిష్టుండును గరూషుండును బృషధ్రుండు నని చెప్పంబడు వీరలు మానవు లిందు జ్యేష్ఠుండగునిక్ష్వాకునకుఁ బుత్రశతకంబు ప్రొడమె నందు మొదటివాఁడు వికుక్షి యనంబడు నాభాగునకుఁ బుత్రుండంబరీషుండు మఱియు ధృష్టునివలన నుదయించినక్షత్రంబు బ్రహ్మభూతమ్మును బ్రహ్మకర్మగతమ్మును సంగ్రామకాతరమ్మును నయియొప్పె. ౨౦

క॥ అనఘుం డగుశర్యాతికిఁ, దనయుం డానర్తుఁ డనఁగఁ దనరుఁ దరుణీ, జనరత్నంబు సుకన్యా, వనజముఖి తనూజ యగుచు వఱలె నరేంద్రా. ౨౧

వ॥ శర్యాతి యక్కొమిరె నంధుం డగుచ్యవనున కిచ్చి వివాహం బొనర్చిన నాపె శీలంబుకతన నశ్వినులవలన నతండు సులోచనుండయ్యె నన జనమేజయుం డిట్లనియె. ౨౨

చ॥ చ్యవనునకుం మునీంద్రునకు నంధున కేగతి నిచ్చె నానృపా
లవరుఁడు రూపశీలగుణలక్షణముల్ గలయట్టికన్య ని
క్కువలయుమం బరూపిణియుఁ గుత్సితశీలయు నైనపుత్రినే
ని వరున కంగహీనునకు నిక్క మొసంగెడి తండ్రు లుండిరే. ౨౩

వ॥ అన నతం డిట్లనియె.

క॥ ఆర్యుఁడు వైవస్వతసుతుఁ, డర్యమపౌత్రుండు నంపదాఢ్యుం డగునా
శర్యాతికి నాలుగువేల్, భార్యలుగల రందఱు ననవద్యచరిత్రల్.

క॥ అందఱుఁ బ్రేమను గలవా, రందఱు రూపమున మేటు లందఱు తత
న్నికిఁ, వీందులు వారలకెల్లను, నందన యొక్కర్తు దగుఁ గనంద
గుపేరిక్. ౨౫

వ॥ అక్కన్నియ సుకన్య యనం బరఁగు సత్త్రోదరియందుఁ
దండ్రికిని దల్లులకును బ్రేమం బధికం బగుటఁ జేసి యాపె యెక్కుడగు
గారాబమ్మునఁ బెరుఁగుచుండె. ౨౬

ఉ॥ మానససన్నిభం బనుపమానజలంబు సహంస్రపక్షిసం
తానవివాసభూమి సముదంచితపంచవిధాబ్జసంగతం
బై నిఖిలాగమాకరతటానుగతంబు తటాక మొక్కఁ డిం
పౌ నలభూమిపాలునగరాంతికమం దళిరాజిసేవ్యమై. ౨౭

క॥ అవిరళపాదపవృతత, త్సవిధవిపినమందు విజనసంస్థితుఁడై భా,
ర్గవుఁడు తప మాచరించెన్, జ్యవనుం డనుమౌని యంబ సంతస
మందన్. ౨౮

క॥ మానము గొని జలపానం, బేనియు నొనరింపకే జితేంద్రియుఁడై
యెుం, డే నేనుమౌని యుండన్, ధ్యానించు నతండు నాకు వ
ర్ణ్యేఁ గ్రనుముగన్. ౨౯

క॥ తనగాత్రిం బిటు వల్మీ, కనిభృతమై పుటికుటీగడ్డవిధమునన్ దన
రి లతావేష్టితమై, పనుపడి నుఁ బిపీలికావిభాజన మగుడున్. ౩౦

వ॥ ఒక్కింతయుఁ జలింపక యమ్మహానుభావుం డుగ్రతపమ్మున
నుండెఁ గొండొక కాలమ్మునకు శర్యాతి సుందరీబృందసహితుండై య
క్కాసారమ్మునఁ గ్రీడ లొనరింప నేతెంచి యిష్టవిహారమ్ము లొనరింపు
చుండఁ దోనేగినసుకన్యయుఁ దననెచ్చెలులం గలసి యుందంద పుష్పాప
చయంబు సలుపుచుఁ జంచలయుంబోలె నవ్వనమ్మునం గుమ్మరునది
యొక్కెడఁ జ్యవనునివల్మీకంబు దిలకించి క్రీడాసక్తిం జేసి తత్సమీపమ్ము
న కరిగి. ౩౧

క॥ దానన్ దృష్టి నిగుడ్పన్,గానంబడెఁ గాంతియుగళి;కని కంటకమున్
బూనియుఁ దానిం బ్రివ్వఁగఁ, దానేగుడుఁ జ్యవనుఁ డంత దానిం
గసిమెన్. ౩౨

క॥ కని శుష్కస్వరమున నో, వనజానన? దీనిఁ ద్రివ్వ వలవదు దూ
రం, బున కేఁగుము నేఁదాపస, జనుఁడ నన్ వినని కతనఁ జయ్యా
న నదియున్. ౩౩

వ॥ దగ్గఱ కరిగి దైవప్రేరణమ్మునఁ గంటకమ్ముంగొని యిదియేమి
యని త్రవ్వ నతని నేత్రమ్ములకుం దగిలి భగ్నమ్ము లయ్యె నంత నత్తలో
దరి యెంత చేసితి నని కొండొకవగచియుఁ గ్రీడాసక్తి నెప్పటియట్ల గ్రు
మ్మరుచుండెఁ బదంపడి చ్యవనుండు భగ్నలోచనుండై వేదన సహింప
క శోకించునాలో సైన్యాదిసహితమ్ముగ రాజునకు శకృన్మూత్రబంధనం
బలవడిన సైనికులు రాజునకు విన్నవింపుటయు శర్యాతి యింతఱకును
నొక్కపెట్ట నిట్లగుట కేమి కతం బని చింతించుచు గృహంబరిగి యె
వ్వఁ డీదుష్కృతిం బొనర్చె నని శంకించి సైనికుల కిట్లనియె. ౩౪

క॥ ఈపురిసవిధమ్మునఁ దగు, వాపికెఁ బశ్చిమమునం దప మొనర్చుమ
హా,తాపసుఁడు చ్యవనుఁ డమ్ముని, కేపాటియుఁ బీడఁ గొల్పి రే యె
వ రేనిన్. ౩౫

గీ॥ ఎఱిఁగి యెఱుఁగక తత్తపోవృద్ధు వృద్ధు, నెవ్వఁడేనియుఁ బీడింప
హేలనంబు,సైఁప కమ్ముని మన కిట్టిశాస్తి చేసె, నెవ్వఁ డపరాధి
వాఁడు మీా కెఱుఁగ రాఁడె. ౩౬

వ॥ అని వారల నందఱ నయమ్మున భయమ్మున నన్నరవరుం డ
డుగ మనోవాక్కాయకర్మముల నించుకేని దోషంబు మేమెఱుఁగ మె
ఱుఁగ మనుడు నవ్వారి నతండు దండింప మొదలు పెట్టిన నయ్యది సుకన్య
విని పీడ్యమానం బగుజనంబు నీక్షించి దుఃఖితుం డగు తండ్రి కిట్లనియె
నయ్యా! వనమ్మునఁ గ్రీడింపనేగిన నాకు లతావృతంబై గంధద్వయసమ
న్వితం బగునొక్కవల్మీకంబు గన్పట్టె. ౩౭

గీ॥ అందు ఖద్యోతరీతి నింపొందు రెండు, జోతు లగుపడ నేనును సూచిఁ బొడిచి, నంత నయ్యది జలదిగ్ధ మయ్యె నదియుఁ, గాక హాహా నినాద మొక్కండు వెడలె. ౩౮

క॥ మంద మ్మగుహాహారవ, ముం దగ విని విస్మయమ్ము మొనయఁగ నేనం, తం దరలి వచ్చితిని నూ, చిం దేనిం బొడిచితినొ వచింప నెఱుంగన్. ౩౯

వ॥ నావుడు శర్యాతి యయ్యదియు మునికి హేలనం బని యెంచి నెట్టన నప్పుట్టకడ కరిగి తపోవృద్ధుండును దుఃఖితుండును నగునమ్మానిం గాంచి తచ్ఛరీరావృతం బగువల్మీకంబు దెరలించి దండప్రణామం బాచరించి వినయమ్మున నిట్లనియె. ౪౦

క॥ తెలియక మత్పుత్రిక ని, న్నలయించినపనికిఁ గోప మందక తగుశీతలదృష్టి మనుపఁగో రెద,నలమున కోపంబు తాపసాగ్రిణులందున్.

ఉ॥ నావుడు మౌని వల్కు జననాథ! యొకించుక యేనిఁ గోపమున్ భావమునందుఁ జేర్ప నొకపట్టున నైన, భవత్తనూజ నా కీవిధి నేత్రఘాత మొలయించినదానికిఁ గా లభించె నీ కీవికలత్వ; మేను శపియించితి నందుఁ దలంపఁ బోకుమీ. ౪౨

క॥ అపరాధం బొండెఱుఁగక, తివ మొనరుచు శక్తిభక్తతతి కెవ్వారే, నపకారం బొనరిరచి సు, ఖపడుట చొప్పడునె వారుఁడు కనలక యున్నే. ౪౩

క॥ ముదుసలిని గ్రుడ్డివాఁడ న, నద నోరాజేంద్ర! యెవరు నా కిఁకఁ బరిచ, ర్యఁ దగం జేయుదు రని దీ, నదశన్ వగఁ జెందు మునికి నరపతి వలికెన్. ౪౪

క॥ మునివర్య! చాలినందఱు, నని పెద సేవకుల నీకు ననుగుణముగ సేవ నొనర్పఁగ; నీకనైనన్, మనమునఁ గోపమ్ము విడిచి మన్నింపు దయన్. ౪౫

చ॥ అనవుడు మౌని వల్కు నకటా! కడు గ్రుడ్డికి నాకు నే గతిన్ బనువడు నిష్ఠ; యే మొనరుపం దగువా రగుదుర్ త్వదీయులో

ననుచరు; లింత యేల? విను మాత్మజ నిన్ను మదీయసేవకుల్
దనిసి తపమ్ము చేసికొనెదల్ సుఖ మబ్బెడి దీన నీ కొగిల్. ౪౬

క॥ నీకొఱకె సేవ సేయు న, నాకులగతి నేఁదప మ్మొనర్చికొనెద నీ, కే
కాపు నీదు సైనిక, లోకమ్మునకెల్ల సుఖములు గలుగు దీనన్. ౪౭

క॥ జనవర! క్షమాపణల్ గో, రిన వాఁడవయేని న్యాయరీతిని నీవు, తి
నోసంగి పెండ్లి సేయుము, ముని నగునా కిడఁగ శంక మొనయుట
తగవే. ౪౮

క॥ అనవుడు శర్యాతియు న,మ్మునివాక్యము వినియు మిగుల మునుకొ
ను చింతన్, మునిఁగి యెడ తెగని యోజన, గొని యిటు నటు చె
ప్పఁడాయెఁ గువలయనాథా. ౪౯

చ॥ ముసలికి గ్రుడ్డికిన్ మిగుల మోటునకున్ సురకన్య నోనినా
దుసుత నొసంగి సౌఖ్యములఁ దూఁగఁగ నిచ్చు టొనర్చుటెట్లు? లో
త్త సుఖము గోరి యెవ్వఁడును మంచియుఁ జెడ్డయు నేర్చువాఁడు పు
త్రి సుఖము వాపి కాఁపురము దెళ్ళఁగఁ జేయునె కీర్తి గోరునే.

గీ॥ అక్కటా? కడు వృద్ధుని నంధు నెడ్డి, నితనిఁ బతిగా వరించి పంచే
షుబాణ, వినశమై యొప్పు మత్పుత్రి వేగునెట్లు, బ్రతికి యున్నంత
కాలంబు ప్రభకుఁ దక్కి. ౫౧

చ॥ తమ కనుకూలు లౌ పతులు తారసమైనను మేటి యుందచం
దములు గలట్టి కామినులు దక్కరులన్ గవఁగూడ నెంతు రీదు
ర్గమ యుగుజవ్వనమ్మున నొకం డిటువంటికుమాపి భర్తగా
నమరినఁ జెప్ప శక్యమె యహల్య సురేశ్వరుతోడఁ గూడదే. ౫౨

క॥ సురపతిచే వంచితయా, తరుణిం గౌతముఁ డెఱింగి తా శపియిం
పన్, బరమార్తిఁ జెందె నాడుకొ, మిరె నీయంధుని కొసంగ మే లె
టు లబ్బున్. ౫౩

వ॥ కావున ననను గుణదాంపత్యమునకన్న హేయంబు వేఱొం
డు లే దని నిశ్చయించి యమ్ముని కీబుద్ధి రాక విమనస్కుండై తనగృ
హమ్మున కరిగి మంత్రులం బిలిచి యిట్లను. ౫౪

క॥ అరయుఁడు మత్సుత సమ్ముని, వరునకు నీవలయుఁ గానిపతియునం
దా, తురత నిదుములం బడవలె, నిరుదెఱఁగుందక్క నన్య మిం దొ
కఁ డున్నే. ౫౫

వ॥ నావుడు మంత్రులు రాజేంద్రా! దుర్భగుం డగునమ్ముని కి
క్కన్య వనన్యసామాన్యలావణ్యగణ్య నొసంగుట మాకును వనభిమతం
బ యని చెప్పనాసమయమ్మున వారియింగితం బెఱిఁగి సుకన్యయట కే
తెంచి యిట్లనియె. ౫౬

ఉ॥ నాకొఱ కింతయాపద గనందగునయ్య నరేంద్ర! నేన య
వ్యాకులలీల నేగి మునివర్యుని మత్కృతదుష్కృతప్రియా
పాకృతనేత్రు నుద్ధరకృపాయుతుఁగా నొనరింతు నాత్మదా
నాకలనమ్మునన్ సుఖము లందుము స్వస్థత చెంది నావుడున్. ౫౭

చ॥ అవనిపుఁ డిట్లు పల్కు సచివానుచరుల్ వినుచుండ; నక్కటా!
శివశివ! యెట్లొనర్చెదవు సేవన మవ్వనమందు నిల్చి యా
చ్యవనున కక్షిహీనునకు సంతతకోపికి వృద్ధమూర్తికిన్
గువలయనేత్ర! మత్సుఖము గోరి నినున్ ముదిమానికిత్తునే. ౫౮

క॥ ధనధాన్యసమృద్ధునకున్, సునిశిత మగువయసు గల్గుసుందరునకు నం
దని నీఁదగు జనకుఁడు నిర్ధనునకు ముదుసలికి నిడుట ధర్మంబగునే.

క॥ ఉటజమ్మునఁటె! కాఁపుర, మఁటె! ముదుసలి కోపియు నగునం
ధుండఁటె! యక్కటె!నాతనయకుఁ బతియఁటె!, ఘటియించిననాకుఁ
బుట్టగతు లెట్లుండున్. ౬౦

క॥ అమ్మా! విను మేనును రాజ్యమ్మును వమ్మైనఁ గాని జంతుగొన న్ని
స్నమ్ముదునె దీనికై నేత్రమ్ములు లేకున్న ముసలితపసికి నేనై ౬౧

వ॥ అవశ్యమ్మును గాఁదగు కార్యమ్ములు కాక మాన వ ప్పట్లనే
ను ధైర్యంబు విడువనని పల్కుతండ్రికిఁ బ్రసన్నవదనయగుచు సుకన్య
యిట్లనియె. ౬౨

## సుకన్యాచ్యవన వివాహము.

చ॥ జనవర! యిట్టు లాడుటయు సమ్మత మెట్లగునయ్య! లోకపా
వనుఁడు మహామహుండు మునివర్యుఁడు వృద్ధనేల? నిత్య సే
వన మొనరించుదాన సుఖవాంఛ యొకింతయు నాకు లేదు భూ
జనులకునెల్ల నాకతన సౌఖ్యము గల్గుట యొండు చాలదే. ౬౩

క॥ వనమున నమ్మునివరు సే, వనమునఁ దగులొంది భక్తిపరవశనై యా
తనిమాఁట కడ్డుసెప్పక, జనవర! నీకున్ యశంబు సంపాదింతున్.

వ॥ అనునబ్బాల నిశ్చయమ్మునకు మంత్రులును నృపాలుండును బరమాశ్చర్యంబు నొందిరి పదంపడి శర్యాతి యమ్మునిపాలికిం జని నమస్కరించి మహాత్మా! మత్పుత్రి నొసంగెద ననుగ్రహించి గ్రహింపు మని విధివిధానంబుగ వివాహంబొనరించిన నతండు సంతుష్టాంతరంగుండై పరివారంబున్ గ్రహింపక కేవలకన్యాపరిగ్రహం బొనరించె నంత సైనికులకును రాజునకును సౌఖ్యంబు వాటిల్లె నిట్లు మునికిఁ దన్నొసంగి జనకుండు గృహంబు చేతెంచునయ్యవసరమ్మున నతనికి సుకన్య యిట్లనియె నయ్యా! నాయీభూషణంబులు గొని నాకు నజినంబును వల్కలంబును నొసంగుము. ౬౪

క॥ మునిపత్నివేషమ్మును, గొని నీకున్ సద్యశంబు గూర్పన్ మఱి నా
కును బరముగూర్ప నిప్పావనునిమదికి వచ్చునట్లు వర్తింతు నిటన్.

క॥ అనసూయ యత్రికి వసిష్ఠునకు నరుంధతియుఁ బోలె సుగుణుండగు ని
మ్ముని కేను బ్రీతగొల్పెద, ననఘా! నీ వింకఁ జింత నందకు మాత్మన్.

వ॥ నావుడు శర్యాతి యశ్రువులు కన్నుల నురల నక్కన్నియకు నజినంబును వల్కలంబును నొసంగె. ౬౫

గీ॥ భూషణములెల్ల దులిచి యప్పువ్వుఁబోఁడి, యంత మునివేషధారిణి
యగుటఁ గాంచి, జనవరుని భృత్యులెల్ల రోదన మొనర్చి, రధిప!
యక్కన్నెశీల మే మనఁగ వచ్చు. ౬౬

వ॥ ఇట్లు మునివేషధారిణి యగుతనసుతకుం జెప్ప లేక చెప్పి సపరివారమ్ముగ శర్యాతి నగరంబున కరిగె నంత నమ్మగువ పతిసేవా పరాయణ గావున. ౨౦

సీ॥ నలుదిక్కులకు నేగి నానావిధమ్ములౌ ఫలమూలములు దెచ్చి పజ్జ
నుంచి, యగ్నుల నలరింప ననుగుణం బగుసమిజ్జాలంబు శుష్కంబు
సంతరించి, తిలలును గుశలును దెచ్చి తోమినకమండలువుతో జత
గూర్చి కెలన నునిచి, యుష్ణోదకస్నాన మొనరింపఁగాఁజేసి యజి
నంబు పఱచి యం దల్ల నిలిపి॥ గీ॥ యనఘ! యిఁక నిత్యకర్మము
నాచరించు, కొను మని వచించి కర్మాంతమునఁ గరమ్ము, వట్టికొని
సంస్తరణమున నట్టె నిల్పి, మునికి ననుగుణ మైనభోజనము వెట్టు.

శా॥ నీవారాన్నముఁ గందమూలఫలముల్ నీరేజపత్రాక్షి యెం
తేవేడ్కన్ భుజియింపఁ బెట్టి తగుతృప్తిం జెందఁగాఁ జేసి పైఁ
గావించెన్ గరశుద్ధి కాళ్లు గడుగన్ "గైకొమ్ము తాంబూల మో
దేవా!" యంచు నొసంగు నాసనము పొందించెన్ గరాధారమై.

క॥ పిమ్మటఁ దదాజ్ఞఁ గొని దే,హమ్ము న్నిలుపంగఁ దగుఫలాహార మ్మ
కొమ్మ గొని సత్వరమ్ముగ,నమ్మునిసన్నిధికి వచ్చి యతివినయమునన్

క॥ పాదమ్ము లొత్తుచు నెయ్యాసి, యాదర ముట్టిపడ నడిగి యమ్మునిమణి కా
మోదమ్ము సంతరింపుచు, దాఁ దడయక యట్లొనర్పుఁ దగియెడిరీతిన్

వ॥ అంత సాయాహ్నం బగుడు హోమమ్మునకుఁ దగిన సంభారమ్ములు సంతరించి మధురమ్ము లగుఫలమ్ములం దెచ్చి భుజింపఁ బెట్టి తద్భుక్తశేషమ్ము గుడిచి సుస్పర్శాస్తరణం బొనరించి యందు శయనింపఁ జేసి పాదసంవాహనంబు సలుపుచుఁ గులస్త్రీధర్మ్మముల నడిగి తెలిసి కొనుచు నతఁడు నిద్రించిన తెఱం గెఱింగి తచ్చరణనికటమ్మున నల్ల నొరగి నిద్రించుచు నప్పు డప్పుడు మేల్కాంచి తగునుపచారమ్ము లొనర్పుచుఁ బ్రేమయుక్తమ్ముగ భక్తిపరాయణయై సేవించు. ౨౧

గీ॥ తన్వి వేసవిఁ దాలవృంతమ్ము విసరి, నిదుర పట్టెడిరీతి ననిలము గొల్పు
మగువ హేమంతమునఁ జలిమంటవైచి, యడుగు "సుఖమగునే"
యని యమ్మునీంద్రు. ౭౬

వ॥ బ్రాహ్మముహూర్తమ్మున మేల్కాంచి జలపాత్రమ్ముగొని శౌ
చార్థమ్ము నిజాశ్రమమ్మున కనతిదూరమ్మునకుఁ గొనిపోయి యట డించి
తా నొక్కకనుమఱుఁగగునెడ నుండి పదంపడి సన్నిధికిఁజని కేలువట్టికొ
ని యాశ్రమముఁ బొందించి యాసనమ్మున నుపవేశించి మృజ్జలమ్ములచే
నతనిపాదమ్ములు యథావిధిగఁ గడిగి యాచమనమ్మునకు జల మ్మొసఁగి
యథోక్తం బగుదంతకాష్ఠమ్ము దెచ్చి యిచ్చి యంత నుష్ణజలమ్ము సన్న
ద్ధం బొనర్చి యిట్లను. ౭౭

ఆ॥వె॥ ఏమి యాజ్ఞ తెల్పు మీఁక దంత ధావనం, బాయెనే మహాత్మ?
యమలమైన, యుష్ణజలము లివియు యొనరింపు స్నానంబు;హో
మసమయ మింక నొక్క తుటికి. ౭౮

క॥ ఈరీతి ననుదినమ్మును, నారాజతనూజ మౌని కాయాసేవల్, గూరి
మి నొనరించునతిథి, వారముఁ దనియించు నెల్లవారును మెచ్చన్.

వ॥ అంత నొక్కనాఁడు తదాశ్రమమ్మున కనతిదూరమ్మున ను
న్నతటాకమ్మునఁ గృతస్నానయై యేతెంచు నయ్యతివ నంతకుమున్నె
క్రీడార్థం బట కేగుదెంచినయశ్వినులు గనుంగొని తద్రూపమ్మున
కచ్చెరువడి నికటమ్మున కరుదెంచి ప్రీతిపూర్వకమ్ముగ నిట్లనిరి. ౮౦

క॥ ఒక్కింత నిలువు మోజలజముఖ! యశ్వినుల మేము మోదమ్మున ని
న్నొక్కటి యడిగెద మిక్కడ, కెక్కతమున వచ్చి తేడ కేగెదు.
చెపుమా. ౮౧

గీ॥ పంకజాక్షిరో? నీకు నెవ్వాఁడు భర్త, యెవని కాత్మజవీవకట, రెండవ
సిరి యనఁ, గలుగునీమృదుపదము లిక్కట్క శంపు, నేలఁ బొరసిన
మామది జాలి వ్రేడమె. ౮౨

అశ్వినులును సుకన్యయు సంభాషించుట.

క॥ కమలాక్షీ ? విమానమునకు, నమరెడినీ కిట్టియటవియం దంఘ్రిచర
త్వము వొల్చుటెట్లు? దాసీ,సముదాయముతోడ నేల చను దేరవొకో

గీ॥ రాజపుత్రికవో? యచ్చరవొ? వచింపు, మేమహాభాగ నినుఁ గన్న
దిందువదన?, నిన్నుఁ గైకొన్నభర్త వర్ణింపదగఁడె? యువని నీక
లిత్త దేవలోకాధికంబు. ౮౪

క॥ నిను నిత్యము గనుఁగొనునీ, వనమృగములభాగ్యదశయుఁ బక్షుల
పుణ్యం, బును నెన్న శక్యమే? పావనమయ్యెఁ భూమి నీదుపాదరజ
మునఁ. ౮౫

క॥ స్తుతిగాదు నీకు నెవ్వఁడు,పతి?జనకుం డెవఁడు?పద్మపత్రాక్షిరో?యీ
కృతకృత్యుల దర్శింపఁగ,మతి వొడమెఁ జెప్పువారిమనికి సదయతఁ

వ॥ అను నశ్వినులకు సుకన్య లజ్జాక్రాంతయై యిట్లను.

గీ॥ ఏను శర్యాతికూఁతురమానినీయుఁ, డై నచ్యవనమునీంద్రునకనుఁగు
భార్య, నంధుఁడును ముదుసలి యగునట్టిభర్త, కెల్లపుడు సేవ
సేయుదు నిచట నుండి. ౮౬

క॥ నను నాయనుమతిఁ గొని మా, జ్జనకుం డమ్మునికి నిచ్చె సద్వర్తనుఁడా
యనఘునియాశ్రమ మల్లది, చను దేఁ దగు మీర లెవరొ సచ్చా
రిత్రుల్. ౮౭

ఉ॥ నావుడు దస్ర లిట్లనిరి నాతిరో? నిన్నెటు లిచ్చెఁ దండ్రి దు
ర్భావుఁడు గుడ్డియౌ ముసలివానికి; భూషణరాజిరాజితం
బై వరవస్త్రభాజనమునై వెలయం దగుమేను వల్కల
పావృత మయ్యెనే విధికిఁ బాపముఁ బున్నెము లేదె యక్కటా.

ఉ॥ నీసరివచ్చు లేమ సురనీరజనేత్రలయందు నేని లే
దోసరసీరుహాక్షి? యెటు లోమెదు గ్రుడ్డికి భార్యవై; కటా ?
నీసొగసుఁ వయస్థితియు నేర్పును వమ్ముగ నిట్టు లుండ నే
లా? సమకాంతియుకుఁ డగునన్యు వరింపఁగ రాదె యుగ్మలీ, ౯౦

గీ॥ అంఘవరియించి జవ్వనం బపనయించి,జన్మమును నిష్ఫలంబుగ సల్ప
నేల?, వల్కలము లేడ? నీవేడ? వనమిదేడ?, కొనఁదగదె మాయిరు
పురం దొకొరుని సబల. ౯౧

గీ॥ అట్లు వరియించి నందనమందుఁ జైత్రి, రథమునం దెల్లప్పుడు మనో
రథము వెలయుఁ,గ్రీశ సల్పఁగ రాదె? యీప్రోశగాని,వృద్ధు నంధు
ని సేవించి యేమిఫలము. ౯౨

క॥ నరపాల పుత్రికవు నీ,కరయంగా రావె తగువిహారంబులు; సం
పరణసుఖ మిట్టివానిక్, బొరసినఁ జెడకున్నె యెట్టిపొలఁతికి నైనన్

గీ॥ ఫలజలాహరణమ్ముల బడలి మృదుల, మైన నెమ్మేనివాసి యింతైనఁ
గనక, నిజన మగునివ్వనమ్మున వృద్ధదాసి, వగుట మేలని తోఁచెనే
యంబుజాక్షి. ౯౪

క॥ అనునా సత్యులవచనము,లను విని యక్కన్య లోఁదలంకుచు ధైర్య
మ్మును జెంది ధర్మ్యమగు రీ,తిని మెల్లన నిట్టులనియెఁ దేఁకువ పేర్మిన్

ఉ॥ మీరలు సూర్యపుత్రులరు మీకు సమస్తమెఱుంగనచ్చు ని
ష్కారణ మన్యకాంత నగుసాధ్విని నన్నిటు లాడుటొప్పు న
య్యా? రవి కర్మపాత్రభవుఁ డారయుఁగా కఖిలంబు సాక్షియై
ధీరులు మిమ్ముబోటు లిటు తేఁకువఁ దక్కుదురయ్య యెవ్వెడన్.

క॥ కులకన్యఁగాని నేఁ బుం, శ్చలిఁ గా నధికప్రసంగసంగతికిం బో
వలవదు మారాడిన మి,మ్ముల శపియింపఁ గలరాజపుత్రికఁ జుండీ.

వ॥ అని సక్రోధమ్ముగఁ బల్కు నా సుకన్య వచనమ్ములకు భీతిల్లి
యాపెం బ్రసన్నఁ జేయ నెంచి వినయమ్మున నిట్లనిరి. ౯౮

క॥ శీలము గలబాలలలో, నేలీలావతియు నీకు నీడగునే? యో
లోలాక్షి? వరమొసంగెద, మోలింగై కొమ్ము సౌఖ్య మొందుము
దానన్. ౯౯

ఉ॥ మమ్ముఁ గవీశ్వరుల్ మిగుల మన్నన సేయుదు రెలయందు నం
దమ్మున మేటులంచు; విను తస్విరో? నీహృదయేశు నిట్టి రూ

పమ్మును బ్రాయమును గలుగువానిఁగఁ జేసెద నిందు నొక్కరుఁ
సమ్మతిమై వరించెదవె చాతురి మీఱఁగ నంచుఁ బల్కినన్. ౧౦౦

వ॥ సుకన్య విస్మయంబంది యాశ్రమమ్మున కరిగి పతిం గాంచి మహాత్మా! యశ్వినులను సూర్యపుత్రు లిరువురు తటాకంబుపొంత నున్ననన్నుం గాంచి కామాతురులై యిట్లనిరి. ౧౦౧

క॥ జరయును నంధత్వము నత్వరముగ నెడఁ బాపి యన్యదాకారముతో, సరియైనరూప మిప్పుడ, తరళాక్షిరో! పొసఁగఁజేసెదము నీ పతికిన్. ౧౦౨

క॥ కోమలి? యేకాకృతిఁదగు,మామూగురయందు నీదుమన సెవ్వరియం దే నరిగి నాతనిఁ బతిం,గా మోహింపు మని రిందుఁ గపటం బేమో. ౧౦౩

వ॥ ఇయ్యది నీకు నెఱిఁగింప వచ్చితి భవదాజ్ఞ యెట్లు లట్లు లొనరించెద నావుడుఁ జ్యవనుండు సంతుష్టాంతరంగుండై యిట్లను. ౧౦౪

క॥ దేవత లసత్యవాదులు, గా వలవదు వారియాజ్ఞఁ గావింపఁగ నెం తే వేగ మేగి యిటకున్,రా వెఱవొనరింపుమా సురభిషగ్వరులన్.

వ॥ అనవుడు నప్పతివ్రత యశ్వినులకడ కరిగి మీ రొనర్చిన సమయమ్మునకు మత్పతి యంగీకరించె నయ్యెడ కేతెంచి యట్లొనర్పుఁడనిన నయ్యిరువురును దబాశ్రమమ్మునకు వచ్చి యాపె కిట్లనిరి నీపతి నయఃప్రాప్తికై యుదకమ్మున మునుఁగవలయు ననుడుఁ జ్యవనుండు సమ్మతించి యట్లొనర్ప వారిరువురును నతనితో నత్తటాకమ్మున మునిఁగిరి

## చ్యవనునికి యౌవనప్రాప్తి.

ఉ॥ మూఁగురు నేకరూపులు సముజ్జ్వలభూషణు లత్యుదారతే
జోగతులై సుకన్య కడుఁ జోద్యము నందఁగ నీరు వాసి తా
రాగజయాన కిట్టు లని రంబుజలోచన? యెవ్వఁ డెందు నీ
రాగము గల్గువాఁడు ముగురిన్ గని యేరిగొ నంగఁ జెల్ల దే. ౧౦౫

క॥ ఏకాకారుల నేక, శ్రీకుల నేకస్వరాను కృతులన్ ముగురన్
రాకొమిరె గాంచి యెంతే,నాకులపాటొందవ భర్తకై చింతించున్.

ఉ॥ చక్కఁదనమ్మునన్ వయసుచందమునన్ ముగు రొక్కరూప యిం
దక్కట? భర్తయెవ్వఁ డని యారయనౌ మరణంబుఁ దక్క వే
ఱొక్కయుపాయ మెయ్యెడల నున్నదె? దస్రులరాకకల్మి నీ
చిక్కు తటస్థమయ్యె నెడసేయఁగ వచ్చునె యింద్రజాలమున్. ౧౦౯

క॥ పతి విడిచి యన్యుఁనిన్ స,మ్మతి వరియించితినయేని మహి నయశ
ము దుర్గతి పరలోకమునందగు, బతిరత లెల్లరును నవ్వఁ బాలగు
దుఁ గదా. ౧౧౦

వ॥ అని బహుప్రకారమ్ములఁ జింతించి యిందుఁ జగదంబఁదక్క శరణంబు లే దని నిశ్చయించి మనమ్మున నప్పరశక్తి న్నిల్పి యిట్లు ధ్యానించె. ౧౧౧

గీ॥ సరసిజోద్భవ? శంకరసాధ్వి? విష్ణు,సతి? సరస్వతి? యోగమజనని?
త్రికృతి, కారిణి? త్రిమూర్తిజనని? వికారశూన్య, ప్రకృతి పురుష
స్వరూప? నిన్ బ్రస్తుతింతు. ౧౧౨

ఉ॥ ఎల్లర భుక్తిముక్తు లిడి యేలెద నీ వఖిలేశి? జ్ఞానులన్
జల్లఁగఁ బ్రోతు జ్ఞానమిడి సౌఖ్య మొసంగెదు సిద్ధి నిత్తు వో
హల్లకపాణి? కీర్తి, జయ, మన్నియు నీ విడునట్టి వజ్ఞ లా
పల్లవ మైనఁ బాయుటకుఁ బొల్పడ రంబరో? ని న్నెఱుంగమిన్.

ఆ॥వె॥ ముగురు నొక్కరీతియె యనసి రిం దెవ్వఁడు,చ్యవనుఁ డతనిఁ దెల్పి
సకలజనని, మత్పతివ్రతాత్వమహిమంబు నిల్పి కా, పాడుమమ్మ వి
న్నుఁ బ్రస్తుతింతు. ౧౧౪

వ॥ ఇట్లు తన్ను మాటికిని సన్నుతించుచు మొక్కులిడెడి యా పరమపతివ్రత ననుగ్రహించి వరాంబ తన్మనోంబుజమ్మునందు నెలకొని దివ్యజ్ఞానంబు నొసంగె నంతరాజపుత్రియు. ౧౧౫

గీ॥ సమవయోరూపముల నొక్కసరణినొప్పి, ముగుర నీక్షించి తనపతి
నొగి నెఱింగి, కైకొనియె నశ్వినులు మోదకలితులైరి, రాచకన్ని
యశీలమర్యాద కెలమి. ౧౧౬

వ॥ భగవతీప్రసాదమ్మునఁ దనకాంత తన్ను వరించినందులకుఁ
జ్యవనుండు సంతుష్టాంతరంగుండై కన్నులారఁ దననెచ్చెలిం జూచుచు
గమనోన్ముఖు లగునశ్వినులకుఁ బ్రీతిపూర్వకమ్ముగ నిట్లనియె. ౧౧౭

మ॥ నయనశ్రీ చెడి వార్ధకంబు గొని విన్నాణంబు లేకుంటచేఁ
బ్రియురాలిం గరఁగింప నేరక వనిఁ బెంపేది యున్నట్టి నన్
దయకల్మిన్ గను కన్నులున్ వయసు సౌందర్యంబు చేకూర్చి పె
ద్దయు సంసారసుఖాత్ముఁ జేసితిరి మిత్రత్వంబుదై వారఁగన్. ౧౧౮

క॥ ఉపకారులైన మిత్రుల, కుపకారము సేయకుండు నొగి నెవ్వఁడు వాఁ
డపకీర్తికిఁ దానకము ఋణపరీతుఁడు వానిజీవనము విఫలమగున్.

వ॥ కావున మీకుఁ బ్రత్యుపకారం బేమియొనర్తు భవద్వాంఛి
తంబు వెలువరింపుఁడు నావుడు మునివరునకు నాసత్యు లో మహాత్మా!
మాకు నస్మత్పితృప్రసాదమ్మున నఖిలమ్మును గలయదియు మామనోరథ
మ్ము పూరింప నిచ్చయేని యొక్కండు గలదు వినుము. ౧౨౦

గీ॥ అమరు లెల్లరు సోమపానావసరము, లందు బహిర్వెట్టి రనఘ! మ
మ్మధ్వరముల, భిషజు లనునొక్కమిషమునఁ బ్రీతి గల్గె, నేని మాక
ది సాధింపు మిద్ధశక్తి. ౧౨౧

వ॥ కనకాచలమ్మునఁ జతురాననుగుఱించి శక్రుండు జన్నం
బొనర్చినతఱి మాకీయవమానంబు ఘటించె నియ్యది యెడప నీవ సమ
ర్థుండ వనునాశ్వినేయులకుఁ జ్యవనుండు ప్రీతుండై యిట్లను. ౧౨౨

క॥ మీకతన వయసుఁ గన్నులు, నాకారము గలిగె నాకు నసఘులు
మీకున్, బ్రాకారిన్ వారించి ని, రాకులగతి సోమపాన మది నే
నిత్తున్. ౧౨౩

వ॥ ఇత్యాది మహామహులందగు శర్యాతి నృపాలుముఖమ్మున నవర్త్వమ్మును నగు ననుడు వారలు సంతుష్టాంతరంగులై స్వర్గమ్మునకు నరిగిరి. చ్యవనుండును మనోహారిణి యగుసుకన్యం గూడి యాశ్రమమ్మునకుం జనియె ననుచు జనమేజయుండు మహాత్మా? దేవబలమ్మునకును మనుష్యశక్తికిం దారతమ్య ముండెడిఁగదా? చ్యవనుండు దేవాధిపు నెట్లు వారించి యాశ్వినేయులకు సోమం బిప్పించె ననుడు వ్యాసుం డిట్లను నట్లు మునివరుండు సుకన్యాసహితుండై స్వాశ్రమమ్మున సకల సంసారసుఖమ్ము లనుభవించుచున్నంత నొక్కనాఁ డక్కన్నియతల్లి చింతాతురయై తనపతి కిట్లను. ౧౨౪

క॥ ముని కంధునకు నొసంగితి, వనవద్యాంగి యగుకూఁతు నక్కట?
యది యెవ్వనమున మృతిఁజెందెనొ? జీవనమున నున్నదియొ చూడ
వలదె యొకింతన్. ౧౨౫

గీ॥ కందమూలఫలమ్ములఁ గాలమెల్లఁ, గడపుమునివేషధారిణిఁ గన్న
కూఁతుఁ, బ్రాణ మవశేషముగ నుండుపరమసాధ్వి, నొక్కపరి
చూడకున్న నే నోర్చు టెట్లు? ౧౨౬

వ॥ నావుడు శర్యాతియు సంశ్రితవ్రతుం డగునమ్మానినితల్లుఁ జనిఁ గొలిచి సుఖంబున్నకొమిరెం గగ మన మిపుర మయ్యెడ కేగుటయు కర్జం బని తత్సహితుండై రథం బెక్కి చ్యవనాశ్రమమ్మునకుఁ జనువాఁడు ముందట. ౧౨౭

క॥ కనుఁగొనియె రూపమున జవ్వనమున నవ్వనము శోభ వడయఁగ
నొనరించునితాంతకోమలాంగుని, ననఘునిఁ జ్యవనమునిఁ దనకు
నల్లునిఁ గూఁతున్. ౧౨౮

క॥ కనుఁగొని విస్మితుఁడై యే, మనఁ దగు మౌనివరుఁ జంపి యుష
మొదిఁ గిట్టన్, బనుపడితి నకట? యెంతటి,పని చేసె మదీయపుత్రి
పాపాత్మికయై. ౧౨౯

గీ॥ మదనవేదన సైఁపక మగని పెచ్చు, పెరిఁగి మత్పుత్రి యంధుని వృ
ద్ధు నతనిఁ, జంపి యన్యుని వరియించె శక్య మగునె?, జవ్వనంపు
మదం బెట్టిసాధ్వి కేని. ౧౩౦

క॥ మనుకులమున నేఁటికి మ,త్తనయకతనఁ గందు గలిగెఁ దద్దయు
నింద్యం, బనఁదగదె పుత్రికం గను,జనుజన్మము; కామిరెబల్ దోసం
బగు గృహికిన్. ౧౩౧

గీ॥ ఎన్నియో పాపములు చేసెనేని వాని, కుదయమందుఁ గుమారిక;
యొడ్ల నవఁగ, నేల? వృద్ధున కంధున కెటిఁగి యెటిఁగి,కన్నె నిచ్చితి
నాత్మసుఖంబు గోరి. ౧౩౨

క॥ ఏవానిపుత్త్రి కుత్సిత, యై వెలిఁ బడు వానిజన్మ మధమాధమ మెం
తే వెదకి కామిరె నిడఁదగుఁ, గోవిదునకు ధనికి రూపగుణసహితు
నకున్. ౧౩౩

గీ॥ ఎటిఁగి చేసినఫల మిష్ట మెదురుకొనియె, మనుకులం బనుశశికిఁ గం
దనువువడియెఁ, గులమునకు హాని దెచ్చితి సొలవ కేగి, తెంపరినిఁ
గూఁతు దుర్గతిఁ దుంప వలదె. ౧౩౪

వ॥ అని మఱియును.

గీ॥ పాతకమ్ములకెల్లను బాతకంబు,స్త్రీవధము దానికన్నఁ బుత్రిక వధిం
చు, టుక్కుడగు నింత కెక్కుడై పొక్కుఁ గాదె, లోకనింద యిసీ!
యెంత శోక మొసవె. ౧౩౫

గీ॥ స్నేహశృంఖల తెగఁద్రెంప సాహసంబు, పడయుఁగా నేర లోకాప
వాద కెట్టు, లోర్చి తలయెత్తికొందు నెట్లోర్పు దొడరు,ననుచుఁ జిం
తించె మిగుల శర్యాతి నృపుఁడు. ౧౩౬

వ॥ అట్టియెడ సుకన్య దౌదవ్వుల జనకుం గాంచి యెదురు చని
చింతాదంతురితాంతరంగుం డగు నమ్మానవపతిచిత్తం బెఱింగి యతని
కిట్లను. ౧౩౭

క॥ శతపత్రనేత్రు రూపసి, నతులిత మగుజవ్వనమ్ము నంది యొలయుమ
త్పతిఁ గాంచి చింత నొందక, మతి శంకఁ విడిచి వేనమస్కృతు
లిడుమా. ౧౩౮

వ॥ వైశంబ రాదమ్ము సందియం బేల? యనుపుత్రివచనమ్ములకు
సక్రోధుండై శర్యాతి యిట్లను. ౧౩౯

క॥ జరఠుం డంధుఁడుఁ దాపసి, యరయఁగ నీభర్తయాతఁ డతియౌవన
దుర్భరుఁడు మదోన్మత్తుఁడు సుందరుఁడేగతి నమ్మ వచ్చు ధవుఁ డని
నీకుఁ. ౧౪౦

క॥ మరుబారిఁ జిక్కి యమ్ముని, వరు నెట్లనియును జంపి పాపినివై సుం
దరు నొక్కని నాథునిఁగా, వరియింపవుగా కుమారి? వంగడమడఁగఁ

క॥ అని నీకై శోకమ్మున, మునిఁగెద నెటఁ బోయె నకట? మునివరుఁ డీనూ
తనపురుషుం డిట కేమిక, తన వచ్చెఁ దెల్పుమనుడుఁ దగునగ
వ్వెలయఁ. ౧౪౨

వ॥ సుకన్య జనకునికరంబు పట్టికొని సత్వరగమ్మునఁ దనపతియున్న
డకుఁ గొనిపోయి చూపి యిట్లను. ౧౪౩

క॥ అయ్యా? నీయల్లుం డితఁ, డియ్యెడ సందియము వలవ దించుకయును
బల్, నెయ్యమ్మున నశ్వినులిటు, చయ్యనఁ గమలాయతాక్షు సలి
పిరి సుమ్మీ. ౧౪౪

క॥ నీతిధురంధరుఁ డగు శ, ర్యాతికి నీ కాత్మజాతనై యే నకటా, పాత
కమున కొడిగట్టుదు, నేఁ తడయక మ్రొక్కు మతని కెంతయు భక్తిఁ.

వ॥ పదంపడి నీ వడిగెదేని నీ కామూలాగ్రమ్ముగ నమ్మునివరుం
డెవచియించువాఁడనుడు శర్యాతి త్వరితుండై యమ్మహాభాగునకు నమ
స్కరించి మహాత్మా? నీకెట్లు నయనమ్ములు గలిగె దివ్యసుందరం బగునీ
విగ్రహంబు సంప్రాప్తం బగుటెట్లు వృద్ధత్వం బెటకరిగె నున్నది యు
న్నట్ల వచింపుము నావుడు మామ కల్లుం డిట్లనియె. ౧౪౬

గీ॥ దైవవశమున నొక్కెడ దనుజ్రిలిటకు, వచ్చి కరుణించి యారూప
మిచ్చి రెలమి, నుపకృతి నొనర్చునవ్వారి కొక్కవరము, పత్నివ్యాప
కృతి కొసంగితిఁ బార్థివేంద్ర. ౧౪౭

క॥ మారాజగు శర్యాతిమ,హారా జొనరించు మేటియజ్ఞమ్మున మి,మ్మారా
జుపంక్తి నిడి పెం,పార సోమరస మొసఁగు నట్లొనరింతుర్. ౧౪౮

వ॥ పిమ్మట మద్దత్తంబగువరంబు గైకొని వారు స్వస్థానంబున
కరిగి రిందసత్యంబు లవలేశంబును లేదు విశ్వసించి నిర్మలాంతఃకరణుం
డవై యీపీఠమ్మునఁ గూర్చుండుము నావుడు రాజు సంతుష్టుండై యట్లొ
నర్చి నిట్లు భార్యయుం దాను నమ్మునినికటమ్మునఁ బుణ్యకథాశ్రవణ
మ్ముల నుండు నెడ శర్యాతికిఁ జ్యవనుం డిట్లనియె. ౧౪౯

శర్యాతియజ్ఞంబొనర్చుట.

చ॥ నరవర! జన్న మొక్కటి రయొనర్పుము నర్ గొని యమ్మఖమ్మునర్
సురపతి ధిక్కరించి వెస సోమరసంబు నొసంగువాఁడ నా
వర మని వార్యమై తగ నసారణ దస్రులకుర్, సురల్ మునుల్
ధరణిసురుల్ నరేంద్రులు ముదమ్మున నాదగుశక్తి మెచ్చఁగర్.

వ॥ నావుడు శర్యాతి యంగీకరించి తనపురమ్మున కరిగి శుభదిన
మ్మున మఖయత్నం బొనర్చి వసిష్ఠాదిమునులం బిలిచి చ్యవనపురస్సర
మ్ముగాఁ గ్రతు వొనర్చుచుండె నయ్యెడ నింద్రపురోగములై సుర లమ్మ
ఖమ్మునకు వచ్చుటయు నశ్వినులు వారిపిఱుందన వెడలి యట కరుదెంచి
యొక్కెడ నుండిన వారిం గాంచి శక్రుండు సురలం గూర్చి. ౧౫౧

క॥ అకలంకము క్రతు విది యే,మికతమ్మున భిషజులిచట మెలఁగుట
సోమం, బకటా! వీరికి నర్హం,బౌనొ? పిల్చినవార లెవ్వరో? తెంపరులై

వ॥ నావుడు నమరులు నిరుత్తరులైరి పదంపడి సోమపానావసర
మ్మునఁ జ్యవనుం డశ్వినులభాగంబు తనకరమ్మున నిడికొన్నడు నిందుృం
డతని వారించి వీరలు చికిత్సకు లగుట సోమపానానర్హులు వీరల కీగ్ర
హం బీవలవదు నావుడుఁ జ్యవనుం డెదురొ్కని శక్రున కిట్లను. ౧౫౩

గీ॥ సంకనలు గా రహార్పతిసతికిఁ బుట్టి, నట్టికొమరులు వీర లేయఘము
చేసి?,రనఘు?లె ట్ల గ్రహార్హతనంది రీమ,ఖమునఁ దెలియంగవలయు
నిక్క మ్ము మాకు. ౧౫౪

క॥ ఈమహిపతి నా పేరణ,చే మఖమొనరించె నిందు సిద్ధంబుగ నే
నీమహితుల కిప్పించెద, సోమరసము నీవు నెల్లసురలును జూడఁగ.

క॥ ఈరవిపుత్రులు మిగుల ను,దారులు ముదిమి నెడపి ననుఁ దరుణవ
యస్కుఁగ, గా రచియించిరి ప్రత్యుప,కారము నొనరించి ఋణము
గడతేర్పవలెఁ. ౧౫౬

వ॥ నావుడు శక్రుం డోముసీం ద్రా? వీరలు దేవతలచేఁ జికిత్సకు
లగుటతన సోమపానానర్హు లని నిందింపఁ బడిరని నుడివితిఁగాదే యిం
తేల? గ్రహంబువీరికి సంతరింపకుమనుడు నక్రోధుఁడై చ్యవనుం డిట్లను

క॥ ఏఁ జెప్ప నేర్తు వీరం,భోజాప్త సుతులు సోమమున కర్హు లహ
ల్యాజార?,, వృత్రహర! ని, ర్వ్యాజం బిక్కోప మింక విడుపం దగదే.

వ॥ అని యింద్రునకు సాకూతంబుగ నుత్తరం బొసఁగి యాశ్వి
నేయుల భాగంబు తపోబలమ్మునఁ గైకొనునమ్ముని నొక్కండును వారింప
కుండెఁ బదంపడి యిందుడుం డతికుపితుండై చ్యవనుం గాంచి సరభస
మ్ముగ నిట్లను. ౧౫౯

గీ॥ ఎన్నఁడును లేని మర్యాద నేర్పరించు, పాటివాడవె? యోరోరి బ్రహ్మ
బంధు?,విశ్వరూపుని బలె నిన్ను వేగ చంపి, శత్రుహీనుండనగుదు
నిష్కంటకముగ. ౧౬౦

వ॥ నావుడుఁ జ్యవనుండిట్లను.

గీ॥ తేజమున రూపమున ధనాదికమున నిర,వుర నఖండులు నీకనాదర
మువలవ, దెంతివారలు గా కున్న వృద్ధునంధు, నమరతుల్యునిఁ జేయు
నేర్పమరు లెట్లు. ౧౬౧

వ॥ మహానుభావు లగువీరలు తక్కుఁగల దేవతలకు లొచ్చు
గారని నిశ్చయించి కొను మిట్టి పూజ్యుల నెడచేసి నీవును నమరులును

నెట్లు సోమంబు గ్రహించెదరు నావుడుఁ గోపోద్రేకమ్మున నిందుం
డతని కిట్లను. ౧౬౩

క॥ ఎన్నివిధమ్ముల వీరలు, జన్నమున కనర్హు లీవు సాహస మమరన్
బన్నితివయేని భాగము, గ్రన్నన నీశిరము ద్రెళ్ళఁగా ఖండింతున్.

వ॥ అనునింద్రవచనమ్ములకుఁ దలరక చ్యవనుండు సోమపాత్రం
బాశ్వినేయుల కొసఁగిన వారలును బానాసక్తులగుట వైళమ గ్రహించి
రంత వాసవుండు వెండియు నిట్లను. ౧౬౪

క॥ ఈవలవము స్వార్థమ్మున, కై వీరికి సోమపాత్ర మట్లొనియు నీ
పై వైచెద వజ్రమ్మును, జావొదవెడు విశ్వరూపుచాడ్పుననీకున్.

క॥ నావుడుఁ గోపాకులుఁడై, దేవేంద్రుని లెక్కగొనక తివిరి చ్యవనుఁ
డ, ప్పావనులకు సోమమిడి య, థావిధి గ్రహియింపఁ జేసె ధార్ష్ట్య
ముకలిమిన్. ౧౬౬

క॥ కడుఁ గనలి యింద్రుఁ డమ్ముని, గడ తేర్పఁగ నెంచి సురలు గనుఁగొను
చుండన్, విడిచె శతకోటిసూర్యుల, నెడపెడి శతకోటి నృపతి కెద
దిగు లొదవన్. ౧౬౭

క॥ తనపైకి నుఱుకువజ్రం, మ్మును జ్యవనుఁడు తపముచేవ మొగిపించి జగ,
మ్మున కాశ్చర్య మొదవ స్తం, భన చేసెన్ మునులకెంతయు వాసవుఁ
డనఁగన్. ౧౬౮

వ॥ అట్లు వజ్రమ్ము నాఁగి కృత్యచే నింద్రు నడంప నెంచి యగ్ని
యందు సమంత్రకమ్ముగ హోమం బొనరించుటయు. ౧౬౯

ఉ॥ క్రూరుఁడు ధారుణీధ్రమునకున్ సరి వచ్చెడిమేనివాఁడు బల్
దారుణదంష్ట్ర లొప్పెడియుదగ్రభుజాబలశాలి ఘోరుఁడున్
వీరుఁడు రక్కసుం డొకఁడు వెల్వడియెన్ మదనామకుండు ని
ర్ధారణ సేయ రా దతనిదర్పము చిల్వల తేనికేనియున్. ౧౭౦

సీ॥ నాలుగుదంష్ట్రలున్నతములై నూఱేసి యోజనమ్ములనిడు పొలయు
వెలయుఁ, దక్కినదంతములు దశయోజనమ్ములు ప్రత్యంతపర్వతాభ

ములు బాహువు, లాకసం బంటుభయానకం బగుజిహ్వాకంఠంబు గోత్ర శృంగఁబుఁ బోలు, గాటుకకన్నును గడుసల్పు దేహంబు వక్త్రంబు భయదంబు వానికనులు॥ గీ॥ దావదవతుల్యముల్ కేశతతులుమిగుల వక్త్రజము లోక్కహనువు భూమ్యంతరమునఁ, దక్కినది యంబర మ్మునఁ దనరునిట్టి, మహితరీతిఁ జెలంగు దుర్మదుఁడు మదుఁడు.

క॥ వదనమున వజ్రి మిడికొని, కదనమ్మున కభిముఖమ్ముగాఁ దగునాము
ర్మదుని మదునిఁగని సురలున్, దదధిపతియు భీతభీతదశనున్న యెడన్

ఉ॥ ఘోరత దృష్టులం గొలిపి కుంభిని యంబర మొందు గాఁగ గం
భీరరవం బొనర్చి మెయి వెంచి జగత్త్రయ మొక్కపెట్ట నా
హారము చేయురీతిఁ గనన్మై సురనాథునిమీఁది కేగె నా
హారవ మాచరించి సుర లందఱు చిందఱవందఱై తగన్. ౧౭౩

వ॥ అట్టియెడ స్తంభితబాహుం డగునింద్రుండు కాలసన్నిభు నవ్వానిం గాంచి భయమ్మున బృహస్పతిం దలఁచికొన నతండు స్మరణ మాత్రమ్మున నరుదెంచి యతని కిట్లనియె. ౧౭౪

గీ॥ చ్యవనునితపోబలమ్ము దుస్సాధ మతని, కతన నుదయించె నీతఁ డఖండ
బలుఁడు, మదుఁ డనెడిరక్కసుఁడు వీడమరులకు బలె, నాకును నజే
యుఁ డెట్టిమంత్రములకేని. ౧౭౫

గీ॥ శక్తిభక్తులకోపమ్ము సంహరింపఁ, దరమె యెవ్వారికేఁ దత్తఱము
మాని, శరణు గొనుమయ్య చ్యవనుని; సంహరింప, నేర్చు నాతండు
దనకృత్య నెమ్మి గ్రమ్మి. ౧౭౬

వ॥ అనుగురువచనమ్ముల వినమ్రుండై శక్రుం డత్తపోధనునికి నమస్కరించుచు భయమ్ముపెంపున నిట్లను. ౧౭౭

క॥ క్షమియింపుమయ్య నీవాక్యము దప్పునె యశ్వినులకు నయ్యెడి నిఁక
సోమము నీదుతపముశక్తిమ, హిమ సూడఁగ నాయొనర్చు టిది
నిక్కముగన్. ౧౭౮

చ॥ అనవుడు నమ్మహాముని ‘‘భయంపడనేల”యటంచుఁ బేర్మిన
య్యనిమిషనాథుఁ బల్కి మృగయామధుపానదురోదరాంగనా
జనములయందు నమ్మదుని సంతతసుస్థిరుఁగా నొనర్చి య
శ్వినులకు నిందుృసమ్మతినిఁ జేసి యొసంగె గ్రహం బవార్యతన్.

వ॥ తపోబలసంపన్నుండగు చ్యవనుం డివ్విధమ్మున నశ్వినులఁ గృతకృత్యుల నొనర్చె నంత శర్యాతి సమాప్తవ్రతుండై మంత్రులం గలసి యతనిమహత్త్వమ్మున కద్భుత మందుచు నగరమ్మున కరిగి రాజ్యమ్మొన ర్పుచుండె. ౧౮౦

గీ॥ అతని కానర్తుఁ డుదయించె ననఘమూర్తి, తత్సుతుఁడు రేవతుఁడు
సముద్రమ్మునందుఁ, దగ విని ర్మించెఁ బురిఁ గుశస్థలి యనంగ, నతని
కొకనూఱుగురు పుత్రు లవనినాథ. ౧౮౧

వ॥ అందుఁ గకుద్మి జ్యేష్ఠుండు మఱియు నారేవతునకు రేవతి యను నొక్కకొమరితయుం బుట్టెఁ బుట్టె. ౧౮౨

## రేవతుఁడు బ్రహ్మలోకమ్మున కరుగుట.

క॥ అనుపమ లక్షణలక్షిత, సునిశితయౌవన విశేషశోభాస్పదమై
తనరఁగనకూఁతుం గని, జనపాలుఁడు పెండ్లి సేయ సమకట్టె వెసన్.

వ॥ అతండు స్వపరిపాల్యంబు లగునానర్తదేశంబుల నెల్లెడల న న్వేషించి తగినవరునిఁ గానక పదంపడి యొక్కనాఁడు బ్రహ్మనడుగువాడై తనపుత్రిక వెంటఁ బెట్టుకొని సత్యలోకమ్మున కరిగె నాపుడు జనమేజయుండు మహాత్మా! బ్రహ్మవేత్త యగుబ్రాహ్మణునకు గమ్యం బగుస త్యలోకంబు రాజునకెట్లు పోనయ్యె నిది యిట్లుండ మృతులకు స్వర్గం బలవడు నని శాస్త్రనిర్ణయంబుకదా? మరల స్వర్గస్థులకుఁ జ్యుతి గల్గెనేని మర్త్యమ్మునం గతి యగుట కేమి నిమిత్తము? నాపుడు వ్యాసుండు నరేంద్రా? యింద్రలోకమ్మును వహ్నిలోకమ్మును సంయమనీపురమ్మును వరుణలోకమ్మును కైలాసమ్మును వైకుంఠమ్మును ననునీ లోకము లన్నియును మేరువునం దెసంగెడి. ౧౮౩

ఉ॥ నాకము మానవుల్ చనుట యబ్బురమే? విజయుండు మానవుం
డే కద? శక్రసన్నిధికి నేగఁడె? యింతకుఁ బూర్వ మెందఱో
రాకలు పోకలుం గలుగురాజులు దైత్యులు లేరె? వారిలో
నీ కెఱిఁగింతు నొక్కఁడు సనింద్యచరిత్రు నృపాలశేఖరా ౧౮౪

వ॥ మున్ను మహాభిషుం డనురాజు బ్రహ్మలోకమ్మున కరిగి యచ్చట స్త్రీరూపధారిణియుఁ గించిన్నగ్నయు నగుగంగం గాంచి కామాతురుండై స్మితం బొనర్ప నాపెయు నట్టిద యయ్యె వారిరువుర బ్రహ్మ మర్త్యమ్మునఁ బుట్టుటకు శపించె నది యెట్లుండె. ౧౮౫

క॥ దానవులబాధ కోర్వక, శ్రీనాథునితోడ నెఱుఁగఁ జేయ సురలు పోఁ,గా నేరరె వైకుంఠము, దీనికి సందియము వలదు ధీరవతంసా.

క॥ అనిమిషలోకం బాదిగ, జన నగులోకమ్ము లెల్ల జనులకుఁ బుణ్యం బునఁబొల్చు తాపసులకుఁ,ఘనులగుమఖకర్తలకును గణ్యాస్ఫూర్తిన్.

క॥ అనవుడు జనమేజయుఁడి, ట్లను రేవతుఁ డెట్లు సరసిజాసనుకడకున్, దనతనయం గొని చనుమీఁఁ, దనైనవృత్తాంత మేమి తత్త్వజ్ఞనిధీ

చ॥ అని యడుగన్ నృపాలునకు వ్యాసమునీంద్రుఁడు వల్కె నీరజా సనుఁ గన రేవతుండు తనుజాసహితుంబుగ నేగి యంతి నా తనిసభ గాన మెంతయు ముదమ్మున నొప్పుచునుండఁ గొంత ద న్కను విని సంతసించి తదనంతర మంజలి మోడ్చి యిట్లనున్.౧౮౯

ఉ॥ దేవ? నమస్కృతిం గొని మదీయము విన్నప మాలకింపు మీ పావనశీల నాకొమిరె బహ్మవనీశుల నేతదర్హమై
భూవలయమ్మునన్ వెదకి పొందఁగ నేర సదృక్షు; మీఁద నిం కేవరుఁ డీవధూమణికి నీడగువాఁడు వచింప వేఁడెదన్. ౧౯౦

క॥ బలవంతునిఁ గులవంతుని, సలలితశీలుని మనోజ్ఞుఁ జాతుర్యమునన్ వెలసెడివాని వచింపుము,సాలవక రొక్కరుని రాజసూనుఁగుమారున్

వ॥ అనవుడుఁ జతురాననుండు రాజా? నీ వెందఱు రాకొమరుల నరసి యుంటి వింతకు వారలందఱును గాలగ్రస్తులై మృతి నొంది రియ్యది

సప్తవింశతమంబగుద్వాపరంబు భవద్వంశజులును నట్లనిహతు లగుట
నీపురంబును దైత్యులుంతిరం బయ్యె నని వెండియు. ౧౯౨

కం॥ శీతకరవంశతిలకుఁడు, నీతిఖ్యాతుఁడు యయాతి నృపకులజుం డు,ద్ధత
యశుఁ డుగ్రసేనుఁడు, భూతలపతి మధుర యనెడిపురి నేలు నొగిన్.

కం॥ అతనికొమరుండు గంసుఁ డత్యధికబలుఁడు, తండ్రిఁ గారాగృహ
మ్మునఁ దగులఁజేసి, యెల్లలోకమ్ములకు నార్త్తి యొసఁగ రాజ్య, మేలె
దైత్యాంశభవుఁ డెంతయేని జడుఁడు. ౧౯౪

కం॥ ధరణియు భారంబోర్వక, త్వరపడి నను వేఁడ వేల్పుతండంబులకుం
బురికొల్పిన నాయాజ్ఞను, మరు లంశంబులను బుట్టి మహి వెలసి
రొగిన్. ౧౯౫

ఉ॥ ఆయతపుణ్యుఁడై బదరికాశ్రమమం దమరాపగాసన
త్తోయపవిత్రకాయుఁ డయి తొల్లిఁ దపశ్చరణం జెలంగె నా
రాయణమౌని ధర్మసుతుఁ, డమ్మహనీయుఁడ దేవకీసుతుం
డై యలరారె యాదవులయందుఁ గృతార్థుఁడు గృష్ణమూర్త్తి నా.

కం॥ ఆకృష్ణమూర్త్తి దుష్టుని, నీకంసునిఁ జంపి రాజ్య మిచ్చెన్, గరుణా
వ్యాకులతనుగ్రసేనున, కాకంసునిమామ యధికుఁడఖిలవిధములన్.

వ॥ జరాసంధుండనువాఁ డల్లునిమరణమునకుఁ గోపించి మధురనరికట్టి సంగరంబొనర్చి కృష్ణునిచేఁ బరాజితుండై యరిగి కాలయవనుం బుత్తెంచిన మహాబలుం డగువానిరాక నెఱింగి శ్రీకృష్ణుండు యాదవుల నందఱ ద్వారక కనిపి తానును బిఱుందన చని యిప్పటికి నచ్చట వసింపుచున్నవాఁడు. ౧౯౮

చ॥ అరిమదహారి శేషఫణియంశమునన్ జనియించినట్టియు
ద్ధురుఁడు హలాయుధుం డతనితో నెనఁ డీడు మహానుభావుఁ డా
హరికిని నగ్రజుండు విను మంత్రజ నాబలభద్రమూర్త్తి కా
దరమున నిచ్చి పెండిలి ముదమ్మునఁ జేయుము కీర్త్తిశాలివై. ౧౯౯

వ॥ అట్లొనర్చి నీవు తపఃకాంక్షివై సురారామం బగుబదరికా
శ్రమమ్మున కరుగుము నావుడు రాజర్షి తనయుం దోడ్కొని ద్వారక
కరిగి బలరామున కక్కన్నియ నిచ్చి వివాహం బొనరించి పిదపఁ దప
మ్మున కరిగి కొండొక కాలమ్మునకు నయ్యమరాపగాతటమ్మునఁ గాయమ్ము
విడిచి దివం బలంకరించె నావుడుఁ బారీక్షితుం డిట్లను. ౨౦౦

ఉ॥ ఎంతయు నక్కజంబు వచియించెద వో మునినాథ! యా ధరా
కాంతుఁడు నూటయెన్మిది యుగమ్ములు సత్యమునందుఁ బుచ్చి దా
నంతకు నత్తలోదరికి నబ్బదె వార్ధక; మింతకాల మ
య్యింతికి నానృపాలునకు నేగతి నాయువు గల్గెఁ బల్కుమీ. ౨౦౧

వ॥ అనిన వ్యాసుం డిట్లను.

క॥ జర లేదు క్షుత్పిపాసలు, మరణము గ్లానియును భయ మమరకుం
డెడి నా, సరసీజాసనపదను, స్థిరులగు పుణ్యులకు నృపతిశేఖర! యె
పుడున్. ౨౦౨

వ॥ అని వెండియు.

గీ॥ మేరుగతుఁడైన శర్యాతిధారుణీశు, సంతతినిఁ బట్టి దానవుల్ సను
యుఁ జేసి, రథప! కొందఱు భయభీతు లగుచు నరిగి, రచ్చటచ్చటి
కెంతయు నవద లగుచు. ౨౦౩

గీ॥ మనువునకుఁ బుట్టె నిక్ష్వాకు వనెడినృపుఁడు, తుమ్ముకారణమున; నా
సుతునికతమున, సూర్యవంశంబు వర్ధిల్లె నార్యుఁ డతఁడు,నారదోప
దేశమున వనమున కరిగి. ౨౦౪

వ॥ అనవరతదీక్షాపరుండై వంశవృద్ధికై దేవినారాధించి తత్ప్ర
సాదమ్మున నూర్వురఁ బుత్రులం గనియె. నందు వికుక్షి జ్యేష్ఠుం డిట్లు
ప్రాప్తసంతానుండై యమ్మహీపాలుం డయోధ్య రాజధానిగ రాజ్యం
బేలుచు శకునిప్రభృతులగు నేఁబదుండ్రఁ గొమరుల నుత్తరాపథమ్ము
నకు నలువది యెనమండ్రి దక్షిణదేశమ్మునకును బ్రభువులం జేసి
యిరువుర నాత్మసేవనార్థంబు సన్నిధి నుంచికొనియె. ౨౦౫

## శశాదచరిత్ర.

గీ॥ సకలజనులకు సుఖము లెసంగ రాజ్య, పాలనం బొనరించు నప్పార్థి
వుండు, వనమునకుఁ బంపెఁ "బలముదె"మ్మని వికుక్షి, నష్టకాశ్రాద్ధ
మునకుఁ దా నంతఁ బిదప. ౨౦౬

క॥ జనకునియాజ్ఞం గొని వన, మునకుం జని శశములను సముచ్చితరీతిం
బనుపడు నాశరముల హరి, గొనికాయములఁ బడనేసి నరవరుఁ
డంతన్. ౨౦౭

వ॥ పరిశ్రాంతుండై యాఁకొని యష్టకావృత్తాంతమ్ము నేమఱి
యందొక్క శశమును భక్షించి నగరమ్మున కరిగి తక్కినమాంసంబు తం
డ్రికి నొప్పఁ జెప్పఁ బిదపఁ బ్రోక్షణార్థంబు తనకడ నుంచినదానిం
గాంచి కులగురుండు వసిష్ఠుండు గోపించి యిట్లను. ౨౦౮

క॥ ఇది భుక్తశేష మేగతి, విదితంబుగ శ్రాద్ధమున నివేదింపఁగ నొ
ప్పిద మగు నొకశశముం దీ, నఁ దినె నీ కొమరుఁ డనుచు నరపతి
యలుకన్. ౨౦౯

వ॥ వికుక్షిం గని విధిలోప మ్మొనర్చిననీ విట నుండఁదగవు
పొమ్మనుచు నతం డది మొదలు శశాదుం డనునామమ్మున నరణ్యమ్ములఁ
గ్రిమ్మరుచుండె. ౨౧౦

క॥ పదపడి యిక్ష్వాకుఁడు స, ద్విదితయశుఁడు చనియె దేవవిభునిల
యం బంతఁ దనజనకురాజ్యము స, మ్మద మలర శశాదనృపతి
మణి కైకొనియెన్. ౨౧౧

వ॥ అతండు ధర్మంబు దప్పక యయోధ్యానగరంబు పాలిం
చుచుఁ గొండొకకాలమ్మునకుఁ గకుత్స్థుఁ గనియె నితని కింద్రవాహుం
డనియుఁ బురంజయుం డనియును నామమ్ములు గలవు నావుడు జనమే
జయుండు నామభేదం బెట్లు కలిగె ననుడు వ్యాసుం డిట్లనియె. ౨౧౨

ఆశశాదునితనుజాతుఁ డవనిభర్త, యగుచుఁ బాలించు నెడ సురగల
సురవిజేతు, లగుచు నైకుంఠమున కేగి యబ్జనాభు, శరణుఁ జెందిన
నాతండు సదయుఁ డగుచు. ౨౧౩

చ॥ కలఁడు పరాంబికాచరణ కంజనిరంతర భక్తిసంపదా
కలితవిశేషశక్తియు నఖండయశుండు శశాదపుత్రుఁ డా
సలలితు వేడఁగాఁ జనుఁడు సత్వరులై ధర; కమ్మహామహుం
డెలమిని మీకుఁ దోడయి జయింపఁ గలాఁ డమరారిసంఘముల్.

వ॥ అనుసద్దేవు నానతిం గొని యమరులు నైశంబుగ నయో
ధ్యకుం జనిన శశాదతనుజుండు వారల నందఱఁ బూజించి వినయమ్మున
నిట్లనియె. ౨౧౪

క॥ ఎంత యత్న మొనర్చినయేని దర్శనం బొసంగని మీరిటు నాగృ
హంబు, కడకు విచ్చేయుటను నగ్రిగణ్య మయ్యె, జన్మము సురేం
ద్రులార? నిస్సంశయముగ. ౨౧౫

వ॥ దుస్సాధంబేనియు మీర లాజ్ఞాపించిన కార్యంబు నొనరిం
చెద నావుడు వార లిట్లనిరి. ౨౧౬

క॥ హరి ప్రేరేపఁగ నీకడ, కరుదెంచితి మిందునకు సహాయుఁడవై ని
ర్జరవైరులఁ దుంపుము నా, నరపతి యిట్లనియెఁ బేర్మి నాకుల
తోడన్. ౨౧౭

వ॥ మీరాజగు నింద్రుండు నాకు వాహనం బయ్యెనేని నను
నప్పక పార్ష్ణిగ్రాహుండనై సంగ్రామం బొనరింతు ననుడు సురలు
త్రిమపతి కెఱిఁగించిన నాతండును లజ్జితుండై హరిప్రేరణమ్మున నతనికి
వాహనం బయ్యెఁ బిమ్మట నమ్మహీపతి యుద్ధంబొనరించి దైత్యపుర
ముల జయించె నాఁటగోలె నతనికి నింద్రుండు వాహనం బగుట
నింద్రవాహుం డనియుఁ బురముల జయించుకతనఁ బురంజయుం
డనియుఁ గకుదమునఁ గూర్చుండుటం జేసి కకుత్థ్సుం డనియు నామ
త్రయం బన్వర్థకంబై నెగడు. ౨౧౮

# సప్తమస్కంధము.

గీ॥ దైత్యుల జయించి వారల ధనములెల్ల, సురలకు నొసంగి యున్న
వరుఁడు సురప, తికి సఖత్వము నెఱపి వర్ధిష్ణుఁ డయ్యె, నతనికులజుఁ
గాకుత్స్థు లవనినాథ. ౨౨

వ॥ వారల వివరించెదఁ గకుత్స్థునికిఁ గాకుత్స్థుండును, వాని
బృథువును, వానికి విశ్వరంధియు, విశ్వరంధికిఁ జందుండును, జం(
నకు యువనాశ్వుండును, నారాజునకు శావంతుండునుం, గలిగిరి. ౨౨

క॥ శావంతియనెడి నగరం, బావిభుఁ డాత్మాభిధాన మలరఁగఁ బృథు
శ్రీ వెలయఁగఁ గట్టించె ధ,రావలయమ్మునకునెల్ల రత్నం బనఁగ.

వ॥ శావంతునకు బృహదశ్వుండును, నతనికిఁ గువలాశ్వుండు
బుట్టి రీతండు ధుంధువనురక్కసు జయించినకతన ధుంధుమారుం డ
బిరుదనామమ్ము నొందె నిమ్మహీపతికి దృఢాశ్వుండును, నతనికి హ
శ్వుండును, వానికి నికుంభుండును, నయ్యలఘునకు బర్హణాశ్వుండు
నిన్నరవరునకుఁ గృశాశ్వుండును, నవ్వానికిఁ బ్రసేనజిత్తును, నత
యౌవనాశ్వుండును, నమ్మహామహునకు మాంధాతయు, నుదయించి

క॥ ఆమాంధాతృమహీపతి, శ్రీమంతము లగుచు మిగులఁ జెలువొ
దెడి సద్ధామములు నూటయెనిమిది, ధామహిఁ గట్టించె శక్తి తేఁ
రమహిమ్నె. ౨౨

## మాంధాతృచరిత్ర.

వ॥ ఇమ్మహీపతి యెల్లరం బోలి మాతృగర్భమ్మునం గాక పి(
దరమ్మునుండి యుద్భవించె నావృత్తాంతమేజయుండని యెట్లనుడు వ్యాస
డిట్లను. ౨౨

గీ॥ యౌవనాశ్వునకును భార్య లనఘమతులు, పూర్వ రిందొక్క
కైనను జనింప, దయ్యె సంతాన మానృపుఁ డాత్మజాతు, ల
మనమ్మునఁ జింతించి యొకఁడు నొకట, ౨౨

వ॥ వనమ్మునకరిగి ఋష్యాశ్రమమ్ములు సేవించుచు నచ్చట నిశ
నమ్ములు విడువ వారును నతని దుఃఖితుఁగానెఱిఁగి కరుణించి రాజ

నీమనమ్మునఁ గలచింత యెయ్యదిః నొడువు మన్నానికిఁ బ్రతీకారం బొన
రింతము నావుడు నృపాలుం డిట్లను. ౨౨౭

మ॥ ధనధాన్యమ్ములు మేటిగుఱ్ఱములు భృత్యవ్రాతముల్ నాగముల్
ఘనరాజ్యమ్ము సుఖమ్మునుం గలదు చక్కంగన్ ముదం బిచ్చుజ
వ్వనులు న్నూరున్వూరుభార్యలాఃకలరు తద్వ్యామాత్యులం దొక్కయుం
గనక్కైనన్ సుతలబ్ధి లే దిదియ శోకం బెప్పుడు న్నామదిన్. ౨౨౮

వ॥ అపుత్రునకు గతి లేమి నన్ననుగ్రహించి సంతానార్థినగు నా
చేనద్దియే నొకయిష్టిం జేయించి కృతార్థుం జేయవేఁడెద నావుడుఁ దాప
సులిందఱ్ దేవతాకం బగునిష్టిం జేయించి యజ్ఞశాలయందు సంతానార్థ
మ్ముగా వేదమంత్రసమ్మంత్రితం బగునొకకలశం బునిచిన నన్నరవరుం
డానాటిరేయి తుషితుండై తద్గతంబు లగుజలమ్ములం గోరె నంత
మునులు మఱునాఁ డక్కలశంబున జలమ్ములు లేకున్న నీభార్యకునై
యునిచినజలమ్ము నీ వుపయోగించితివే యనుడు నతండును బిపాసచే
నట్లొనర్చితి ననియె వారలును దైవబలమ్మునకు శంకించుచు నిష్టిని
సమాప్తి చేసి తమయంతం జనిరి. ౨౨౯

గీ॥ అంత మంత్రబలమ్మున నన్నృపాల, కునకు గర్భోదయం బయి ఘన
తఁ జెంది, పూర్ణ మగుడు జనించె నత్పుత్రుఁ డొకఁడు, కుడికెలన
నుండి గర్భంబు పొడిచి చించి. ౨౩౦

వ॥ పిమ్మట దేవతలయనుగ్రహమ్మున నయ్యవనీపతి మృతుండు
గాకజే వింతఁబదపడి మంత్రులమాత్యకుం డగునాశిశువును ద్దేశించి "కం
*ధాస్యత్యయ"మ్మని విచారించుచుండ నింద్రుండేతెంచి తనతర్జనినాశిశు
వునోట నిడుచు "మాంధాతా" యనిపలికె నక్కతన నతఁడుమాంధాతృ
నామమ్మునఁ బ్రసిద్ధుండయ్యె. (* ధేట్ పానే, ధాస్యతి, ధాతా.) ౨౩౧

చ॥ అతఁడు జయించి భూవలయ మంతయుఁ; బిమ్మటఁ జక్రవర్తియై
యతులితరీతి నేలె జగ మయ్యవనీపతిభీతిఁ జేసి ద
స్యుతతి గిరీంద్రకందరలఁ జొచ్చుట నింద్రుఁ డొనంగెఁ బేరు సా
ర్థత నలరారి యొప్పఁ ద్రసదస్యుఁ డనంగ ననుగ్రహమ్మునన్. ౨౩౨

చ॥ విమలమనోహరాంగి శశిబిందుతనూభవ బిందుమత్యభి
ఖ్య మెఱయు సత్యవిప్రత నఖండయశుండు వివాహమాడి యు
త్తముఁ బురుకుత్సు భూరిగుణతత్పరుఁ ముచికుందు నిర్వ్యగ
గ్రిమముగఁ గాంచెఁ బుత్రుల జగద్ధితబుద్ధి నతం డతంద్రితన్.

క॥ పురుకుత్సునకు దయించెను, నరణ్యుఁ డతిధార్మికుఁడు మహాభాగుఁడు
త, న్నరవరునకు బృహదశ్వుం, డరయఁగ నాతనికిఁ బుట్టె హర్య
శ్వుండున్. ౧౩౪

వ॥ ఆహర్యశ్వునకుఁ ద్రిధన్వుండును నతనికి నరుణుండును వాని
కి సత్యవ్రతుండును బొడమి రతం డొక్కనాఁడు వివాహసమయమ్మున
నొకవిప్రకన్య నపహరించిన నద్దురాచరణంబున కోర్వక తత్పితరు
లొక్కమొగి నార్తులగుచుఁ జనుటయు నతనితండ్రియగు నరుణుండు
నృశంసుం డగుతనకొమరుం డెద్దియేని నొకదుష్కృత్యమ్మున వీరలఁ జె
నకం బోలు నని శంకించి వారల కిట్లను. ౧౩౫

క॥ నాకొమరుఁ డెఱిఁగి యెఱుఁగక, మీ కేమియొనర్చె ననుడు మే
లెంచక తా, మాకన్నియను బలాత్కృతిఁ, జేకొనియెన్ బెండ్లివే
ళఁ, జెనఁటివిధమునన్. ౧౩౬

## సత్యవ్రతోపాఖ్యానము.

ఉ॥ నావుడుఁ గ్రుద్ధుఁడై నృపతి నందనుఁ గని యిట్లు పల్కు దు
ష్టా! వృథ నీదునామ మకటా! యిది పాతకకృత్య మేమిగా
భావమునం దలంచితివి పార్థివజన్మము నెత్త లేదె! నా
కీవు సుతుండ వన్నయశమే! యొటకేనియుఁ బొమ్ము దుర్మతీ. ౧౩౭

వ॥ సత్యవ్రతుం డేనెయెడ కేగుదు నని యెదిరించి మాటికిని
బల్కుడు నతం డిట్లను. ౧౩౮

చ॥ శ్వపచులునేనిఁ జేయనియసత్కృతిఁ జల్పిననీకు నాశ్వపా
కపరిచయంబు న్యాయ్య మగుఁ గాన నటుల్ పొనరింపు మెంతయే

సపయుశ మిచ్చునీకతన నౌకునె యేను కృతార్థుఁడన్ గులం
బు పతిత మయ్యె నీజననమున్ గని యింతకు వంశపావనా. ౨౩౯

వ॥ ఇట్లు వసిష్ఠప్రేరితుం డగుజనకునిచే నిష్కాసితుండై సత్య
వ్రతుండు వనమ్మున కరిగి శ్వపాకులం గూడి ధనుర్ధరుండై వర్తించుచు
వసిష్ఠునియందుఁ గ్రోధమ్ము గలిగి యుండెఁ బదంపడి నరుణుండు పు
త్రార్థమ్ముగాఁ దపం బొనరింప వనమ్మున కరిగె నీయధర్మమ్ము కారణ
మ్ముగ నిందుఁ డారాజుదేశమ్మునఁ బండ్రెండువత్సరమ్ములు వర్షాభావం
బొనర్చె నట్టియెడ. ౨౪౦

క॥ ఆనృపతిదేశమునఁ దన, సూనుల సర్ధాంగి విడిచి సాలవకతపముం,
బూనఁ జనెఁ గౌశికుఁడు, గా నెగడెడియేటికడకు గాధిజుఁ డె
లమిన్. ౨౪౧

క॥ ఆకౌశికునర్ధాంగి క్షు, ధాకులులై శిశువు లన్న మన్న మనుచుఁ ద
న్నేకడఁ బీడింపఁగ బల్, శోకముపాలై మనమ్ము నుక్కి కలంగన్.

చ॥ పతి ధనహీన నై నసను బాలకులన్ ద్యజియించి యేగె భూ
పతియును లేఁడు చూచుటకుఁ బట్టణమందు; క్షుధార్తులై ననుం
బ్రతుకఁగ నీరు తిండికయి బాలకు; లెవ్వఁడు రక్షకుండు? దు
ర్గతి నెటు లీఁగుదాన బ్రతుకంగల రే సుతు లన్నహీనులై. ౨౪౩

ఉ॥ ఎల్లఱఁ జంపుకంటె మఱియిందొకనిన్ దెగనమ్ముదాన నే
నుల్లము రాయి చేసికొని; యోమఁగ వచ్చును వక్రియాప్తసం
పల్లవ మిక్కుమారులకుఁ బ్రాణము నిల్పఁగఁ గొంతదన్క; నే
తల్లికి నేనిఁ జొప్పడనిధర్మము ధాత విధించె నా కిటన్. ౨౪౪

క॥ అనిదైవగతికిఁ జింతన్, గొనుచున్ మధ్యమునియాతుతఁ గొంకక
దర్భల్, చొనిపినరజ్జువు దగిలిచి,తనగృహమున్ వీడి చనియెఁ దరుణి
వగ దగన్. ౨౪౫

క॥ మలమల మఱుఁగుచు నమ్ముని,లలనామణి సుతులు చెఱఁగు బాగుచు
రా నెం, దులకేనిఁ బోవునది యి,మ్ముల సత్యవ్రతునిమార్గమునఁ
గనుఁగొనియెన్, ౨౪౬

వ॥ సత్యవ్రతుండు నాపె నీక్షించి యిట్లనియె.

క॥ అకటా! యేడ్చెడి పుత్రకు,నకు నఱుతం ద్రాడు గట్టి నారీమణి! మి
న్నక యరిగెద వెందులకే, మికతం బెవ్వ తెవు తెల్పుమీ సత్యముగన్

క॥ అనవుడు తల్లలనామణి, యను విశ్వామిత్రుఁ డనెడియనఘాత్ముఁడు న
న్నును సుతులన్ డించి తపం, బున కరిగె న్న న్నెఱుంగు మునివరు
సతిగా. ౨౪౮

క॥ ధనహీన నై నకతమున, ననద నగుచు సుతులపోషణార్థముగా నం
దనులం దొక్కరుఁ డగువీ, నిని విక్రీతునిఁగఁ జేయ నేర్చితినసఘా.

చ॥ అనవుడు నానృపాలసుతుఁ డమ్మరో! యేమిటికిట్లొనర్ప నే
ననుదినమున్ భవత్సుతులయాఁకటికిన్ దగినట్టిభక్ష్యముం
గొని యరుదెంతు సత్యమునకుం జవదాఁటక తావకాశ్రమ
మ్మున నొకచెట్టునం దిడుదు మూటగఁ గట్టి గృహమ్ము చేరుమా.

వ॥ పదంపడి నీభర్తయును రాఁగలఁడు నావుడు నమ్మునివనిత
సంతసించి తనయాశ్రమమ్మున కరిగె నక్కుమరుండు గళబంధమ్ము కా
రణమ్ముగఁ గాలవుం డనఁ బరఁగె. ౨౫౧

క॥ ఆసత్యవ్రతుఁ డును వి, శ్వాసమ్మును భక్తియును గృపయుఁ గలిగి
సదా, దాసుండై మునివనితకు, గ్రాసం బిడు సుతసహితముగా
భుజియింపన్. ౨౫౨

గీ॥ మృగముల వరాహములను మహిషశశముల, ననుదినమ్మును గొ
ట్టి సత్యవ్రతుండు, గాధిసుతునాశ్రమముపొంతఁ గట్టుఁ జెట్టు,కొ
మ్మ కొకమ్ముల్లెగాఁ జేసి కూర్చి పేర్చి. ౨౫౩

వ॥ విశ్వామిత్రునిభార్య తన్మాంసంబుకతన సుతులఁ బోషించు
చుఁ గాలమ్ము గడపుచుంచె నిట్లుండ నట సత్యవ్రతునితండ్రి తపమ్మున

కరిగినది మొదలుగ నతనిపురమ్మును నంతఃపురమ్మును వసిష్ఠుండు గాపా
డుచు రాజకార్యమ్ములు నెఱవేర్చుచు నయోధ్యయం దుండె నయ్యెడ
నప్పురమ్మునకు సమీపమ్మునఁ దండ్రియానతిం జేసి దుర్గతిం బడియు
న్న సత్యవ్రతునకు నొక్కనాఁడు మృగమ్ము లెవ్వియుం గానరాక వసి
ష్ఠధేనువు పొడకట్టె దానిం గాంచి యతండు పూర్వక్రోధమ్మున వధిం
చి కన్యాంసమ్ము కొంతదిని తనయాఁకలిం దీర్చికొని తక్కుంగలపలలమ్ము
నప్పాదపమ్మున నెప్పటియట్ల బంధించె. ౨౯౪

క॥ ఆఋషిపత్నియుఁ దనదుక, మూఁకులకుం బెట్టి గోవుమాంసం బని
తా, నారయ నేరక యెంతేఁ, గూరిమి భుజియించె మిగులఁ గుతు
కంబెసఁగన్. ౨౯౫

వ॥ అంత వసిష్ఠుండు తనధేనువుమృతి నెఱింగి కోపాకులుండై
పశుఘ్నుం డగుసత్యవ్రతున కిట్లనియె. ౨౯౬

ఉ॥ ధేనువుఁ జంపి యెంతటికృతిన్ బొనరించితి వోరిదుష్ట! దో
షానుగతుండవై మును ధరామరదారహరించుటన్ జగ
న్మానితుఁడైన తండ్రియవమానము గైకొనుటన్ వృథాగతిన్
ధేనువు నిప్డు చంపుటను నిన్నుఁ ద్రిశంకుఁ డనంగ నొప్పెడిన్.

వ॥ నేఁడు మొదలీనామమ్మునం బొదలి జనులకుఁ బిశాచాకా
రమ్మునం బొడకట్టుచుండు మని శాపం బిచ్చిన నతం డాశాపమ్ము దా
ల్చి యయ్యాశ్రమమ్మున వసియించుచు నొక్కమునిపుత్త్రునిచేత నుప
దేశంబు వడసి జగజ్జననిం గుఱించి యఖండతప మ్మొనరించుచుండె నా
వుడు జనమేజయుండు మహాత్మా! త్రిశంకునకు వసిష్ఠశాపం బెట్లుతొలఁ
గె నొడువు మన నతం డిట్లనియె. ౨౯౭

గీ॥ అతఁడు పిశాచమై దేహ నాత్మ నిల్పి, తన్నవాక్షరమంత్రతత్పరమ
నస్కుఁ, డగుచుఁ దప మాచరించి హోమార్థియగుచు,నర్థి విప్రు
లకడ కేగియడిగె నిట్లు. ౨౯౮

వ॥ నాయొనర్చెడి నమస్కృతులఁ గొని మత్ప్రార్థనంబు సఫలం
బొనర్పఁ గోరెద నేను జిరమ్మునుండి నవాక్షరమంత్రరాజంబు జపియిం

చితి నిపుడు జపదశాంశమ్ముచే హోమంబు నలువ వలయు మీారలు ఋత్విజులరై యికార్యంబు నెఱవేర్చి కృతార్థుం జేయ వేఁడెద నన్నరుణపుత్రుం డగుసత్యవ్రతుఁగా నెఱుంగుఁడు నావుడు వార లిట్లనిరి.

క॥ తెలియంగ నయ్యె నీవా?, కులగురుఁడు వసిష్ఠమౌని కోపించి నినున్
జలిపెఁ బిశాచముగా నీ, కలవడునే? వేదవిహిత మగుకృతి సేయన్.

చ॥ అని తనుఁ దూలనాడుటయు నానృపనందనుఁ డేల నాదుజీ
వన మిఁక నేమి నేయుదు నపాత్రుఁడ రాజ్యము లేమి చేసె మ
జ్జనకుఁడు దేశికుం డిడెఁ "బిశాచమవై చెడు" మంచు శాప; మె
ప్పనికి ననర్హతం బొరసి పాతకినై బ్రదుకంగఁ జెల్లునే. ౨౬౨

వ॥ అని కృతనిశ్చయుండై శుష్కమ్ము లగుకాష్ఠమ్ములు పేర్చి చితి నేర్పఱచి యగ్నిఁ జొనిపి యందుం బ్రవేశింప నెంచి స్నానం బొనరించి జగజ్జనని నాత్మఁ దలంచుకొంచుఁ దత్సమీపమ్మునఁ గృతాంజలియై కూర్చుండునంత నజ్జగదంబ కరుణాశాలినియై యాకసమ్మున నాతనికి దర్శనం బొసంగి వారించి యిట్లను. ౨౬౩

గీ॥ సాహసింపఁగ నేఁ? యోజనవరేణ్య?, వినుము నామాట నీతండ్రి
వృద్ధుఁ డయ్యె, నీకు రాజ్య మొసంగి యెందేనిఁ దపము, చేయఁ
బోనున్నవాఁడు నిశ్చింతుఁ డగుచు. ౨౬౪

వ॥ మదనుగ్రహమ్మునం జేసి రేపు నిన్నుఁ బట్టాభిషిక్తుం జేయ నీతండ్రియనుమతమ్మున మంత్రు లరుదెంతు రని చెప్పి దేవి యదృశ్య యయ్యెఁ బదంపడి త్రిశంకుండు మరణోద్యమమ్ము విడిచి సుఖం బుండె నంత నారదుం డరిగి వృత్తాంతమ్మెల్ల నృపాలునకుం జెప్పిన నతండు పుత్రమరణోద్యోగమ్మునకు దుఃఖితుండై మంత్రులం బిలిచి యిట్లను.

ఉ॥ పొ మ్మనినంత న న్విడిచి పోఁయి వనమ్మున భాగ్యహీనుఁడై
గ్రుమ్మరుచున్ గురుప్రవరుకోపము తె న్నలయింపఁగాఁ బిశా
చమ్మయి దేశిఁ గొల్చి విలస న్మతియై తుద కెంతయున్ విరా
గమ్మున నగ్నిలోనఁ దనకాయము వైవఁగ నెంచె నక్కటా. ౨౬౬

గీ॥ కృప గలిగి దేవి వారింప దేసి సుతుఁడు, మృతిఁ బొరయుఁ గాదె?
వైళమ యేగి నాదు, జ్యేష్ఠపుత్రునిఁ దెందు నిశ్చింత వాని, కిచ్చి
రాజ్యమ్ము తపమున కేగువాఁడ. ౨౬౭

వ॥ నావుడు మంత్రులు సత్యవ్రతునిపాలి కరిగి యనునయవచనమ్ముల నోదార్చి పురమ్మునకుఁ దీసికొనివచ్చి తండ్రికిం జూపిన నతండు జటాజూటధరుండును గ్రూరుండును జింతాదంతురుండును నగుకొమరుం గాంచి పశ్చాత్తప్తుండై రాజ్యార్హుండును మేధావియు నగుతనయు ధర్మం బెఱింగియు నిట్లొనరించితి నని సిగ్గిలుచు నాలింగనం బొనర్చికొని తనసింహాసనమ్మునఁ గూర్చుండఁ బెట్టికొని ప్రీతిపూర్వకమ్ముగ నిట్లనియె. ౨౬౮

## రాజనీతి

క॥ తనయా ధర్మ్మమున బు, ద్ధిని నిలుపన్ వలయు నెపుడు ద్విజవర్యు
ల మ, న్నన సేయ వలయుఁ బ్రజలన్, దనుజులవలెఁ బ్రోవ వల
యు నరనాథునకున్. ౨౬౯

గీ॥ ధనము న్యాయాగతంబయి తనరుటొకటి, యనృతమునఁ గాలు వెట్ట
మియును సమార్గ, గామి గాకుంట తపసుల నోముటయును, బరమ
ధర్మ్మము లియ్యవి పార్థివునకు. ౨౭౦

గీ॥ ఇంద్రియజయంబు పూజ్యుల నెఱుఁగుటయును, మంత్రిగుప్తియుఁ
జోరులమద మడఁచుట, శత్రుశేమంబు సైఁపమి సచివు నన్య, స
క్తుఁ జేర్చమి పతికి యశస్కరంబు. ౨౭౧

గీ॥ శత్రుమిత్రులకృత్యముల్ చారముఖము, వలన నెఱుఁగుటయును
శుష్కవాది గామి, దుష్టసంగంబు దొలఁగుట యిష్టులకును, బూ
జ్యులకు నీఁగియును విధి భూపతులకు. ౨౭౨

క॥ యాగముల నొనర్చుట వృగ, యాగతి నతిరక్తి లేమి యంగనలం
దు, ద్యోగముల విశ్వసింపమి, యాగమవిహితములు నృపతు ల
గువారలకున్. ౨౭౩

గీ॥ ద్యూతమున దాని నాడెడినీతిరహితు, నందు మద్యమ్మునందు వా
రాంగనాజ, నమ్మునందును దఱుచు గానమ్మునందు, విముఖుఁడై వ్రి
జ నట్లొనర్పింప వలయు. ౨౭౪

గీ॥ అరసి బ్రాహ్మముహూర్తమునందు లేచి, స్నాన మొనరించి నియతుఁ
డై శక్తిపూజ, భక్తి నొనరింపఁగాఁవలెఁ బ్రతిదినమ్ము, జన్మసాఫ
ల్యమును గోరుచతురమతికి. ౨౭౫

క॥ ఒకసారియైన నప్పర, మకృపానిధి నంబఁ గొలిచి మన్ననఁ దల్పా,
దకమలజలంబు గ్రోలిన, సుకృతికిజన్మమ్ములేదు సూఁనిక్కముగన్.

గీ॥ దృశ్యమగు జగమఖిలమ్ము దేవదేవి, జీవుఁడీశ్వరుఁడునుగూడ దేవ
దేవి యని, వినిశ్చితాత్ముం డగున నఘమతికి, నతులితానంద మొ
ల్లప్పు డనుఘటించు. ౨౭౭

శా॥ ప్రాతఃకృత్యములన్ యథోచితగతిం బాటించి కొల్వుండి వి
ద్యాతంత్రజ్ఞుల విప్రులన్ బిలిచి శాస్త్రార్థమ్ము లవ్వారిచేఁ
బూతుండై విని పాత్రులై తనరునాభూదేవతాశ్రేష్ఠులన్
బ్రీతిన్ దానము లిచ్చి పుచ్చవలయున్ బృథ్వీశుఁ డెల్లప్పుడున్.

క॥ విను మూర్ఖులైనద్విజులకు, ధన మీవల దిచ్చెనే నుదరపోషణకుం,గ
నిపెట్టి యీవలయు లం, ఘన మొనరింపంగఁ దగదు గాన ధర్మములన్

చ॥ అనఘుల భూమిదేవతల సత్యమహాత్ముల నెన్నఁడేనియున్
జన దవమానముం గొలుప క్షత్రకులమ్మున కమ్మహామహుల్
జనకులు; వారి యగ్నికిని క్షత్రియజాతికి విప్రజాతి లో
హనిధులకున్ శిలల్ జనకతాస్పదముల్ విధిచోదితమ్ముగన్. ౨౮౦

ఉ॥ వారల తేజ మెందును నవారితమై యలరారు భూపతుల్
వారలలోన ధీరు లగువారల నెన్ని యఖండదానస
త్కారములన్ మహావినయగౌరవసంపదలన్ మహోన్నతిం
గోరుచుఁ బూజ సేయుదు రకుంఠితశక్తి భవముల్ సెలంగఁగన్. ౨౮౧

గీ॥ ధర్మశాస్త్రానుసరణంబు దప్ప కెపుడు, దండనీతి యవశ్యంబు ధరణి
పతికిఁ, గోశసంగ్రహ మెల్లెడఁ గూర్పవలయు, ననుచు బోధించెఁ
బృథివీంద్రుఁ డాత్మజునకు. ౨౮౨

మ॥ తనవాక్యమ్ములు సమ్మతించినసుతున్ దత్తన్మహాతీర్థ పా
వననీరమ్ములచేత మంత్ర్యనుమతిన్ బాడబుల్ శ్రుతుల్ సెప్ప దీ
వనలం జేయఁగ మంచికాలమున దివ్యద్భంగిఁ బట్టాభిషే
చనముం జేసి యతం డరణ్యము తపస్సంసక్తి నేగెన్ దగన్. ౨౮౩

వ॥ అట్లు నృపాలుండు గాంతారమ్మునఁ గాంతాసహితమ్ముగఁ దపం బొనర్చి కొండొకకాలమ్మునకు దేహంబు విడిచి దివం బరిగి యచ్చట నింద్రాసన సమీపమ్మున రెండవయింద్రుండై యుండె ననుడు జనమేజయుం డిట్లను. ౨౮౪

ఉ॥ మున్ను వసిష్ఠుధేనువును ముష్కరుడై వధియించి శాపముం
గొన్న త్రిశంకుఁ డేగతిని గుంభినికిన్ ధవుఁ డయ్యె నెందునే
నిన్నృపతిత్వ మూనఁ దగునే మునివర్య! పిశాచముల్ గృపన్
దన్నృపు శాపమోక్షణకథన్ వినిపింపుము నాకు నావుడున్. ౨౮౫

వ॥ వ్యాసుం డిట్లనియె.

చ॥ అతఁడు పిశాచ మయ్యు జగదంబిక నాత్మఁ దలంచి తత్కృపా
మృతమున దివ్యదేహము ధరించె వసిష్ఠమహామునీంద్రుస
మ్మతికి నిధాన మయ్యెఁ బితృమాన్యతఁ గాంచె నృపాల లోకవం
దిత యగునప్పరాంబిక నుతించిన నెయ్యది గల్గకుండునే. ౨౮౬

గీ॥ అనఘుఁడై పేర్మి నిట్లు సత్యవ్రతుండు, రాజ్యమును జెంది జన్నముల్
రమణఁ జేసి, యెన్నఁ దగుకీర్తి గాంచి లోకోన్నతుండు, సర్వలక్షణ
యుతు హరిశ్చంద్రుఁ గనియె. ౨౮౭

వ॥ పదంపడి యనుగుణవయస్కుం డగుకొమరునకు యౌవరాజ్యం బొసంగి శరీరమ్ముతో దివమ్మున కరుగఁ దలఁచి వసిష్ఠాశ్రమమ్మున కరిగి కృతాంజలిపుటుండై యిట్లను. ౨౮౮

## వసిష్ఠుండు త్రిశంకునకు శాపంబిచ్చుట.

మ॥ అనఘా? యీతనువుం ద్యజింపకయ నే నాసింతు స్వర్లోకసం
జనితానందము లప్సరోవిధుముఖీసంసర్గముల్ దివ్యనం
దనసంచారముఁ గర్ణపేయ మగుగాంధర్వంబుఁ; దత్త్వాదృశా
భినవోద్యత్ఫలదాయియాగమును సంప్రీతిం దగం జెల్పుమా.

చ॥ అనవుడు నవ్వసిష్ఠుఁ డను నాకనివాసము మర్త్యదుర్లభం
బనఘ! కృతాధ్వరుండు మృతుఁడై దివ మేగుట సుప్రసిద్ధ మే
మనఁ దగు నీమనోరథము యాగ మొనర్చితివేని వచ్చుత
త్తనువున నప్సరస్సతులఁ దద్దయుఁ గూడి సుఖంతువిమ్ములన్. ౨౧౦

వ॥ అంతియ కాని బొందితో నాకసుఖంబు బొడఁగూర్చుట నా
కశక్యం బనవుడుఁ బూర్వరోషసంయుక్తుం డగునమ్మహామునికిఁ ద్రిశం
కుం డిట్లను నీవు గర్వావేశమ్మున నన్నుఁ గ్రతువు చేయింపవేని వేఱొ
క్కపురోహితుకతనఁ దాదృశం బగుజన్నం బొనర్చువాఁడ ననుఁడు
గోపోద్రేకమ్మున నిట్లు శపించె. ౨౧౧

ఉ॥ గోవధపాపదూషితునకున్ ధరణీసురదారహర్తకున్
దేవనివాస మన్య మగుదేహము దాల్చినయేనిఁ గల్గ దా
తా! వెఱపింత లేక నను సాగ్రహయుక్తునిఁ జేయుదే? దురా
త్మా! విను మిప్డ నీకు నను వాక్ శ్వపచత్వము శాపహేతువై. ౨౧౨

చ॥ గురుఁ డిటు శాప మీ నతనికుండలముల్ శిల లయ్యె నీలతన్
బొరసిన బట్టుపుట్టము సముజ్జ్వలమై తగుదివ్యదేహమున్
గరికస యయ్యె మైనలుగంధము విట్పము మయ్యె శక్తికిం
కరుల నెదిర్చి యెవ్వఁడు సుఖమ్ములఁ బొందు జగత్త్రయమ్మునన్

శా॥ గాయత్రీజపతత్పరుండు సురలోకజ్యేష్ఠకల్పుండు దు
ర్జ్ఞేయుం డైనవసిష్ఠుఁ డిట్లు తను వంచింపన్ మహాంబేది చిం
తాయత్తుం డయి యింటికిం జనఁగ నత్యంతమ్ము శంకించి యీ
కాయం బెంతయు హేయ మేలిఁకని తత్కాంతారసంచారియై.

క॥ శ్వపచుం డగుపతిఁ గని యెం, త పతివ్రతయేని భార్య తర్కించు
ను మం, త్రిపురస్సరు లగు బంధులు, నెప మిడి యెడ నుంతు రింత
నీచత గలదే. ౨౯౫

మ॥ మరణంబే శరణంబు గాక యని యాత్మన్ నిశ్చయుం బంది త
న్మరణం బేగతిఁ గల్గు వహ్నివిషసంబంధమ్మునం జేసి యె
వ్వరు గోల్పుత్తురు గాయ మాపతితు లాప్తి జన్మమందున్ బునః
పరితాపమ్మును గాంచువార లని చెప్పన్ వింటు ధర్మములన్. ౨౯౬

వ॥ కావున నాత్మహత్యకన్న నింద్యం బొండు గన్పట్ట దెట్టైననఁ గృతశుభాశుభకర్మములు కేవలభోగ్యంబు లగుట నే నీదేహమ్మునన యీశ్వపచత్వమ్ము నిశ్చయముగా ననుభవించు టొప్పుఁగాదె? పుణ్యతీర్థములు సేవించుచుఁ బరాంబికాస్మరణమ్మును సాధుసంసర్గమ్మును తోడుగాఁ గాననమ్మున సంచరించెద నెవ్వండేని యొక మహానుభావుండు దొరక కుండునే? యని నగరమ్ము విడిచి గంగాతీరమ్మున కరిగి యట దుఃఖపరీతుండై వసియించుచుండె. ౨౯౭

క॥ తనతండ్రిదుర్దశను విని, ఘనుఁడు హరిశ్చంద్రుఁ డాత్మగలుగ
సచివులన్, బనిచెన్ వారలు గంగా, ధునియొద్దన కేగి నృపుని
దుఃఖితుఁ గృశునిన్. ౨౯౮

వ॥ కాంచి వినయమ్మున మహాత్మా! యువరాజగు నీతనయుండు హరిశ్చంద్రుండు నిన్ను సన్మానపూర్వకమ్ముగఁ దోడి తెండనిన వచ్చితిమి కటాక్షించి నగరమ్మున కరుదెంచి యథాపూర్వమ్ముగ మంత్రులును సేవకులును సేవింప రాజ్యభారమ్ము వహింపుము గురుం డెట్లు ప్రసన్నుండగు నట్లొనర్పవచ్చు నని బహుభంగుల విన్నవించినను శ్వపచుండగు నానృపాలుండు గృహం బేగుటకు సమ్మతింపక వారల కిట్లనియె. ౨౯౯

చ॥ తనుఁడు మదాజ్ఞఁ జేసి శ్వపచత్వమునన్ బురిఁ జూడ నోప మ
త్తనయునితోడ బ్రాహ్మణహితమ్ముగ జన్నము లాదియౌ కృతుల్

పౌనరుచుచుర్ ధరాభరము పూని ప్రజన్ భరియింపు మంచు నా
పనువునఁ జెప్పి మీరలును బొల్పడుఁ దాతనికిన్ సహాయులై.

వ॥ ఇట్లు కృతనిశ్చయుండైన త్రిశంకునకు నమస్కరించి దుఃఖావేశమున వందఱును నాయూశ్రమంబు విడిచి పురి కరుదెంచి. ౩౦౧

క॥ అనవద్య మగు దినమ్మున, ఘనుని హరిశ్చంద్రు భూమికాంతునిగా స
జ్జనహితు నభిషేకించిరి, మునిజనములతోడ మంత్రిముఖ్యులు పే
ర్మిన్. ౩౦౨

వ॥ హరిశ్చంద్రుం డిట్లు కృతాభిషేకుండై మనమ్మునఁ దండ్రిం దలఁచుచు న్యాయ్యంబుగ భూపాలనం బొనరించె నావుడు జనమేజయుండు. ౩౦౩

మ॥ జననాన్యుండు త్రిశంకుభూపతి హరిశ్చంద్రున్ దనూజున్ జగ
ద్వినుతుం బట్టము గట్టఁ జేసి పిదపన్ దేహమ్ము చాలించెనో?
మునిచే శాపవిముక్తిఁ జెందెనో? పనిన్ మున్నెట్టు లప్పాట మూ
లనిభంగిన్ జరియించెనో నొడువు మెల్లన్ వృత్తము న్నాకొగిన్.

వ॥ నావుడు వ్యాసుండు రాజేంద్రా! త్రిశంకుం డట్లు హరిశ్చంద్రునకు రాజ్యం బొసంగి జగజ్జనని నాత్మ నిల్పి యవ్వనమ్మున గంగాతీరమ్మునఁ దపమ్ము కలిమి గాలయాపనం బొనర్చుచుండె నంతమున్న తపమ్మున కరిగిన విశ్వామిత్రుండు సమాప్తవ్రతుండై దారపుత్రాదుల నీక్షించుపొంటె నరుదెంచి సుతసహితమ్ముగ నెదుగ వచ్చి నిర్వర్తితసపర్యయై యున్న భార్యం గాంచి ప్రీతిపూర్వకమ్ముగ నిట్లనియె, ౩౦౫

క॥ తరుణీ! దుర్భిక్షమ్మున, నరిగితి నేఁ దపమొనర్ప నాత్మజులను స,
న్నాదరు లెవ్వరు పోషించిరి, తరమె కుటుంబమ్ము గడప ద్రవ్యము
లేమిన్. ౩౦౬

గీ॥ కఱవతిశయించె ననువార్త కతన మిమ్ముఁ, దలఁచి శోకించి నిర్ధన
త్వమునఁ జేయు, తెరు వెఱుంగక యిటకరుదేరనైతి, నాకు నప్ప
టిదురవస్థ నాతి? వినుము. ౩౦౭

యెం దేనిఁ జనున య్యెడ సత్యవ్రతుం డను రాకొమరుఁడు చూచి యేమీ బాలకుం డేమ్చుకతం బనవుడు నే నిట్లంటి నీశిశువు నాచే విక్రయార్థంబుగాఁ గొనిపోవంబడు వాఁడు నావుడు నతండు గరుణించి నీవు గృహమ్మరుగుము నీకుటుంబమునకుఁ బ్రతిదినమ్ము చాలినంత యామిషముం దెచ్చి యే నిచ్చువాఁడ నద్దాన జీవింతువుగాక యిట్లు నీపతియగు మునీంద్రుండు వచ్చునంతక నాచేయుట యనిన నేను ముదం బంది యింటి కరిగితి నతండును బ్రతిదినమ్మును నట్లొనర్చువాఁ డప్పన్నిమిత్తమ్మున వసిష్ఠుచే శపింపంబడియె నది యెట్లంటేని. ౩౨౨

క॥ ఒకనాఁడు మృగము లెచటఁ, దనకుఁ గానఁగ రాక యీవనము
నెల్లెడ మిన్నక తిరిగి విసివి యతఁడు తు, దకుఁ జంపె వసిష్ఠుగోవుఁ
దన్మునివరుఁడుఁ. ౩౨౩

క॥ అలిగి త్రిశంకుం డను పే, రలవడఁగ శపించె మఁలఁడై కుందఁగ నా
వలనఁగదా యాతనికిఁ, కలుషముఘటియించె ననివగ చెదమునీంద్రా.

వ॥ కావున నుపకర్త యగునన్నరవరుఁ డేగతి నైనఁ ద బలగరిష్ఠుండ వగునీ కుపకార్యం డని వేఁడిన సతికిఁ బతి యిట్లనియె. ౩౨౪

క॥ నే దవ్వై యున్నప్పుడు, నీదైనయవస్థ చూచి నెఱిఁ బోషించినవా
యాఁడు నిఁ దన్నుపవర్యుని, సాదరమతి శాప మెడలు నట్లొనరింతుఁ

వ॥ అని చెప్పి యతని దుఃఖం బెట్లు విముక్తంబగునో? యని యెంచుచుఁ ద్రిశంకుం డున్నపక్కణంబున కరుగుడు నతండు మునిరాకఁ యెఱింగి యెదురై విస్మయం బొదవఁ బాదమ్ములం బడి నమస్కరించినఁ గరుణార్ద్రుండై కౌశికుండు లేవ నెత్తి యిట్లనియె. ౩౨౬

క॥ జననాథ ! నీవు మిక్కిలి, యనఘుండవు నాతదర్థమై శాపంబుం
గొని చాండాలుఁడ వైతివి, చను నే నా కూఁకుంట శక్తుఁడ నయ్యుఁ

వ॥ ప్రత్యుపకారం బొనర్చి ఋణవిముక్తిం జెంద నుంటి నీ యభీష్టం బేమనుడుఁ ద్రిశంకుఁడు మహాత్మా ! మున్ను మత్కులగురుం

డగువసిష్ఠుని సశరీరస్వర్గదం బగుజన్నమ్మున నన్నుఁ గృతార్థుఁ జేయు
మని వేఁడిన నతం డొల్లఁ డాయె. 3౨౮

క॥ ప్రీతి న్నాకోరిక నిడ, నేతువయోని వినుమయ్య! నియమమ్మున నా
చేత నశరీరనాకద, మై తనరెడిజన్నమును దయఁ జేయింతే. 3౨౯

వ॥ కులగురుం డొల్ల ననిన నే నన్య గురునిఁ గాఁ గొని యీ
యాగంబు నిర్వర్తింపించెద ననుడు నతండు న న్నవమానింప నుంకిం
చితివిగానఁ జండాలుండవై నవయు మనియె నియ్యది శాపకారణంబు
నావుడుఁ గౌశికుండు దచ్ఛాపంబు గ్రమ్మరించి యుపకృతిం బొనర్ప
నెంచి యజ్ఞసంభారమ్ము లార్జించి మునులం బిలిచిన వారలు మఖయా
థార్థ్యంబు గుఱుతెఱింగి వసిష్ఠనివారితులై యొక్కరును రాకుండిరి.
దానికిఁ గ్రుద్ధుండై కౌశికుండు త్రిశంకుకడ కరిగి వసిష్ఠదార్శంతత్య్ర
మ్మున మును లొక్కరును నిటకు రారు. 330

మ॥ ద్విజు లేతేరక యున్న జన్న మెటు సంధిపంగ నౌ నీ దివం
బజరుద్రాదులు మెచ్చ నంపెదను రాజా! నాతపశ్శక్తి చూ
డఁ జనుఁ గైకొను మిష్ట నీ కొసఁగువాఁడఁ బెద్దకాలంబు చే
యుజపం బంచును ధారవోసెఁ దప మాయుర్వీశుహస్తమ్మునన్.

క॥ తనగాయత్రీజపసం, జనితం బగుసుకృతి మిచ్చి జనవరశిచను మిం
కను స్వర్గంబున కేవ్వఁ,డును నిన్నడ్డంగఁజాలఁడు జగత్త్రయిలో

త్రిశంకుండు స్వర్గమ్మున కరుగుట.

చ॥ అని యనుపన్ ద్రిశంకుఁడు రయమ్మునఁ బక్షియుఁ బోలె నాకసం
బునకుఁ దపోబలమ్మున సముద్గతుఁడై దివ మేగునంత న
య్యనిమిషు లంతరంబున జనాధిపతిన్ శ్వపచాకృతిం గనుం
గొని శ్వపచుండు నాకమునకుం జనుదెంచెడి దేవవల్లభా. 333

ఉ॥ నావుడు దేవనాథుఁడు మనమ్మున విస్మయ మంది యేగి యా
భూవిభునిన్ శ్వపాకునిఁ దపోవిభవమ్మున నాక మేగుదు

ర్భవుని( దాం( ద్రిశంకునిఁగ భావనచేసియుఁ బొమ్ము పొమ్ము నీ ?
దేవనివాస మేక? జనుదేర శ్వపాకుఁడు నేక? సుర్తి. ౩౩౪

వ॥ అని పలుగఁ గ్రోధించి త్రిశంకుండు క్షీణపుణ్యుండగు సమరుండునుం బోలె భూమిం బడువాఁడు గాధిజుంగూర్చి యిట్లా క్రోశించె. ౩౩౫

చ॥ చను మనినంత నేగి సురసద్మము చేరెడినన్ను దేవతల్
కని సురనాథుతో నుడువఁగా నతఁడీగతిఁ దెచ్చె నోమునీం
ద్ర! నను( గనుంగొనం దగదె! ధారుణిఁ ద్రెళ్ళి( బడుచుంటి నాఁగ న
మ్ముని విని "నిల్వు"మంచు నృపముఖ్యుని నాఁగెఁ దపమ్ము పెంపునన్.

వ॥ గాధిజుండట్లు త్రిశంకుని గగనమ్మున నిలువరించి పిదప నుదకంబు స్పృశించి సువిస్తరంబగునిష్టి నొనర్చి నూతనసృష్టిగా వేల్పులను స్వర్గమ్ము నిర్మించునంత నింద్రుం డెఱింగి సత్వరమ్మున నయ్యెడ కరుదెంచి వినయమ్మున నిట్లను. ౩౩౭

క॥ కోపించి నూత్నసృష్టిన్, బ్రాపింపఁగ నేల? మౌనివర? భావత్కా
జ్ఞాపరిపూర్తి యొనర్చెద, నాప్రార్థన పాటిసేయు నా మునివరుఁడున్.

చ॥ సురపతి కిట్లు వల్కు బలసూదన? త్వద్భువనమ్మునుండి యీ
ధరఁబడుమా త్రిశంకుని ముదమ్మునఁ దోడ్కొని స్వర్గలోక ను
స్థిరునిగఁ జేయు మిట్లయిన సృష్టికి మానెద నూతనంబు నేనన్
గరముమునీంద్రు దాగ్రహమునఁ గంపితుఁడై సురనాథుఁ డోమునెన్.

క॥ తప్పనివిధిచే నీగతి, నొప్పి పిదప దివ్యదేహ మొసఁగి త్రిశంకున్
గొప్పగఁ దనపార్శ్వమునన్ జొప్పడఁగాఁ జేసి యరిగె సురపతి దివికిన్. ౩౪౦

వ॥ ఏకవిమానసంగతులై యిట్లింద్ర త్రిశంకులు దివమ్మున కరిగిన స్వస్థచిత్తుడై గాధిజుం డాశ్రమమ్మున నుండె. ౩౪౧

గీ॥ స్వర్గగతి తండ్రి కబ్బినవార్త నెఱిఁగి, సంతసంబంది యాహరిశ్చంద్ర నృపతి, పుడమినేలుచుఁ దనకూర్మిపడఁతిఁ గూడి, యిష్టభోగమ్ములను దిన మొనయుచుండె. ౩౪౨

క॥ సంతానము దవ్వాగుటకుఁ, జింతించి వసిష్ఠమౌని సేవించి మహా
మంత్రజ్ఞ? నాకు సంతతి, యింతకు లేకుంట కేమి హేతువు
చెపుమా. 3౮3

మ॥ కలవింకమ్ములు సంతతిం గని సుఖాఖండస్థితిన్ బొల్చు న
వ్వాల నీక్షింపు ముపాయశాలి వయి దైవజ్ఞుండవై మంత్రవే
త్తలకుం బ్రాపయి యున్న నీదుపదపద్మమ్ముల్ దగం గొల్చువా
రలకున్ మాకిటు లౌటకున్ గతము ప్రారబ్ధమ్ము నాఁ జెల్లదే.

వ॥ అని శోకమిశ్రమ్ముగఁ బల్కునజ్జనవరునకు వసిష్ఠుం డిట్లనియె.

చ॥ కనఁగ నపత్యహైన్యమున కన్నను దుఃఖము లేదు సంసృతిం
బనుపడువారికిన్ ధరణివల్లభ! సంతతి నీకుఁ గొంతయున్
ఘనుఁ డసవిందు నవ్వరుణు; గ్రక్కున నాతనిఁ బూజచేసి నం
దనుఁ గొనవచ్చుఁ దత్కృతికి దైవము తోడగునాఁడు తత్కృపన్.

గీ॥ దైవపురుషకారమ్ములు దవిలి కార్యసిద్ధిఁ బొనరించు నుద్యమస్థితికి న
రుఁడు, గడఁగ దైవంబు తోడగుఁ గాని లేని, నాఁడు కేవల దైవ మొ
నగ్చుటెట్లు. 3౮౬

వ॥ అని గురుం డుపదేశించి పీడ్కొల్పినఁ గృతనమస్కారుండై
యరుదెంచి హరిశ్చంద్రుండు గంగాతీరమ్మున ఘోరతపం బొనర్చె. 3౮౭

క॥ ఆతనితపమున కెడఁదఁ బ్రీ, చేతుం డానంద మొంది చెచ్చెరఁ గన
న్నై, ప్రీతిన్ గోరుము వరమన, భూతలపతి కేలు మొగిచి పులకిత
తనుఁడై. 3౮౮

క॥ అనపత్యుఁడనై దుఃఖం, బున మునిఁగెడినాకు ఋణవిముక్తిప్రదు
నం, దనుఁ గరుణింపుము నాపుడు, జనపతి కతఁ డనియె దరహాస
మ్ముఖుఁ డగుచున్. 3౮౯

ఉ॥ నందను నీ కొసంగెదఁ గనందగు నందము వొల్చువాని మి
న్నందెడిసద్గుణంబులకు నాకరమై తగువాని భూమినం

క్రిందనఁ తత్సుతుం బశువుగా నొనరించి యజించెదేఁ మదా
నందము గోరి; నాపుడు మనమ్మున భూపతి గొంకి యిట్లనున్. ౩౫౦

వ॥ మహాత్మా! వంధ్యతకన్న నియ్యది కొంత మేలగుట నిప్పాట నొనరించువాఁడ సుతుఁ బ్రసాదింపు మనవుడు వరుణుండు నీకు నవశ్యమ్మును గొమరుండు పుట్టు గృహం బరుగుము నాపుడు సంతుష్టుండై యతఁడు పురమ్మునకుఁ జని భార్యకు నొడివిననాపెయు సంతసించెఁ దక్కుఁగల భార్యాళిమ్మును ముదమ్మునఁ బొదలె. ౩౫౧

## రోహితోత్పత్తి

గీ॥ అతనిభార్యాళిమ్మునయందుఁ బట్ట, రాజ్ఞి యగుశైబ్య యంత గర్భ
మ్ము దాల్చి, పదినెలలు నిండఁ గనియెశుభదినమందు, సుతునిఁ గంద
ర్పసుందరుఁ బరోహితముగ. ౩౫౨

వ॥ హరిశ్చంద్రుండు జాతకర్మం బొనరించి యఖండోత్సవం బాచరించె నట్టియెడ వరుణుండు విప్రవేషమ్మున నట కగుదెంచి స్వస్తి వచన పూర్వకమ్ముగఁ ద న్నాలోఁగించి యి ట్లనియె. ౩౫౩

ఉ॥ నావరదానకారణమునం దగె వంధ్యత లేమి నీకు; స
ద్భావుఁడ వేని యీసుతునిఁ బార్థివ! యజ్ఞపశుం బొనర్చి ను
శ్రీ వెలయన్ యజింపు మనఁ జింతమెయి న్నరపాలుఁ డక్కటా!
యేవిధ నిక్కుమారకుని నీఁ దగు నీ కెటు లోఁగుఁగాఁదగున్. ౩౫౪

చ॥ వరుణుఁ డితండు విప్రుఁడయి వచ్చె మఃఖొక్కట నీడఁ బోవఁ డె
వ్వరికిని దేవహేళనము భావ్యము గా దతికోమలాంగు నం
బురుహసమాననున్ ముఖముపొంకెు వధించినఁ బుత్రశోకముం
దరమె భరింపఁ దక్కటవిధమ్మున నీతఁడు ప్రీతి చెందునే. ౩౫౫

క॥ పెక్కగు బాములఁ బడి తుద, గ్రొక్కరుఁ గని నందులకు సుఖోదయ
మునకుం, దక్కితి నదిగాకయుఁ బ్రైమిక్కిలి శోకింప వలసె మితి
లేనివగన్. ౩౫౬

వ॥ అని చింతించి ధైర్యం బవలంబించి వినయమ్మున నతని కిట్లనుమహాత్మా! పుత్త్రుండుదయించిన పదిదినమ్ములకుం దండ్రి కర్మయోగ్యుం డగుం దల్లి మాసమ్మునకు శుచి యగు యాగమ్మునకు దంపతులు ముఖ్యు లగుట సర్వసమ్మతం బనవుడు వరుణుండు మాసానంతరమ్మున నరుదెంతు నని చెప్పి చనియె నంత హరిశ్చంద్రుండు పరమానందమ్మున విప్రులకుం గోట్లకొలంది గోవులను దిలపర్వతమ్ములను హేమరాసులను నొసంగి యాత్మజునకు రోహితుం డనునామం బిడి పుత్త్రవదనసందర్శనజనితానందపరవశుండై యుండునంత మాసమ్ము పూర్ణం బగుడు వరుణుం డెప్పటియట్ల విప్రుండై యరుదెంచి యజింపు మనుడు నృపాలుండు దుఃఖసాగరమగ్నుండై యతనికి నమస్కరించి కృతాంజలియై యిట్లనియె. ౩౫౭

క॥ పావన మర్త్యౌక సదనము, దేవర రాఁ బట్టి మఖవిధికిఁ బసిబాలుం,
డేవిధి నర్హుఁడు దంత, శ్రీవెలయని పశువు శ్రుతినిషిద్ధము కాదే. ౩౫౮

వ॥ కావున దంతోదయంబు గా వేగను క్రతు వొనర్తు ననుడు నంగీకరించి యతం డరిగెఁ బిమ్మట నంతసమ్మునఁ గొంతకాలంబు గడపి నృపాలుండున్నంత దంతోదయం బగుట యెఱింగి వరుణుండు యథాపూర్వమ్ముగఁ గ్రతు వొనర్పు మని వచ్చె నంత హరిశ్చంద్రుండు నిర్వర్తితసత్కారుండై యతని కిట్లను. ౩౫౯

గీ॥ అకృతచౌలుండు గర్భకేశాన్వితుండు, సమ్మతుండు గాఁ డనుట వృద్ధ
సమ్మతంబు, గానఁ దత్కృతి నెఱవేర్చి క్రతు వొనర్తు, నీ వెఱుంగని
ధర్మ మెందేనిఁ గలదె. ౩౬౦

వ॥ అనుటయు.

క॥ తెలిసి వరుణుండు నన్నుం, బలుమఱు త్రిప్పెదవు కపటభావం బది
నీ, కలవడియె నాత్మజునియం, దలి మోహము ని న్నసత్యతత్పరుఁ
జేసెన్. ౩౬౧

వ॥ కేశఖండానంతరమ్మునఁ గ్రతువొనర్పవేని దారుణం బగు శాపమ్ము నాచే నీ కీఁ బడు నింత నిక్కువ మని చెప్పి మఱియు నిట్లనియె

క॥ జనవంద్యుం డిట్లాకున్న, మునికొలమునఁ బొడమి వ్యర్థపుంబల్కులు
గ, ల్గినవాఁ డితఁ డనియెడికీ, ర్తిని జెందకు పోయి వత్తు నృపతిల
కంబా. ౩౬౩

వ॥ అని చెప్పి యప్పటి కతం డరిగె భూపాలుండును సంతుష్టాంతరంగుఁడై యుండెఁ బదంపడి కొండొకకాలమునకుఁ గొమారుండు చూడాకరణయోగ్యుం డగుడుఁ దత్కర్మార్థంబు గృతప్రయత్నుండై.

క॥ తానును భార్యయుఁ దోడ్పై, సూనుని నెలకొల్పి మిగులశోభన
లీలన్, శ్రీ నెగడ నున్నతిని, బ్రానుగతిన్ వరుణుఁ డచటి కరు
దెంచి యనున్. ౩౬౪

వ॥ రాజేంద్రా! చూడాకరణంబు నిర్వర్తించుచుంటి వికఁ గాలాంత రేమున్నయది? మఖం బొనరింపుమనావుడు హరిశ్చంద్రుండు కృతనమస్కారుండై యతని కిట్లను. ౩౬౬

చ॥ ఇపుడ యొనర్పు టర్హ మని యేను నెఱుంగుదు నట్లొనర్పఁ గా
గపశువుగా నొనర్పఁ గఁ దగఁ డితఁ డాగమసంస్కృతిన్ ద్విజ
త్వపదవి నొందకుండినకతమ్మున; మూఁడగు జాతులందుఁ దా
రుపనయనంబు లేమిఁ జరణోద్భవతుల్యులు కర్మబాహ్యులున్.

వ॥ కావున శూద్రప్రాయుం డగునిక్కుమారుని యాగపశువుగా నొనర్పుటకు శంకింతు నుపనీతుం డగునేఁడు నీయభీష్టంబు నెఱవేర్తు, రాజుల కేకాదశవర్షమునను బ్రాహ్మణుల కష్టమవర్షమునను వైశ్యులకు ద్వాదశాబ్దమునను నుపనయనంబు విధిచోదితం బనుగ్రహించెదేనిఁ దత్కర్మానంతరమున యాగంబు విధియుక్తంబుగ నొనరింతు నా వచనంబు సత్యముగ నమ్మి యిప్పటికి వెంచేయు మనుడుఁ బ్రసన్నవదనుండై వరుణుండు దనపురమ్మున కరిగె నంత నృపాలుండును బుత్రుని కతనఁ బరమానందమ్మునఁ గాలయాపనం బొనర్చుచుండె. ౩౬౭

క॥ పదపడి యబ్బాలునకున్, బదియేడులు వోవుదెంచెఁ బార్థివుఁడున్నె,
మ్మదిఁ జింత గడలుకొనఁగాఁ, బనునొండవయేటఁ దగుశుభదిన
మునందున్. ౩౬౮

వ॥ ఉపనయనంబు యథోక్తంబుగ నొనర్చి యున్నంత వరుణుం
డరుదెంచి మఖం బొనర్పు మనుడు రా జిట్లనియె. 320

క॥ దేవా! కొమరుం డుపనయ, పావితుఁడై యొప్పె మఖము పచరిం
చెదఁ గా, నీ వేఁడికొనెద నిన్ను న, మావర్తనకర్మ మొలయునం
తకుఁ దాళన్. 321

క॥ అప్పుడు నీమాటకుఁ బ్రీతి, సెప్పన్ దయచేసి పాదసేవకుని న్న
న్నిప్పాట గారవింపుము, యప్పతి! యన నతఁడుకోపియై యిట్లనియెన్.

క॥ వినయమున నన్ బ్రతారణ, మొనరించెదు పుత్రబంధ మొక్కెం
తయుఁ దెగి, స్వినయట్లు తోఁప దటు దెగి, స్నేని న న్నిట్లు త్రిప్పఁ
జెల్లునే నీకున్. 323

వ॥ కానిమ్ము నీపలుకులయందలివిశ్వాసమ్మున నిప్పుడు నయిత
మరిగి సమావర్తనకర్మానంతరమ్మున రాఁబోవువాఁడ నని చెప్పి యతం
డరిగెఁ బిమ్మట నృపాలుండు సంతసించి యుక్తకాలమ్మునఁ దక్షిణకా
ర్యంబు నిర్వర్తించి రాఁబోవువరుణునకై తలంకి చింతించుచున్నఁ
గొమరుం "డిటు లేల చింత సేసెద"వని యడిగి కారణం బెఱిఁగి యాత్మ
మరణమ్మునకు భయమంది మంత్రిపుత్రులతో యోజించి యేకతంబ వన
మ్మునకుఁ బలాయనం బొనర్చెఁ బదంపడి వరుణభయమ్మున దూతల నం
పించి నృపాలుండు వెదకించి కానక దుఃఖాక్రాంతుండై యుండునంత
వరుణుండు జన్నం బొనర్పు మని నిర్బంధింప నరుదెంచిన భయత్రస్తుండై
యతం డతనికి మ్రొక్కి యిట్లను. 324

చ॥ భయమునఁ బాఱిపోయె జలపాలక! బాలకుఁ డేమి సేయుదు
న్నయపథగామి గామియును నా కనువయ్యె వనమ్ములందుఁ ద
ద్దయు మునిపల్లెలందు వసుధాధరగహ్వరసీమలందు నా
దయినయనుజ్ఞ భృత్యతతి యారసి కానక వచ్చి రయ్యెడన్. 325

ఉ॥ ఏమి యొనర్పుమన్న నది యే నొనరింతు మహాత్మ! తప్పు నా
పై మొనసెన్ క్షమింపుమనఁ బాశి మహాగ్రహుఁడై వనున్ వృథా

శాపమునిఁగా నొనర్చితివిగా! కపటమ్మున; నీకు నబ్బు దీ
ర్ఘామయ మౌజలోదర మిహమ్మున దీనఁ గృశింపు మెప్పుడున్.

వ॥ ఇట్లు శపించి యతం డరిగిన నరపతి వ్యాధిపీడితుండై పుత్రుఁ గనరామికి మఱింత వగచుచునుండ నెడఁ బదపడి యొకవత్సరమునకుఁ దండ్రిమరణావస్థ విని కనుఁగొనఁ దలంచి రోహితుండు బయలు వెడలు నంత శక్రుం డడ్డమై విప్రరూపమ్మున నతని కిట్లనియె. ౩౪౭

ఉ॥ పోకుము రాజపుత్ర! నృపపుంగవుఁ డెమ్మెయి నాత్మసౌఖ్యము౯
జేకొన యాగము న్నెపము చేసి నినున్ వధియించు నాత్మసౌ
ఖ్యాకలనంబు గోరునృపు లాత్మజుఁ డంచుఁ దదన్యుఁ డంచు ను
ర్ధకులు నూడఁ బోరకట! తెల్లఁగనేల? యకారణమ్ముగన్. ౩౪౮

గీ॥ ఆమయనివృత్తి పొందెని న్నడఁప నెంచు, తండ్రిఁ గన నేగ నేఁ,
యతండు మృతిని, జెందుపిమ్మట నరిగి యానందమెసఁగ, రాజ్యభా
రమ్ము వహియింపరాదె నీకు. ౩౪౯

వ॥ అని బహుభంగుల వాసవుండు నిషేధింప నిషత్తగమనుండై రోహితుండు మఱియు నొకవత్సరమ్ముదనుక నవ్వనమ్మున నుండి పదంపడి తండ్రి యత్యంతదుఃఖమ్మునమున్న వాఁ డని విని మరణమ్మునకుఁ గృతనిశ్చయుండై గమనోన్ముఖుం డగుడు బ్రాహ్మణరూపమ్మున వాసవుండు యథాపూర్వముగా నేతెంచి యుక్తివచనమ్ముల వారించెఁ బిమ్మట. ౩౫౦

క॥ భూతలపతి రోగమ్మున, నాతురుఁడై గురు వసిష్ఠుఁ బ్రార్థించినఁ దా
నాతఁడు చెప్పె నుపాయము, క్రీతునిచే సుఖము చెందు కృతకృ
త్యుఁడవై. ౩౫౧

వ॥ వేదవిదులు క్రీతుని దశవిధపుత్రులలో గణియింతురు గావున వరుణుం డిక్కృతమునఁ బ్రీతుండై శాపమోక్షణం బొనర్చు నని వెండియు. ౩౫౨

క॥ తపములు వ్రతములు దానము, లపరిమితముగా నొనర్చి యాత్మజుం
గని లో, భపరీతుండై యెవ్వఁడు, కృప లేకవ్వాని ముఖము నెనఁయు
నధించుర్. ౩౮౪

వ॥ పదంపడి వల్లె యని నృపాలుండు క్రియక్రీతుం డగుకొమరుం
డెమ్మని మంత్రిని నియోగిం చిన నతం డెల్లెడ నరయువంత నజీగర్తుం
డను బ్రాహ్మణుండు ధనహీనుం డొక్కరుండు పొడకట్టె నతినికి శునః
పుచ్ఛ శునశ్శేఫ శునోలాంగూలు రనువారలు మూగురు కొమరులు.

ఉ॥ ఆతనిఁ జూచి మంత్రి వరుఁ డగ్రికులోద్భవ! మానృపాలకుం
డాతురుఁడై రుజాపహృతికై నరయాగము సేయు నీతనూ
జాతులలోన నొక్కరు నొసంగదె? గోశతిమున్ గ్రహించి వి
క్రీతునిఁగాఁగ నా; నతఁ డొగిన్ ధనహీనతఁ జేసి ప్రీతుఁడై. ౩౮౫

వ॥ లోభమ్మున నొక్కరు నమ్మం దలఁచి యుందుఁ గార్యాధికారి
యగుకతన జ్యేష్ఠు నీ నేరక కనిష్ఠు నీనెంచుచుఁ దల్లి నాకు వీనియందుఁ
బ్రేమం బగ్గలం బనియె నంత మధ్యముం డగు శునశ్శేపు నొసంగిన
మంత్రి యతనిం గొని నృపాలున కిడియె. ౩౮౬

## హరిశ్చంద్రుఁడు నరమేధం బొనర్చుట

క॥ మునిపుత్రునిఁ బశువుంగా, నొసరిచి యూపమునఁ గట్టి యుర్వీ
శుఁడు యాగనియతి నుండుడుఁ గనిముని, జనులెల్లరు కస్తిపడిరి
జననాథమణీ. ౩౮౭

వ॥ అట్టియెడఁ బశువిశసనకర్మ్మునకు శోమిత శస్త్రిదానంబొన
రింపక దయాళుం డగుట నిట్లను. ౩౮౮

క॥ దీనుని విప్రకుమారు న, నూనమ్ముగ నేద్చువాని నూరకచంపం
గా నేరఁ బాపకర్మము, గా నెఱిఁగియు నిట్టిపనికిఁ గడుఁగొనఁ దగునే.

వ॥ అని యతం డప్పాపకర్మ్మునలన విముఖుం డగుటయు రాజు
సదస్యులం గాంచి కర్తవ్యం బే మని యడిగిన నాసభయం దొక్కపెట్టఁ

గిలకిలారావం బెసంగె శునశ్శేఫుండు నతిదీనగతి నేడ్చుచుండె నయ్యెడఁ. దజ్జనకుం డజీగర్తుండు లేచి యుచ్చైస్స్వరమ్మున నిట్లను. ౩౯౦

చ॥ జనవర! యాతఁ డిప్పనికి సమ్మతి నందఁడయేని నేన మ
త్తనయుఁ డటంచు సందియమెదం గనకే మఖకర్తృపూర్తికై
హనన మొనర్తు నిప్పశువు; నప్పు డొసంగినదానికన్న వే
తన ద్విగుణమ్ముగా నిడెదె! ద్రవ్యమ చేయు నెట్టికృత్యముల్. ౩౯౧

వ॥ అనవుడు నృపుడు సంతసించి వల్లె యనుటయు నజీగర్తుండు పుత్రహననమ్మున కుద్యుక్తుం డయ్యె. నంత సభాసదు లెల్లరు నాతని ఘోరకృత్యమ్మునకు హాహాకారమ్ము లొనర్చుచు నిట్లనిరి. ౩౯౨

క॥ క్రూరుండు పిశాచము కా, కారయ నీతండు విప్రుఁ డగునె మహా
పా, పారంభుఁడు లోభమునఁ గు, మారుం జంపుటకు నుద్యమం
బొనరించున్. ౩౯౩

వ॥ అని యతని నుద్దేశించి.

క॥ విను మోవిప్రాధమ! నం, దనుఁ జంపి ధనంబు గొనుట దగునే
వేదం, బునఁ దాన పుత్రుఁ డగుచున్, జనియించు నటన్న పలుకు
చదువఁగ లేదే. ౩౯౪

వ॥ ఇయ్యది ధనలోభమ్మునఁ నాత్మహననం బొనరించుటయు కాదే! యని బహువిధంబుల దూషించుసమయమ్మునఁ గౌశికుం డట కరుదెంచి రోదనం బొనర్చు శునశ్శేఫునియెడఁ గరుణించి నృపతిం గాంచి వారించి యిట్లనియె. ౩౯౫

క॥ అకటా! మలకులమునుఁ గుద్వ్యా, జకుమారున్ జంపు టుడుగు జనవర!
నీయా, గకృతియుఁ బూర్ణం బగు నీ, కకలంకయశంబు రోగహా
నియు నొదవున్. ౩౯౬

మ॥ తనదేహమ్మున కన్యదేహమును విత్తం బిచ్చి పాపాత్ముఁ డా
జనకుం డీఁగొని వమ్ముచేసి యఘమున్ సాధింపఁగా నేల! యీ

జననింద్య మగుకృత్యముఁ విడు హరిశ్చంద్రావనీపాల! యెం
దును బుణ్యం బనుకంప హింస మిగులఁ దోషమ్ము ముమ్మాటికిన్.

గీ॥ సర్వభూతములందును సమత గలిగి, యింద్రియోపరమమ్మున నెసఁ
గువాని, కఖిలసుఖములు నొసఁగు నయ్యంతరాత్మఁ, డిట్టిదుష్కృతి
సౌఖ్య మొందేని యిడునె. ౩౯౮

చ॥ బ్రతుకుట యిష్ట మెల్లరకుఁ బార్థివ! నీవలె వీనికిన్ స్వకీ
యతనువునందుఁ బ్రీతి యగు టబ్బురమే? సకలంబు నాత్మస
మ్మితముగఁ జూచుపూరుషుఁడు మేటి; పురాభవవైరమేని నీ
కితనికి లేదు నిక్క మితఁ డేయపకార మొనర్చె నక్కటా. ౩౯౯

క॥ జనుఁ డెవ్వాఁడు నిరపరా, ధుని దున్మున్ వాఁడు వాని తొల్లిటి
కృత్యం, బును మఱవక రాఁ బోవుడ, వనమునఁ జలపట్టి చంపు
న్యాయ్యం బగుటన్. ౪౦౦

క॥ అకటా! యెంతటిదుష్టుం, డోకదా! ద్రవ్యంబునన్ గడున్ లోభయు
వుఁ, డి కనినసుతుఁ గనికరము గ,నక చంపఁగ నొప్పెఁ దజ్జనకుఁ
డు ద్విజుండై, ౪౦౧

క॥ పలువురఁ బుత్రులఁ గనఁదగు, నెలమిన్ గయ కేగు నొక్కఁడేనియు
యాగం, బులు సేయు నృపము విడుచున్, సలలితమగుగతిని
దనకు సంపాదింపన్. ౪౦౨

క॥ అనుధర్మ్మములు వమ్ముగ, జనకుం డేను సేయు టొప్పె? జనవర! దుష్టా
త్ముని నీతని శిక్షింపఁగఁ, జన దే? పాపంబు సైఁప జనపతి కగునే.

ఉ॥ ఏనృపుదేశమందు వసియించుజనుం డొనరించుఁ బాప ము
ద్దానను షష్ఠభాగమును దన్నరనాథుఁడు వొందు నుత్తముం
డైనత్రిశంకుభూమిపతి కాత్మభవుండవు పుత్రుఁ జంపు ని
వ్వానికి ద్రవ్య మిచ్చి రవివంశమునం దపకీర్తి గూర్తువే. ౪౦౪

క॥ మునిపుత్రుని విడుపుము దు, ర్జనుని నజీగర్తు శిక్ష సలుపుము న్యాయై
నని యోగం బొనరింపుము, పనుపను నీదేహమునం దపారసుఖమ్ముల్.

చ॥ జనవర! నీ పితండ్రి గురుశాపము చెంది శ్వపాకుఁ డయ్యె నా
యనువున బొందితోఁ జనె దివంబున కాయుపకారకారణ
మ్మునసయినన్ ద్విజాత్మజు విముక్తుఁ గఁ జేయుము బ్రాహ్మణుండయా
గనియుతు సన్ను వేఁడెనిని గావున నాకిది యోఁగఁ జెల్లదే.

ఉ॥ యాగ మొనర్చువాఁడు పను నగ్రజుఁ డెయ్యది గోరు దాని నన
ర్ఘ్యాగతుఁ డే రమేశుఁ,, డని యాడర యాని యొసంగు టొప్పు న
త్త్యాగికి యాగ మెట్లు ఫలదం బగు? నే నిది గోరినాఁడ నా
కీఁగఁ దలంపు మియ్యదిను యిచ్చిన రేండ్రి? సుఖంబు నీకగున్.

ఉ॥ నావుడు రాజు పల్కు మునినాథ! యథార్థము పల్కి తీవు స
ద్భావుఁడ వయ్యె నాకుఁ గ్రతుభంగ మొనర్చెదె? వేఱు గోరు మీఁ
గావలతున్ జలోదర మఖండగతి న్నను బాధ పెట్టఁగా
నావరుణున్ యజింపఁగ ధరామరపుత్త్రకుఁ గ్రీతుఁ జేసితిన్. ౪౦౭

వ॥ సకలధర్మవేత్త యగు నీ విందు బదులు సెప్పకు మనుచుఁ గౌశికుండు కోపానలుండై శునశ్శేపురోదనంబు విన నొల్లక కరుణారసపూర్ణుండై దుఃఖించు నజీగర్తపుత్త్రుపార్శ్వమ్మున నిలిగి యభయం బొసంగి యిట్లనె. ౪౦౯

ఉ॥ ఈనృపుఁ డేమి సేయు విను మే నొకమంత్త్రము సెప్పెదాఁడ న
ద్దానిఁ బఠింపు మయ్యది ముదంబిడు నిక్కని యట్లొనర్ప శ్రో
తానుగతంబుగా మనమునం దది మాటికిఁ దాఁ జపించె న
ద్దానఁ బ్రసన్నుఁ డయ్యె సుఖదాయకుఁడై వరుణుండు వానికిన్.

వ॥ అట్లు స్వస్వాహమ్మున శునశ్శేపునకుం బొడకట్టినయద్దేవుం గాంచి యెల్లరును విస్మితులైరి. హరిశ్చన్ద్రుండును బద్ధాంజలిపుటుండై నమస్కరించి యిట్లు సన్నుతించె. ౪౧౧

ఉ॥ దేవ! మహానుభావ! నను దీనుఁ గృతాగసు లుబ్ధు మందునిన్
బావితుఁ జేయ వచ్చితి వపారకృపారసవార్ధివై భవ

త్సేవకుఁడన్ గటాక్షమునఁ జేకొనుమీ యుపరాధ మెమ్మెయిన్
దేవర కాచరించితిఁ బ్రతిజ్ఞకుఁ దప్పితిఁ బుత్త్రికాంక్షినై. ౪౧౨

క॥ బెగడయ్యె నా "నపుత్త్ర, స్య గతి ర్నాస్తి" యనువచనసంశ్రవణమునన్, భగవంతుని నిను వంచితు, నిగఁ జేసితి దానఁ గాదె నిగమవిధిజ్ఞా. ౪౧౩

చ॥ తెలియనివాని హేలనము ధీవరులొప్పి సహింతు్ర దేవ! నా
కలవడె రోగబాధ పయి నాత్మజుచేసినవంచనంబు; శా
నల కరిగెన్ సుతుండు మరణమ్మునకున్ భయమంది; జన్మమున్
సలుపఁగఁ గ్రీతుఁ దెచ్చితిని సద్ద్విజపుత్రకు నీదుప్రీతికై. ౪౧౪

గీ॥ వీనికతమున దేవ! నీకై నదర్శ, నంబు నా కబ్బె ననుపమానంబు మజ్జ, లోదరవ్యాధిబాధయు నుడిగినట్లు, యయ్యె నావుడుఁ బాశి యిట్లనియెఁ బలికి. ౪౧౫

క॥ రోదనశీలుం డైన, న్నాదరమున ధైర్య మేది యనుపదమున్ స్తోత్త్రాదుల నుతించు ద్విజదా, యీదు శునశ్శేఫు విడువు మాముయు మెడలున్. ౪౧౬

వ॥ నీజన్మంబు పరిపూర్ణం బయ్యె నీ కింక వ్యాధి వలని భయంబు లేశంబును లేకుండు నని చెప్పి వరుణుండు శునశ్శేఫు విడిపించిన. ౪౧౭

క॥ అయకారణమై జయురవ, మయసుయ్యెన్ యజ్ఞశాల మహీపతియు నిరా, మయుఁడయ్యె శునశ్శేఫుఁడు, భయహీనుండయ్యె మఖము పరిపూర్తిఁ దగెన్. ౪౧౮

వ॥ ఇట్లు పిమ్ముట్టండై శునశ్శేఫుండు సభ్యులను నుద్దేశించి కృతాంజలియై. ౪౧౯

ఉ॥ ఓకృతవిద్యులై నకరుణోదధులార! మహాత్ములార! శా
స్త్రాకలనమ్మునన్ దగినయట్లు వచింపుఁడు మీరు దెవ్వఁడో
నా కగుఁ దండ్రి; మీదువచనమ్మున నాతనిఁ గొల్చువాఁడ సు
శ్లోకుని; ధర్మనిర్ణయము సూక్ష్మమతుల్ వివరించు టొప్పగున్.

క॥ అనవుడు సభ్యు లజీగ, ర్తునికిం దాఁ బుట్టి పెరిఁగి తుద కీతం డా
తనికిఁ గా కెవ్వరికిఁ, దనయుం డగు నొండు రీతి ధర్మ్యం బగునే.

వ॥ అని శంకించుచునుండ వామదేవుం డను మునివరుండు.

క॥ కనుఁగాక యజీగర్తుఁడు, ధనలుబ్ధుం డగుచు నమ్మె ధరణీపతికిన్
దనయుం డితఁడు గాఁడే, ననఘుఁడు వరుణునకుఁ బుత్త్రుఁ డగు
న్యాయ్యముగన్. ౪౨౨

గీ॥ అన్నదాత భయత్రాత యాదరమున, విద్య నొసఁగినవాఁడును విత్త
దాత, కనినవాడును నేవురు తనకుఁ దండ్రు, లండ్రు ధర్మవిధా
నజ్ఞు లైనమునులు. ౪౨౩

వ॥ నావుడుఁ గొందఱు కన్నవాని కనియు మఱికొందఱు వరు
ణుని కనియు నిఁకఁ గొందఱు నృపతి కనియుఁ దమతమయభిప్రాయ
ములు వెలువరించి వివరించునయ్యెడ వసిష్ఠుం డిట్లనియె. ౪౨౪

చ॥ వినుఁడు సభాసదుల్! శ్రుతిగవీపరిశీలనఁ జెప్పుచుంటి నీ
తని ధనలుబ్ధుఁడై క్రయవిధమ్మున భూపతి కిచ్చినప్పుడే
జనకత తండ్రియుం దెడలి సంగత మయ్యె నృపాలునందు; యూ
పనియతుఁగా నొనర్చుటను బార్థివుఁ డట్టిఁడ నాఁగఁ జెల్లెడిన్.

చ॥ వరుణుఁడు దన్ను మాటికి స్తవం బొనరించుటఁ జేసి వీని నా
దరమునఁ గాచె నాతఁడును దండ్రి యనం దగఁ డెవ్వని న్నుతిం
తురు మఱి వాఁ డొసంగు ధనతోషపశుప్రభుతాదిసంపదల్
పరమును బ్రాణముల్ దన కపారముగా ముద మబ్బెనేనియున్.

గీ॥ ప్రాణసంకటమునఁ గృపాపరత వీక్ష, వంతి మగుమంత్రి విచ్చి
కాపాడె నెవ్వఁ, డతఁడు కౌశికుఁ డీతనిపిత సుమతుల, సమ్మతం బిది
నావుడు సభ్యు లెల్ల. ౪౨౭

క॥ ఇది ధర్మ్యం బని నుడివిన, సదయుండై గాధిజుండు జనకుండై ర
మ్మిది మొదలు నాగృహమ్మునఁ, బొదలుము నాపుత్త్రులందుఁ బుత్త్రుఁ
డ వగుచున్. ౪౨౮

వ॥ నావుడు శునశ్శేఫుండు గౌశికువెంట నరిగెఁ బదంపడి వరుణుండు తనభువనమ్మునకుఁ జనియె ఋత్విజులును సభికులును దమతమ పొందుపట్లకు నేగిరి. ౪౨౯

గీ॥ ఆహరిశ్చంద్రభూపాలుఁ డామయంబు, వాసి కృతకృత్యుఁడై ప్రజా
పాలనం బొ, నర్చె రోహితుఁడు విని జనకునికడకు, వచ్చె దుర్గమ
మైనయవ్వనము విడిచి. ౪౩౦

చ॥ తనయుని రాక చారులు ముదమ్మునఁ జెప్పఁ ద్రిశంకుపుత్త్రుఁ డం
త నెదురు వచ్చె రోహితుఁడు దండ్రికి దండము వెట్టి దండ
రీతిని బదయుగ్మసన్నిధి నతిప్రతిపత్తిని లేవకున్న నం
దను నొగి లేవ నెత్తి ప్రియమమ్మునఁ గౌఁగిటఁ జేర్చెఁ దండ్రియున్.

క॥ నులివెచ్చని బాష్పమ్ములఁ, దలఁదడుపుచు మూర్కొనున్ ముదమ్మున
నంక, స్థలమున నిడికొని మోమున్, బలుమఱుఁగనుఁ గుశలమడుగుఁ
బార్థివుఁడు సుతున్. ౪౩౧

క॥ నరమేధయాగవృత్తం, బరిదిగఁ బుత్త్రునకుఁ జెప్పి యన్నరవరుఁ డా
దరమేదురుఁడై రాజ్య, స్థిరుఁడై జగమేలుచుండె ధీరులు మెచ్చన్.

వ॥ పదంపడి హరిశ్చంద్రుండు వసిష్ఠుండు హోతగా రాజసూయంబొనర్చి యతని నెక్కుడు సత్కారమ్ముల గారవించె. ౪౩౪

ఆ॥ వె॥ యాగపరిసమాప్తి యగుమీఁద నొకనాఁడు, శక్రసదనమునకుఁ
జనె నరుంధ, తీమనోహరుండు తివిరి గాధిజుఁడును, నటకు వచ్చె
నింద్రు నరయుపొంటె. ౪౩౫

## వసిష్ఠవిశ్వామిత్రసంవాదము

వ॥ ఇట్లిరువురును నొక్కెడఁ గూర్చుండి యుండునంత విశ్వామిత్రుండు హరిశ్చంద్రదత్తబహుమాన భాసురుండగు వశిష్ఠుం గాంచి విస్మయమ్మున నీకీయబ్బురం బగుపూజ యెవ్వాఁ డొనర్చె నొడువుమన నతండు సంతోషపూర్వకంబుగ నిట్లనియె. ౪౩౬

ఉ॥ చంద్రసమానసద్యశుఁడు సత్యవచోనిరతుండు నౌ హరి
శ్చంద్రుఁడు నాకు శిష్యుఁడు ప్రశస్తగుణుం డతిదాత యన్యరా
జేంద్రులు సాటి రా రతనియాగికి మెచ్చ యొనర్చె దక్షిణా
సాంద్రము రాజసూయము ననుసత్క్రియతో నప్డిడె నిట్టిసత్క్రతుల్.

గీ॥ సత్యవాదులు దాతలు శౌర్యపరులు, ధర్మరతులు నెందు భూతంబు
మొదలు, మూఁడుకాలమ్ములందు నిరేఁడుభువన, ముల హరిశ్చంద్రు
నకు సాటి గలరె నృపులు. ౪౩౭

వ॥ ఇట్లు వసిష్ఠుండు హరిశ్చంద్రుగుణాతిశయం బుగ్గడించిన నమ్మా
గ్రాంగ్రస్తుండై గాధిజుండు కోపసంరక్తలోచనుండై యిట్లనియె. ౪౩౮

క॥ కపటప్రియు మిథ్యావా, దపరాయణుఁ బెద్దఁజేసి తద్దయు నుతి చే
సి పలుకఁ దగవే యాతఁడు, నెపమున వంచింప లేదె నిరంధిపునిన్.

చ॥ పలుకుల కేమి? యానృపుఁడు బందెను వెట్టి మునత్యవాదిగాఁ
ఖలునిఁగ దాత గామిగ నికాము మొనర్పఁ గలాఁడ నిట్లు నే
నలుపనయేని నాదయినసంచితపుణ్యము రిత్త ప్రాపు ని
ట్లలవడఁ జేయఁ జాలినపు డట్లగునే భవదీయ పుణ్యమున్. ౪౪౧

వ॥ ఇట్లన్యోన్యసంభృతసుకృతమ్ములు పణమ్ముగా వివదింపుచు
నమ్మునివరులు నాకమ్ము విడిచి స్వాశ్రమమ్ములకు వచ్చి యున్నంత నొక్క
నాఁడు హరిశ్చంద్రుండు వనమ్ముఁ గ్రుమ్మరువాఁ డొక్కెడ. ౪౪౨

క॥ బోఁటిని నేడ్చెడియొకయం, భోరుహనేత్రాక్షిఁ జూచి పొడమిన
కరుణన్, ఘోరవనమ్మున నిటు లే, కారణమున నునికి యేడ్చెదు
కాంతుఁడు నీకున్. ౪౪౩

క॥ క్రూరుండు రాక్షసుండును, న్నారాజ్యమునందు లేఁడు నాతిరో? నిదుః
ఖారంభమ్మున కెవ్వఁడు, కారణము వచింపు వానిగం డడగింతున్.

చ॥ అనునరపాలువాక్యముల కచ్చెలి యుత్తర మిచ్చె నిట్లు రో
దనజనితాశ్రువుల్ వదనతామరసమ్ము నలంకరింపఁగన్

జనవర? గాధిజుం డనెడిసంయమి నన్నును బాధ వెట్టు శా
తనితపముఁ గొనుచర్థ మనఁ దన్నరపాలుఁడు దాని కిట్లనున్. ౪౪౫

వ॥ నీవు స్వస్థచిత్తుండవై యుండువది యేను భవత్పీడాపారాయణుండనై తపం బొనర్చునమ్ముని నిప్పుడ వారించువాఁడ నని యూరార్చి విశ్వామిత్రునాశ్రమమ్మున కరిగి నమస్కరించి వినయమ్మున నిట్లను.

ఉ॥ ఏల తపం బొనర్చెదు మునీంద్ర? వృథాగతి దేహపీడయున్
బోలునె సంయమీంద్రులకు; బొంకక తెల్పుము నీదుకోర్కె; భూ
పాలన మే నొనర్చుతఱిఁ బాపపుబుద్ధిని లోకపీడకున్
లీలఁ దపం బొనర్చ నగు లె మ్మిది పున్నెము పూరుషార్థమా.

వ॥ హరిశ్చంద్రుం డిట్లు వారింప నచ్చోటు విడిచి విశ్వామిత్రుండు తపం బుడిగి సంభృతక్రోధుండై యుండెను కరుగుచు. ౪౪౭

క॥ దినమునఁ దాను వసిష్ఠుఁడు, వినదించుచు యుండ దపంబు విఘ్నంబు
ను హే, తువుఁగఁ గోపము హెచ్చఁగ, నవనీపాలునకు వంచనా
ధ్యానకుఁడై. ౪౪౯

వ॥ ఒక్క దానవుని సూకరంబుగా నొనర్చి పనిచిన నదియును హరిశ్చంద్రునుపవనంబుఁ జొచ్చి రక్షకులకు భయము పెట్టి కదంబమాలతీయూథికాదులం గదలంజేయుచుఁ బుడమికి దంతాఘాతంబు దొడరఁ జంపక కేతకీమల్లికాదుల నున్మూలించుచుఁ గరవీరాశోకంబులం ద్రవ్వుచు ముచుకుందాశోక తిలక వకుళంబులఁ గూపుమాపుచుఁ గదనం బొనర్చునంత మాలాకారులు గొండొక పోరాడి శరంబులు పఱఁగించినఁ దలంకకున్నది కేవలసూకరంబు గావనియుఁ గాలరూపమ్మున నిట్లవ్వండేని రాఁబోలు ననియు శంకించుచుఁ బలాయనం బొనర్చి శరణాగతులైన నృపాలుండు వారల కిట్లను. ౪౫౦

ఉ॥ ఏమి భయమ్ము చెందుటకు హేతువు దేవతలో! సురారులో?
భూమిని నెవండు నాకును రిపుండు వచింపుఁడు వాని నింతలో
నేమమునై వధించెద నని న్నను నెక్కఁడెదుర్చువాఁడు? త
న్నామము మాపుఁ దావును గుణమ్ములునున్ వివరింపుఁ డింతకున్.

వ॥ నావుడు మాలాకారు లిట్లనిరి.

చ॥ దివిజుఁడు గాఁడు రక్కసుఁడు దీర్ఘబలుండునుఁ గాఁడు దేవ! పృ
థ్వివనములెల్లఁ గూల్చె నొకపంది తదీయబలంబు చెప్పఁగా
నవున! యెదిర్చి పై విడుచు నమ్ముల కోర్చియు నార్చి పేర్చి భీ
తి వడఁగఁ జేసె మమ్ముఁ; జని తీర్పుము దాని మదంబు నావుడున్.

వ॥ హరిశ్చంద్రుండు వాహనంబునెక్కి సైన్యావృతుండై వనంబున కరిగి ఘుర్ఘురించు క్రోలంబు పాదవ్రాలం గాంచి దానిచే విశీర్ణంబులై పడియున్న లతాకుంజపుంజమ్ముల నరసి సంజాతక్రోధుండై. ౨౬౩

క॥ కడుకొని ధనువున బాణము, దొడిగి యెదురు వచ్చుదాని దుడు
కడఁపఁగ నె, క్కుడు రయమున విడిచిన నది, తడయక పరుగిడి యె
నులివు దశదిశ లలమున్. ౨౬౪

క॥ ఈగతి నాశుగమునకున్, లోఁగక గికురించి వనములోఁ జొరఁబడున,
య్యాగడపుటడవిపందిన్, బాఁ గని కోపించి యేసెఁ దద్దయు శర
ములన్. ౨౬౫

ఉ॥ కొండొకసేపు గన్పడుచు గొండొకసే పెడమై యదృశ్యమై
గండునఁ గుర్మురున్ నడయుఁ గాళిలు నొకానొకచోట నాచ్చను
ద్దండముగాఁగ నొక్కయెడ; దానిపిఱుందన వాజి నెక్కి భూ
మండలనాయకుం డరిగె మానసికోపభరంబు పెంపునన్. ౨౬౬

క॥ రయమునఁ బఱచెడి కోలము, నెయిదఁగ నరపాలుఁ డిట్టు లేగినఁ
దత్సేన యదాయదలు పదాపద, లయి యాభూపాలు నెయిద
కటునిటు చెదరెన్. ౨౬౭

ఉ॥ ఆనరపాలసూతి యిటు లక్కిటి వెంట నధిజ్యచాపుఁడై
సేనను బాసి యేగి వనసీమలు పెక్కులు దాఁటి సంగత
గ్లానివిదూనమానసుఁ డఖండపిపాసకుఁ డంతఁ గాంచె న
క్కాననమధ్యమం దతులకాండమనోహరమైన యాపగన్. ౨౬౮

వ॥ కాంచి తత్తీరమ్మున వారువమ్ము డిగి జలమ్ములు ద్రావి శ్రా
వించి యిఁకఁ గోలమ్ము నరయరా దని కృతనిశ్చయుండై దిగ్భ్రమంబు
దొడర నగరంబున కెట్లు వేగుదు నని యోజించుచున్నంత వృద్ధబ్రా
హ్మణరూపమ్మున విశ్వామిత్రుండట కరుదెంచిన నతనికి నమస్కరించు
టయు నతండు స్వస్తివచనపూర్వకముగ నిట్లనియె. ౪౫౯

క॥ ఏమిది యొక్కఁడవై యీ, భూమికిఁ జనుదెంచితివి నృపుఁడవయ్యు
ను నీ, కేమి పని యబ్బె నిచట న, యోమయ మివ్వనము మనుజు
లుండరు దీనన్. ౪౬౦

వ॥ అని యడిగిన హరిశ్చంద్రుం డిట్లనియె.

ఉ॥ కోల మొకండు వచ్చి సుమకుంజములం బడఁగొట్టి యేడ్తెఱన్
బూలవనమ్ములోఁ దిరుగఁ బోఁడిమి దక్కి యెదిర్చి రక్షకుల్
దోలఁగ లేక నాకడకుఁ దోంపుభీతిని నేఁగుదేర నే
నోలి వధింప వచ్చి శర మొండు నిగుడ్చితి నంత నద్దియున్. ౪౬౧

విశ్వామిత్రుండు హరిశ్చంద్రుని వంచించుట.

వ॥ పరుగిడిన దాని వెంటఁ బఱతెంచి యిట కరుదెంచితి సైన్యం
బెటకేనియుం జనియెఁ గోలం బెటకేగెనో యెఱుంగ రాదు క్షుత్పి
పాస లధికంబుగ బాధించుటం జేసి నగరమ్మున కరుగ నెంచిన దిగ్భ్ర
మణం బొదవి మార్గంబు దెలియదు కరుణించి తెరు వెఱింగింపు మని
మఱియు నిట్లనియె. ౪౬౨

మ॥ అరయ న్నన్నెఱుఁగంగఁ జెప్పెద నయోధ్యానాయకుండన్ సభ
శ్చరమాన్యంబుగ రాజసూయము మొదల్ జన్నమ్ములం జేసి భా
స్వరకీర్తిన్ జగమెల్ల నేలెడిహరిశ్చంద్రుండ నాతోడ మా
పురి కేతెంచితివేని నిస్తులధనంబు న్నీకు నే నిచ్చెదన్. ౪౬౩

వ॥ తద్ధనంబునం జేసి జన్నంబొనరించికొందువుగాక నావుడు
విశ్వామిత్రుండు నగి హరిశ్చంద్రున కిట్లనియె. ౪౬౪

చ॥ ఇది యొక పుణ్యతీర్థము మహీశ్వర! యింద వగాహనంబొన
ర్పఁదగుఁ బితృప్రీతుం బొనరుపం దగుఁ దర్పణ మాచరించి యీఁ
గఁదగు స్వశక్తికొల్దిఁ ద్విజగణంబులు మెచ్చఁగ దానధర్మముల్
"నదిఁ గని యీఁడఁ బోయిన జనంబులు చెందుదు రాత్మహంతృతన్"

వ॥ అను మును వచనంబు వినవే? యిమ్మేడస్నానంబు సలిపి నీకుఁ
దోఁచినయది నా కిచ్చితివేని దాన సంతుష్టుండనై కొండొక నేల వచ్చి
మార్గంబు గనఁ జేయువాఁడ ననవుడు నృపాలుం డక్కపటవచనంబులఁ
గలతెఱంగెఱుంగక కృతోద్యముండై యున్నదినిఁ గుఱింకి పితృతర్పణంబు
సలిపి కపటాకారుండగు నావృద్ధున కిట్లనియె. ౪౬౬

ఉ॥ దాన మొసంగువాఁడ విదితంబుగఁ గైకొనుమయ్య నీకు నే
జేని యభీష్ట మయ్యదియ యిచ్చెదఁ గాంచనమో? గజాశ్వసం
తానమొ? భూమిఖండమొ? ధనంబులొ? భూషలొ? గోవులో? మహా
ధ్యానములో? సతీమణులొ? తక్కిన వెయ్యవియేని దేయముల్. 

క॥ మును రాజసూయమున సన్మునిసన్నిధియందు సకలమును గోరిన లే
దన కిత్తు ననుచు వ్రతముం, గొనియుంటి మహాత్మ! నీదు కోరిక
చెప్పుమా. ౪౬౭

క॥ అనఘుఁడవు నీవు తీర్థం, బును బావన మిది యొసంగఁబోలదె నీకో
రినకోర్కె నాదువ్రతినన్, మునిజను లెల్లరును సత్యముగ గణి
యింపన్. ౪౬౮

చ॥ అన మునినాథుఁ డిట్లను ధరాధిప! యంతటివాఁడవౌదు స
జ్జనసుత నైనసీయశము చాటుదు రెల్లరు సూర్యవంశసం
జనితుఁ డుదారధీయుఁడు త్రిశంకునిపుత్రుఁడు తాదృశుండు లే
డనుచు వసిష్ఠమౌనియును నాడఁగ వింటి నతండు బొంకునే. ౪౭౦

క॥ దాతవు సకలధరిత్రీ, నేతవు నీ కొండు కొదవె నృప! నాదుతనూ
జాతునకుఁ బెండ్లి సేయుమ, నేతాదృశ మైనకీర్తి నెనయుము
పేర్మిన్, ౪౭౧

వ॥ అని గాంధర్వ మాయావశమ్మున దశవార్షికి యగు నొక కన్నియను, సుకుమారుండగు నొక కుమారుని దెచ్చి చూపి వీర వధూవరు లిక్కార్యమ్ము రాజసూయాధిక పుణ్యప్రద మ్మనిచెప్పిన రాజట్లు కాక యని యంగీకృతిం దెలిపి యవ్విప్రప్రదర్శిత మార్గమ్మున స్వపురమ్మున కరిగె, మునియు నటనుండి స్వాశ్రమమ్మునకుఁ జని కృతోద్వాహుండై వచ్చి యగ్నిహోత్రి శాలాస్థితుఁడగు హరిశ్చంద్రుం గని యయ్యాది మంచిసమయ మ్మీవేదీమధ్యమ్మునన నాకు మున్నిచ్చెదనని చెప్పిన దానం బొసంగవలయు ననికోరుటయు వదాన్య శేఖరుండగు నానృపాలుం డిట్లనియె. ४२१

ఉ॥ ఆరయ నీవు బ్రాహ్మణుఁడ వంతయు నేలెడిరాజ నేను సం
సారికి నెంత యుండినను యశంబునకుం గొఱ గాక యున్న ని
స్సారమ కాదె వానిదగుజన్మము, ద్రవ్యము శాశ్వతంబె? నీ
కోరిన దేదియేనియును గొంకక యిచ్చెదఁ గోరుకొమ్మొగిన్. ४२३

మ॥ అన విప్రేం డనునట్టిదాత వె నరేంద్రా! నీయశం బింతక
న్నను నందందుఁ బొగడ్త కెక్కి జగదానందంబు సంధింప నీ
ఘనరాజ్యం బఖిలంబు నేన్గులు తురంగంబుల్ మొదల్ సంపద
ద్ధి నొసంగం గదవయ్య? నీవిటులె వేదీమధ్యమం దుండఁగన్.

వ॥ అని కోరిన హరిశ్చంద్రుండు మాయా మోహితుండై నీ యడిగినట్లు యిచ్చితి ననియె గాధిజుం డయ్యది గ్రహించి యిట్లను.

క॥ దానం బిచ్చితి దాసన్, మానవ ముఖ్యా గె "దక్షిణారహితంబౌ
దానము వ్యర్థం" బనియెడి, మానవధర్మంబు వినవె మానవనాథా.

వ॥ కావున దీనికిం దగియెడిదక్షిణ నొసంగి కృతార్థుండవు గ మ్మనుడు మునీంద్రా! దక్షిణామానం బది యెంత చెప్పు మనుటయు గాధిజుం డతని కిట్లనియె. ४२२

గీ॥ హేమభారద్వయమ్ము నాకిమ్ము సార్థ, ముగను దక్షిణ దానసంపూర్తి
చెందు,ననుడు నొసఁగెద నని ప్రతిజ్ఞను బొనర్చె,సత్యపరిపాలకుఁడు
హరిశ్చంద్రవిభుఁడు. ౪౭౮

వ॥ అట్లు కృతప్రతిజ్ఞుండై హరిశ్చంద్రుం డమ్మునికపటమ్మునకు విస్మయావిష్టుం డగుచు న్యాపసమ్మున మున్నరణ్యమ్మునఁ దన్నుం బాసి పలుత్రోవల నరిగిన సేనలు లనుదెంచి స్తుత్యాదికమ్ముల నలరింపుటయుఁ జింతాదంతురుం డగుకతన వారల కెద్దియుం జెప్పక యంతిపురమున కరిగి నిజాంతర్గతంబున. ౪౭౯

చ॥ ధనమును రాజ్యమున్ మొదల దానము చేసితి దాని కేమి య
మ్మునికపటంబె ఱుంగక సముద్ధతి దక్షిణ యిత్తు నంటి నిం
క నను ధన మేడఁ దెత్తు నిది కాలవశం బటుగాక యున్న నెం
దును దపసుల్ ప్రతారణమునం బొనరింతురె ద్రవ్యలుబ్ధులై.

వ॥ అని తదేకచిత్తుండై యొం డెఱుంగక యున్నపతిం గాంచి రాజ్ఞి యిట్లనియె. ౪౮౧

ఉ॥ చింతకు నేమి కారణము చెప్పుము కాననసీమనుండి ధీ
మంతుఁడు వచ్చెఁ బుత్రుఁడు; క్రమంబుగఁ జేసితి రాజసూయమున్
బ్రాంతమునందు దూరమునఁ బార్థివసత్త్వము ? లేఁ డరాతి; నీ
కింత విచార మేల? వచియింపుము నావుడు భూపమౌళియున్.

వ॥ చింతాకారణమ్మును గొండొక చెప్పి భోజనాదికం బొనర్పక యారేయి గడపునంతఁ దెల్లవాఱుటయు సంధ్యాదికృత్యంబు లొనర్చునంతకు మున్న విశ్వామిత్రుం డరుదెంచి కృతనమస్కారుం డగునృపతి కిట్లనియె. ౪౮౩

క॥ విడువుము రాజ్యమ్మును నొం, డెడ కేగుము దక్షిణార్థ మిచ్చెద నని
మున్, నొడివిన బంగారమ్మును, గడువడి నాకిమ్ము తడయఁగా
నేమిటికిన్. ౪౮౪

వ॥ అని ధార్ష్ట్యమ్మునం బలుకుగాధిజునకు నరేంద్రుం డిట్లనియె.

క॥ ఇచ్చితి సర్వస్వమ్మును, బుచ్చికొనుము వెడలి యిపుడ పోయెద నీకుం బ్రై, పెచ్చుగ నొడివినదక్షిణ, నిచ్చెదఁ గాలాంతరమున నిపుడీలేమిన్. ౪౮౬

వ॥ అని యమ్మునికిం జెప్పి భార్యాపుత్రుల వీక్షించి యిట్లనియె.

క॥ మనమూడుకాయములు గా, క నిఖలరాజ్యంబు వివిధకరితురగములున్, ధనధాన్యములును నిమ్ముని, జనమాళికి నిచ్చినాఁడ సంతోషముగన్. ౪౮౭

వ॥ కావున నిఁక మనమియ్యెడ నుండుటనుచితంబు వెడలుద మని నిర్గమించునమ్మహీపాలుని వెంటఁ గొమరుండును భార్యయునుం జింతాదంతురులై నమ్రవదనమ్ములతో నరిగి రట్లు కట్టుగుడ్డలతోఁ గదలు వారలయవస్థం గాంచి. ౪౮౮

ఉ॥ పౌరజనమ్ములెల్లరు నపారకృపారస మొల్క నక్కటా!
ధీరుఁడవయ్యు నించుకయుఁ దేఁకువ లేక మునీంద్రుమాయయన్
దారుణపాశముం దవిలి దైన్యము నొందఁగ నయ్యెనే! దురా
చారుఁడు ధూర్తుఁ డెంతపని సల్పె ధరామరుఁ డంచు బోరనన్.

వ॥ అమ్మునీంద్రు నిందించుచు దుఃఖాక్రాంతులై యున్నెడ భార్యాపుత్రసహితమ్ముగఁ గదలి పురంబు వెలువడినఁ బిఱుందన చని నిలువరించి గాధిజుండు నిష్ఠురమ్ముగ నిట్లనియె. ౪౯౦

చ॥ జనవర! దక్షిణం దగ నొసంగు మొసంగుట కిచ్చ లేనిచో
"నన న"యని పల్కు మట్టులయినన్ నిను నే నడుగన్ సమస్తముం
గొనుటకు నచ్చ యేని యిదిగోఁ గొను మిచ్చెదఁ గానిచోఁ బ్రతి
జ్ఞను జవదాఁట కిమ్ము కనకమ్మును దక్షిణకై యథామతిన్. ౪౯౧

వ॥ అని ప్రాణగొడ్డమ్ముగఁ దవిలినయమ్మునీంద్రునకు నమస్కరించి దీనాత్ముండై యంజలి ఘటియించి హరిశ్చంద్రుఁ డిట్లనియె. ౪౯౨

ఉ॥ వారక నీఋణంబది యవశ్యము నీఁదగు నిచ్చికాని యం
భోరుహమిత్రువంశమునఁ బుట్టియు మెచ్చఁగ రాజసూయముల్
సారగతిం బొనర్చియు యశమ్మున మించినదాతనయ్యు నే
నేరహిఁ నన్నముం దినఁగ నిచ్చ యొనర్తు జగంబు నవ్వఁగన్. ౪౯౩

వ॥ నీఋణంబు దీఱుదనుక నే భుజింప నొల్లమియు నిశ్చయంబు కొండొక తాళితివేని దైవాసుకూల్యమ్మునం జేసి ధనంబు చేకుఱు నది దక్షిణార్థంబుగఁ బ్రతిశ్రుతం బొనర్చినకనకమ్మునకుఁగా నొసంగెద నావుడు ముని యిట్లను. ౪౯౪

ఉ॥ వెడవెడ మాట లాడెదవు వీటఁడివే నరపాల? నీకు నె
క్కడ దొరకున్ ధనంబు? ధనకారణమైన సమస్తరాజ్య మి
ప్పుడ మదధీనమయ్యె నిటు బొంకక "లే" దని చెప్పు మింక ని
న్నడిగెడివాఁడఁ గాను జను మాపయి నీమది వచ్చునట్లుగన్. ౪౯౫

మ॥ వనవాసమ్మున కేగువాఁడు నృపుఁ డిప్పాటన్ బ్రియోగించున
మ్మునివాగ్బాణములన్ సహింపక యనున్ మోఘమ్ముగాఁ బల్కువాఁ
డనె? ద్రవ్యంబున కేమి శంక? యొకచోటన్ దేహమే నమ్మి నీ
కనకం బిచ్చెద నిర్ధనుండ నని నన్ గారింపఁగా నేటికిన్. ౪౯౬

ఆ॥ వె॥ తెవులు లేనిమూడు దేహమ్ము లుండఁగ, నీఋణంబుదీర్ప నేర
మెట్లు, గ్రాహకుం డొకండు గల్గనే నీయయోధ్యాపురమ్మునందుఁ
జూపు మనఘ. ౪౯౭

హరిశ్చంద్రుండు కాశికిఁ బోవుట.

వ॥ కాదేనిఁ గాశీపురమ్మున మమ్ము విక్రయించికొని నీకు దక్షిణార్థంబు ప్రతిజ్ఞాతం బగుసార్ధభారద్వయపరిమితకాంచనమ్మును నొసంగుదునని చెప్పి తత్సహితమ్ముగ నరుగువాఁడు ముందట. ౪౯౮

ఉ॥ గౌరిని గూడి శంకరుఁడు కాఁపురముండెడిచోటు మేటిభా
గ్యగీయోద్యానం దనరు కేవలపుణ్యపురాశి కాశి యిం

పారఁగఁ గాంచి యందుఁ గలహార్యములన్ దిలకించి ప్రోలికిన్
దూరమునుండి చేసెఁ బ్రణతుల్ గృతకృత్యుఁడ నంచు నెంచుచున్.

వ॥ పదంపడి గంగానికటమ్మున కరిగి యందుఁ గృతస్నానుండై తర్పణాదికం బొనరించి మునిఋణవిముక్తికై మార్గమ్ము నాలోచించుచు సర్వథా యిప్పుణ్యస్థలంబు శివపరిగ్రహంబు కాని మనుష్యపాలితంబు కాదు. కావున నిట నన్నుకించిత్కరునైన నెవ్వండేని తదనుమతమ్ము నంజేసి కొని కృతకృత్యునొనర్పవచ్చు నని యెంచుచు సుతసతీసహితమ్ముగఁ గొంతతడవేగి పార్శ్వగతుండును దక్షిణార్థియు నగుబ్రాహ్మణుం గాంచి వినయమ్మున నిట్లనియె. ౯౯

క॥ ఈనన్ను నాదుకొమరున్, నానారీతిలకమును గనందగుఁ బేర్మిన్
మానివర? యేమిపని మా, కానతి యిచ్చెదవు తెల్పు మర్మిలికల్మిన్.

వ॥ ఇందొక్కరికతన నీఋణంబు దీర్పఁగొను మనుడు నవ్విప్రుఁడు రాజున కిట్లనియె. ౧౦౧

క॥ ఒకమాస మాయె నను మి, న్నక మాటలు సెప్పి తిప్ప నాయమె భూపా, లక! దక్షిణ యిడి కదలుము, యకలంకంబైనకీర్తి వండె దవేనిన్. ౧౦౨

వ॥ నావుడు హరిశ్చంద్రుండు మహాత్మా! మాసం బిప్పటికిని బూర్ణమ్ము గాలేదు దినార్థం బింకను వ్యవధి యున్నయది యించుక ప్రతీక్షించితివేని ఋణవిముక్తుండ నయ్యెద నన నమ్ముని యిట్లను. ౧౦౩

క॥ ఇపు డరిగివచ్చెదను స, త్యపరత నపు డీఁదలంపు నందక యున్నన్
శపియించెద నని యరిగెన్, గపటబ్రాహ్మణుఁడు నృపతి కళవళ మందన్. ౧౦౪

ఉ॥ అంతఁ ద్రిశంకుపుత్త్రుఁ డకటా? యెటు లిమ్ముని యప్పు దీర్తు? శ్రీమంతులు మిత్రు లుండినను మానము దక్కి నిభుండ నయ్యు నొక్కింతకుఁ జేయిచాఁపుదు నె? వృత్తులు మూడు విధించె క్షత్రతాక్రాంతుల కెల్ల బ్రహ్మ; యవిగాక మఱొక్కటి ద్రొక్కఁ జెల్లునే.

వ॥ ఇట్లని ఋణంబు దీర్పక మున్న మృతి చెందితినేని బ్రహ్మస్వా
పహరణజనితకోపమ్మున నధమాధమం బగుకృమిజన్మంబు సంప్రాప్తం
బగుఁ గాదేనిఁ బ్రతిశ్వంబు చేకూరు నట్లు గాన నాత్మవిక్రయణం
బొనర్చుటయ పరం బని యోఁచి చింతాకులత్వమ్మున నధోముఖుండై
దీనుండై యున్నపతికి సతి యిట్లనియె. ౫౦౬

ఉ॥ జనవర! సత్యవంతులకు సాటి మఱొక్కఁడు గాఁడు సత్యవా
క్యనియతి దప్పి ప్రేతసముఁడై వెలిఁజెందు నరుండు; వాని స
ర్వనియమముల్ వృథా ఋణము పాలన సేయును స్వర్గలోకసా
ధన మగు నెట్లు సత్య; మనృతం బగు దుర్గతి కట్టి హేతువై. ౫౦౭

వ॥ నాథా! యయాతి శతాశ్వమేధంబు లొనర్చి పిదప రాజ
సూయకర్తయై స్వర్గమ్మున కరిగి యొక్కపరి యసత్యం బాడి యధోగతికి
వచ్చెడి నని విందు మనుచు రా జిట్లనియె. ౫౦౮

గీ॥ ఎద్దియో చెప్పఁ దలఁచితి విందువనిన?, పలుకు మయ్యది కొంకక
బాలకుం డు, తండు వంశంబు నగడింపఁ దగినవాఁడు, కలఁడు వెను
దీయ నెయ్యది కారణంబు. ౫౦౯

వ॥ నావుడు రాజపత్ని యిట్లనియె.

క॥ నరవర! సంతానమ్మున, కరయఁగ సతి యుట్టిఫలము నందితివిఁకన
న్నొరులకు నమ్మి ధరామరు, నిఋణము దీర్పంగఁ జనదె నిశ్చలబుద్ధిన్.

వ॥ అనుశైబ్యవచనమ్ములకు దుఃఖాకులుండై.

చ॥ చెలి! దరహాససంగతినిఁ జెన్నలరారెడిపల్కులెల్ల ని
మ్ముల విడనాడి నాహృదయముం గలఁగింపఁగ నిట్టివాక్యముల్
పలుకుట చెల్లునే? మృదులభావము గల్గినదానవయ్యు న
న్నలయఁగఁ జేయుదే? విధికి నన్నము బున్నెముఁ లేక పోయెనే.

వ॥ అని కరుణంబుగఁ బల్కి యన్నృపాలుం డుదారవిక్రియ
మ్మున కధీరుండై దుఃఖాతిరేకమ్మున మూర్ఛం జెందినం గాంచి యప్పతి
వ్రతయు. ౫౧౨

ఉ॥ హా నరనాథ! దైవమున కంతగ నెల్లిద మైతిమే! జగ
న్మానితులైన భూపతులు మన్ననఁ జేయఁ జతుస్సముద్రము
ద్రానుగతంబు భూవలయ మంతయు నేమహనీయుఁ డేలు న
వ్వానికి నీకు స్థండిలముపై నిటు నవ్వగఁ గూరు టొప్పునే. ౧౧౩

ఆ॥ వె॥ కోట్ల కొలఁది విప్రకోటులకిచ్చి యు, జ్ఞములు చేసి సత్యసంధుఁ
డనఁగ, నెగడునాదుపతికి నీకు నీదురవస్థ, యెట్లు గల్గె! నాకు
నెఱుఁగఁ జెపుమ. ౧౧౪

క॥ అనయము నిందోక్తిపెందుల, కన యీతఁ డనంగఁ బుడమి నేతెడి
ధర్మా, త్మున కీదుర్దశ గూర్చఁగఁ, జను నే! దైవమున కింత శంకయు
వలదే. ౧౧౫

క॥ అని పలుమఱు గుందుచు న, వ్వనజానన మూర్ఛ గూరి భర్త
దరిన్ గ్రి, న్ననఁ బడియె నిట్టికష్టము, చన దిఁక నెవ్వానికేని
శత్రుండైనన్. ౧౧౬

వ॥ ఇట్లిరువురును మూర్ఛం జెందియున్నయెడఁ గొమరుండు
రోహితుండు క్షుధాకులుండై. ౧౧౭

క॥ నాలుక యెండెడి నాక, బ్బా! లలి భోజనమునిడక ప్రాణమునిలువం
జాలదు క్షుద్బాధకు నేఁ, దాళ ననుచు మొత్తువెట్టుఁ దలిదం
డ్రులకున్. ౧౧౮

గీ॥ అంతలో నంతకుఁడు వ్రాలె నధికకోప, మడర గాధిజుఁ డేతేర నవ
నిపతికి, నధికమై తగె దుఃఖ; మట్లగుననుగాదె, ఋణికి ఋణదాత
క్రుద్ధుఁడై యెనయుపట్ల. ౧౧౯

వ॥ విశ్వామిత్రుండును మూర్ఛం గూరినయన్నరపాలునిపై శీత
లోదకంబు చిలికి. ౧౨౦

క॥ నరపాల! నీక కాదిది, నరులకు నెల్లరకునున్ ఋణము నీఁదెరువున్
బొరయనివారికిఁ గలయది, యు రయము మై లెమ్ము వంచనాద్వృతి
మేలే. ౧౨౧

వ॥ అని కోపించి హరిశ్చంద్రుండు శీతలోదకసేచనమ్మున లబ్ధసంజ్ఞుండై క్రోధావిష్టుండును సంతాపరావతాకుండును నగునమ్మునిం జూచి మగుడ మోహాయత్తుండగుచు ద్విగుణితక్రోధుండై తపసి నృపున కిట్లనియె. ౫౩౩

చ॥ సత్యము దప్పవేనియు నొసంగుము దక్షిణ; సత్యహేతు వా
దిత్యుని తేజ మిథ్యయని తెల్లము సత్యమునంద నిల్చు నా
దిత్యులలోక మిమ్మెడఁ బ్రతిష్ఠితమై చను సర్వధర్మముల్
సత్యమునంద పొల్చు నొకసత్య మగుఁ శతవాజిమేధముల్. ౫౩౪

ఆ॥ వె॥ ఇంతయేల నాకు నినుఁ డస్తగిరి కేగు, నంతలోన దక్షిణార్థమైన
కనక మిచ్చి పుచ్చుఁగా నేరవేని శాపం బొసంగువాఁడఁ బార్థివేంద్ర

## హరిశ్చంద్రుండు భార్యనమ్ముకొనుట.

వ॥ ఇట్లు పుట్టులోఁడక నిష్ఠురమ్ముగఁ బల్కి యతండు సనినపిమ్మట దుఃఖార్ణవమగ్నులై దంపతు లిరువురును గుందుచున్నంత వేదపారగుం డగునొక బ్రాహ్మణుండు బహువిప్రసహితుండై యెటకేనియుం బోవుచుండ రాజపత్ని యాతనిం జూచి పతి కిట్లనియె. ౫౩౫

ఉ॥ ఎవ్వఁడు విప్రులం గలిసి యిట్లరుదెంచుచునున్నవాఁడు దా
నొక్కమహీసురుం; డతనియొద్దకు నేగి ధనంబు గోరినన్
దక్కక యిచ్చుఁ బుత్త్రులకుఁ దండ్రిధనంబు గ్రహించు టొప్పదే?
తక్కినమూఁడుజాతులకుఁ దండ్రులు కారె మహీసురోత్తముల్.

వ॥ అనుసతికిఁ బతి యిట్లనియె.

గీ॥ క్షత్రియుఁడనయ్యు నేఁ బ్రతిగ్రహముకొఱకుఁ, జేయి చాఁపుటయెట్టు
లిస్సీ! ప్రతిగ్రహంబు విప్రులసొమ్ము వర్ణంబులకును, వారు గురు
వులు పూజ్యులు వారిజాక్షి. ౫౩౬

క॥ గురువుల యాచింపం దగ, దరయఁగ దానంబు యజన మధ్యయ
నంబుల్, శరణాగతరక్షణముల్, బరమంబులు క్షత్రియులకుఁ బరి
పాలనముల్. ౫౩౭

గీ॥ "దేహి" యనుమాట పలవదు దేవి! నాకుఁ, గలుగుఁగాక "దదామి"
యనెడు పలుకు దెచ్చి, యెట్టులైనను నిమ్మునిఋణము దీర్చి, నడు
గుటకు నోరెంత గలదె యెందైనఁ గస్త్రి. ॥౨౯

వ॥ నావుడు రాజ్ఞి యిట్లను.

క॥ సమవిషమకాలములయెడ, గమునఁ దమానం బమానకతయుఁ
దాత్మ, త్వము యాచకత్వ మనునివి, క్రమమున నొడఁగూడుఁ
గాలగతి వార్యంబే. ॥౩౦

క॥ కాదేని ధర్మలతకుఁ, బాదులు బ్రాహ్మణులు ద్రోహపరులై కస్త్రీ
ద్వాదృశుఁ ద్రోయుదురే? మ, ర్యాదాస్ఖాలిత్యములు సమయచోది
తముల్. ॥౩౧

చ॥ అనుసతి కిట్లు పల్కె జలజానన! వాఁడికరాసిఁ బూని గ్ర
క్కున రసన్ సుఖం బలరఁ గోసికొనం దగుఁగాని యొక్కనిం
గని ధనలోభ మూని యడుగన్ గమకింతునె "దేహి"యంచు రా
జునకుఁ ద్రిశంకుపుత్రునకు శూరున కింతటిదైన్య మొప్పునే. ॥౩౨

వ॥ కావున నెల్లెస భుజవీర్యార్జితం బగుధనమ్మొరులకీయన య
భిలషింతుంగాని యాచ్ఞాదైన్యంబొల్లననుడు నప్పతివ్రతాశిరోమణి యిం
ట్లనియె. ॥౩౩

ఉ॥ అమ్మిన నార్చినన్ మఱియుఁ నందల మెక్కఁగఁ జేసినన్ వివా
హమ్మునఁ గొన్నభార్య దగు నన్నిటికి న్నరపాల! యాచ్ఞకున్
సమ్మతి లేనిచో నను యశమ్మునకై తెగనమ్మి నచ్చు మూ
ల్యమ్మును నిమ్మునీంద్రునిఋణార్థముగా నిడు మింత యొప్పదే? ॥౩౪

క॥ అనుసతిపలుకులు విని యా, జననాథుఁ డఖండదుఃఖసాగరమునఁ గ్ర
న్నన మున్గి యింతకష్ట, మ్మునకు న్నే నోర్వ నెట్లు పూన్తెంతుముఖీ.

వ॥ అనిన నోదార్చి యమ్మగువ మరల నిట్లనియె.

గీ॥ ద్యూతహేతువు మద్యహేతువును రాజ్య, హేతువును భోగహేతువు
నెఱుఁగ నకట, సత్యసంరక్షణమునకు సాధ్వి నమ్మఁ, దగదె నీవంటి
యుత్తమోత్తమున కధిప. ౧౩౬

క॥ అని మాటిమాటికిని న, వ్వనితామణి యుక్తియుక్తవచనమ్ములఁ ద
న్మనము ప్రేరేపఁగఁ దఁద కిట్లను నంగీకారమాత్రయుం దిగురింపన్.

ఉ॥ ఎవ్వఁడుఁ జేయరాని పని యే నొనరించెద నీదుమాటచే
జవ్వని? భార్య నమ్మెడినృశంసులు గల్గిరె యేయుగమ్మునం
దెవ్వఁగ నిట్టిదుష్కృతికి నిచ్చ యొనర్తు? నభాగ్యమూర్తినై
నవ్వుల కాకరంబ నయి నల్వురలోఁ దలవంపు నింపఁగన్. ౧౩౮

వ॥ ఇట్లు చింతించుచు నెట్టకేలకు హరిశ్చంద్రుండు రంగమ్మునఁ
బత్ని నవతరింపఁ జేసి గద్గదకంఠుండై యెడనెడ నడుచునాగరికుల
కిట్లనియె. ౧౩౯

గీ॥ నాగరికులార? కరుణాసనాథులార?, యీతలోదరి నాభార్య యె
వరికేని, దాసిగా విక్రయించెదఁ దగినధనము, నీఁ గలుగుదాత
గలఁడే యుండెందుఁ జెపుఁడ. ౧౪౦

వ॥ నాపుడు వార లందఱుఁ బరమాశ్చర్యసంభృతమానసులై
మండలాకారమ్ముగఁ జుట్టువారి నిలిచి నీవెవ్వండ విట్లు పత్నివిక్రయణం
బొనర్ప నేమివచ్చె నాపుడు వారల కతం డిట్లను. ౧౪౧

క॥ నగపాలు వచ్చి యీఁదు, ర్భగకార్యము చేయువాఁడఁ బాపాత్ముఁ
డ దుం, డగుఁ డగురక్షనునిన్ బో, లఁ గలుగుకఠినుండ నన్ ద
లంప నఘు మగున్. ౧౪౨

వ॥ ఇట్టినావృత్తాంతమ్ము. మీకేల వలసిన నియ్యంగనం దగిన
ధనమ్మిడి దాసిగాఁ గైకొనుఁడని యుచ్చైస్స్వరమ్ముగ నుడువునమ్మా
నవపతివచనంబులు విని కౌశికుండు వృద్ధబ్రాహ్మణరూపంబు ధరియించి
యుతద్యెడ కరుదెంచి యిట్లనియె. ౧౪౩

చ॥ ధన మతులంబుగాఁ గలదు తద్దయునన్ సుకుమారి యస్మదం
గన పని సేయ రామిఁ గడుఁ గష్టము చెందుచునుండు నీకుఁ గో
రినధన మిచ్చి పుచ్చెదను బేరియసి నమ్ముట నిక్కువంబె నాఁ
గను బ్రతి చెప్పఁడయ్యె క్షితికాంతుఁడు కూరినవంతఁ బొంపునన్.

వ॥ అట్లు నిరుత్తరుండగు నన్నరపాలున కతండు మరల నిట్లను
ధర్మశాస్త్రములఁ ద్వాత్రింశల్లక్షణోపేతయు శీలవతియు నగుతరుణికి
మూల్యంబు కోటి యనియుఁ బురుషునకు నర్బుదం బనియుఁ జెప్పం
బడుఁ గావున. ౧౭౫

క॥ నీతరుణి కనుగుణం బగు, నీతన్మూల్యంబుగొనుము గృహమేగెద నే
నీతన్విం గొని యనవుడు, నాతఁడు ప్రతి చెప్పఁడాయె నతి
దుఃఖమునన్. ౧౭౬

గీ॥ అంత నావృద్ధవిప్రుఁ డహంకరించి, ధనము నృపునగ్రమునఁ బోసి
దాసివైతి, రమ్ము తడవేలయనుచుఁ గరముఁ గొప్పు, పట్టి యీడిచె
నారాజపత్ని నకట. ౧౭౭

వ॥ అట్లు కరినుండె లాగికొని పోవుచున్నయమ్మునికి నప్పరమ
సాధ్వి యిట్లను. ౧౭౮

చ॥ అకట? మునీంద్ర? నన్ విడువుమయ్య? సుతున్ విడనాడ నోప నే
నకలుష నాపతివ్రత నయుం బోకయించుక లేక నన్న్నము
ట్టకు మని పుత్రుఁ గూర్చి యకటా నృపపుత్రిక! దాసినై నన్నా
వికలత చూడుమయ్య నను విడఁ గదయ్య యిఁకేటికూరుణ్ణిల్.

చ॥ అనినను వస్త్రమున్ విడువ కన్నృపపుత్రకుఁ డంబ? యంబ? యం
చనుగతుఁడై యఖండగతి నశ్రువు లొల్కఁగ నేడ్చుచున్ బునః
పునరుదయుత్పదస్ఖలనమున్ గని యేగుచు నుండ నంత దు
ర్జనుఁడా యతిం డు పొమ్మనుచు రాజసుతున్ గర మెత్తి మొత్తెడిన్.

ఆ॥ వె॥ ఎంత తిట్టి మొట్టి యెడ చేయ నెంచినఁ, దల్లికొంగు పట్టి
తత్తఱమున, వెనుక నరుగుచుండె విడువఁగ శక్యమే, బాలురకును
దల్లి పట్టఁ బేర్మి. ౧౮౦

చ॥ అటు చనుదెంచునాత్మజుని నయ్యాను గాంచి మహాత్మ! నన్నుఁ గొ
న్నటులె మదాత్మజాతుఁ గొనుమయ్య? ధనంబు నొసంగి; యిట్లొన
ర్చుట నను రక్షసేత యొకరుండ సుతుం డగుటన్ విశేషలం
పట మగు మున్న సంబు వనిపాటలకున్ వెనుదీయుఁ గానిచో. ౧౧౨

రోహితుండు క్రీతుండగుట.

వ॥ ఇంతులకుం గొఱగాని నన్నుం గొని యేమి ఫలంబగు నో
యయ్యా! యెట్లైన దీన నగున న్ననుగ్రహించి నాకొమరునిఁ గ్రీతుఁగా
నొనర్పు మనవుడు నతం డంగీకరించి పురుషునకు నర్బుదంబు మూల్యం
బని చెప్పి యమ్మహీనాథునొద్ద లెద్దనం బునిచి మీరిరువురును వెంబడి
వచ్చునది యని చెప్పి యవ్విప్రుండు బయలువెడలె నంత నమ్మహాపతి
వ్రత భర్తకుఁ బ్రదక్షిణం బొనర్చి పాదమ్ములపై శిరం బిడి యతిదుఃఖ
భరమ్మున నిట్లను. ౧౧౩

క॥ దానము లేఁబడి యున్నలు, మానింపంబడి ద్విజుల్ సమగ్రమ్ముగ స
న్మానితులె రేనియు నా, కీనరపతి భర్త కాఁడె యెన్నిభవములన్.
క॥ అని పాదములం బడి వా, రనిభక్తియుఁ బేర్మి కూర్మి గ్రిందుకొనఁ
గ లే, వనిభాగ్యం గని దుఃఖాం, బునిధిం బడి యిట్లు వల్కె భూ
పాలకుఁడున్. ౧౧౧

క॥ ఈతిగుణి యాతలోదరి, యాతిల కెటు లేగు? భర్తనగునా కెడమై
యేత్రిరున మను? వృత్తా, పేతంబై నిడ యొలయు బెందుం గలదే.

వ॥ అని నికటగతుం డగుకొమరు నుద్దేశించి.

మ॥ అకటా! న న్విడనాడి పోయెదె కుమారా? దుర్భగుండైన తం
డ్రికి నీబోటి సుతుండు దక్కునె? యికన్నే దుఃఖముం జెంద నొ
ద్దకు నేతెంచి నిషేధవాక్యములు దద్దన్ బల్కి యోదార్చి బు
ద్ధికి ధైర్యం బిడువార లెవ్వరు! ననున్ దీనాత్ముఁగాఁ జేసెదే. ౧౧౮

ఉ॥ ధారుణిఁ మెల్లఁ బోయిదను ధైర్యము వీడ; సుతున్ గుణాకరున్
ధీరమతున్ వ్యజించుటెటు? దెల్పఁగదయ్య? ద్విజేంద్ర! యంచునా

భూరమణులకు విప్రునని పూతచరిత్రి! సరోజనేత్రి! న
న్నీరహిఁ డించి దాసివయి యేగెదె! దైవబలమ్ము పెంపునన్. ౧౫౮

క॥ నను నిక్ష్వాకుకులోద్భవుఁ, డనియును రాజేంద్రుఁ డనియు నధినాథు
నిఁగాఁ, గాని నాకారణమున నో, కక్కనికిన్ దాసివయి యుండఁ
గాఁ బనుపడెనే. ౧౫౯

క॥ ఏతాదృశగురుదుఃఖా, న్వీతుఁడనై యుండునన్ను నెవ్వరు మోదా
న్వీతు నొనరింతు రని యు, త్క్యాతురుఁడై భూపుఁ డడలె ననదవి
ధమునన్. ౧౬౦

వ॥ అంత నవ్విప్రుం డేతెంచి క్రోధాకులుండై యారాజర్షి సమక్షమ్మున నారాజపత్నిం బట్టి కశాఘాతమ్ములం గొట్టి పుత్రిసహితమ్ముగ నీడ్చుకొని పోవుచుండ హరిశ్చంద్రుం డేమియుం జేయునదిలేక యిట్లు దుఃఖించె. ౧౬౧

చ॥ తరణిశశాంకవాయువులు తక్కనమానవులున్ మఱెవ్వరే
పరమపతివ్రతం గనఁగఁ జాల్పడ కుందురొ మున్ను; నేఁడు భా
గ్యరహితనై యకారణము యువ్వనితామణి దాసి యయ్యె దు
స్తర మగుదైవపాక మది దాఁటఁగ రాదు విరించికైనియున్.

ఉ॥ మారుని గేరువాఁడు సుకుమారుఁడు నాదుకుమారుఁ డితఁ డం
భోరుహమిత్రవంశజుఁడు పూజ్యతఁ దక్కి యభాగ్యుఁడై ననా
నేరమికారణంబుగ ననిందితుఁ డొక్కనిచేతఁ గ్రీతుఁడై
బోరన నేఁడుచుం జనుట పోలునె? పుత్రులు లేరె ధాతకున్. ౧౬౩

ఉ॥ హా నళినాక్షి? హా తనయ? యక్కట! దుష్టుఁడనై ననాదుదు
ర్మానము కారణంబుగఁ గ్రమంబున దైవబలమ్ము దక్కి యొం
దేనియుఁ బోతిరే? ఋణము తీరెనె? మీకును నాకు నేఁటికో
బూనిక నింత చేసియును బోవనిపాపము నాకుఁ గల్గెనే

వ॥ అని మిన్ను మన్ను నొక్కటిగా విలపించు
కడకు విశ్వామిత్రుండు సశిష్యుఁడై వచ్చి కోపమ

క॥ అనృతం బాడక సత్యమ్మునకుం గట్టువడెదేని మున్నిచ్చెద నీ, కని
పల్కి నదక్షిణఁ గ్రక్కున నాకిడు మనుడు ధరణినాథుఁడు పేర్మిన్.

వ॥ మునిహృదయం బెఱింగి యితండు రాజ్యదానదక్షిణయుం గాక మున్ను నే నితనికి "యాగార్థంబు ధనం బిచ్చెద నయోధ్యకు ర" మ్మని నొడివిన ధనముంగూడ దెమ్మనుచున్నవాఁడు కాని మ్మీధనం బున సార్థహేమభారద్వయంబ కాక మఱికొంత మిగిలియే యుండుఁ గావున నుభయమ్మునకుం బర్యాప్తంబగుం గాకేమి యని కెలన నున్న ధనముం జూపి యిందు రాజసూయదక్షిణయుం గలదు దీనిన్ గ్రహించి నన్నుం గృతార్థుఁ జేయుము నావుడు గాధిజుం డీధనం బెట్లు సంగ్రహించితివి నీ వనవు మనుడు నతం డిట్టు లను.

క॥ మునివర? ద్రవ్యంబును గై, కొను మంత్రియు కాని వేఱు గోరకు మ
దినే, వినిచిన నీకును నాకును, జనుపదు శోకంబు పట్టఁ బగ్గము
లేమిన్. ౫౬౮

క॥ నావుడు ముని యిట్లను నో, భూవల్లభ? ద్రవ్య మెట్టిపోఁడిమిచే నీ
తావునకు వచ్చె శస్త్రం, బై వెలయక యున్న మాకు నది గ్రా
హ్యంబే. ౫౬౯

చ॥ అనవుడు రాజు వల్కె వినుమయ్య మునీంద్ర? పతివ్రతాంగనా
జనమణి యైనమత్సతిని సద్గుణశోభిత నమ్మినాఁడ ని
ష్కనిచయ మొక్క కోటిగొని; కన్నకుమారకు నర్బుదంబు గై
కొని యిడినాఁడ నీధనము గొంకక గైకొనుమయ్య మ్రొక్కెదన్.

వ॥ అని ప్రార్థించుటయు నమ్ముని యాధనముం జూచి యియ్యది
యల్పంబు రాజసూయమ్మునకు దక్షిణ యింత స్వల్పం బెట్లు? మఱి
తెచ్చి నా కొసంగు మట్లొనరింపవేని. ౫౭౧

ర్వ మధ్యయనంపుఁ జేవ, మత్ప్రభావంబు నాదగు తపము
జేసెద విప్రు లనంగ నంత, నెల్లిదమె? యిమ్మత
౫౭౨

అనవుడు హరిశ్చంద్రుండు కొండొక తాళితివేని మఱియుం గొంతధనం బిత్తుననుటయు గాధిజుండు రాజా! యిఁక దినమ్మున నాలవభాగంబుమాత్ర మవశేషముగా నున్నయది యంతదనుకం దాళువాఁడఁ బిమ్మట మఱుమాట చెప్పిన నే నొప్పెడి వాఁడఁగా నని యాధనంబుగొని యరిగెఁ బిదప హరిశ్చంద్రుండు దీర్ఘనిశ్వాసం బొనరించి యధోముఖుండై యుచ్చైస్స్వరమ్మున నిట్లనియె. ౧౭౩

క॥ ననువిత్తక్రీతునిగా, నొనరిచి ప్రేతత్వ మంది యుండిననాచేఁ, జను
నెవ్వని యార్తి యతం, డనుగతుఁడై యిటకు వచ్చు నర్కాండుండన్.

వ॥ అనునంత నొక్కచాండాలుండు దుర్గంధదూషితశరీరుండు వికృతాకారుండు శ్మశ్రులుండు లంబోదరుండు శవమాల్యాలంకృతుండు హస్తజర్జరయష్టి యగుచు నేతెంచి యిట్లను. ౧౭౫

క॥ విను మేఁ జాండాలకులమ్మునఁ బుట్టి ప్రవీరుఁ డనఁగఁ బొల్చెడి
వాఁడన్, జనవర? నాయానతి నృప, జనచేలాపహృతి సలుపఁ
జనుము కడంకన్. ౧౭౬

వ॥ నావుడు రా జిట్లనియె.

గీ॥ బ్రాహ్మణక్షత్రియులఁగూర్చి పలికియుంటిఁ, గాని తక్కొరులగుఱిం
చికాదుజగతిఁ, దనరు నుత్తమమధ్యమాధములకనుగు, ణంబయిన
ధర్మములు విహితంబు లగుచు. ౧౭౭

వ॥ కావున నీవు నన్నుఁ గొన నసహ్యుండ వన వాఁడును నరేంద్రా! నీవు సామాన్యమ్ముగ నాయెదుటఁ బల్కినకతనఁ గొన నుద్యమించితి సత్యమ్మునకుం దప్పవేని యట్లొనరింపు మిప్పు డీనియమమ్ములు చెప్పుట పాడి గా దని మఱియును. ౧

క॥ అవిచారితమతివై తా, నెవఁడును సత్యంబు దప్ప
చోమ్ముం, దు వచింపరా సదత్యము, దవిలెడివాఁ
బలుకంగన్.

డ వగుము నే నెద్ది చెప్పిన నయ్యది యొనరింతువే ? నావుడు హరిశ్చం ద్రుండు కొంత సంతసించి పునర్జాతునిగాఁ దన్నెంచికొనుచు నమ్మని కిట్లను.　　౫౮౭

క॥ ఓమునిజనమణి ! నన్నిఁక, నేమి యొర్చినను మంచిదే నీపాదం
బేమదిని నమ్మి నీపను, ప్రేమైనన్ జేయువాఁడ నెల్లపుడుఁ దగన్.

వ॥ కావున నీ కేమి యొనర్తు నిప్పుడ నా కాన తిమ్మనుడు నమ్ము ని చాండాలుం బిలిచి యిట్లను.　　౫౮౯

గీ॥ ఓరి చాండాల ! వీఁడు నాయొద్ద దాసుఁ, డయ్యె ద్రవ్యంబు నాకు
ముఖ్యంబు గాని, వీనితోఁ బని లేదు నాయానతిని ధ, నంబు నిడి
వీనిఁ గైకొ మ్మనంగ వాఁడు.　　౫౯౦

వ॥ గాధిజుం గని మహాత్మా ! ప్రయాగమండలంబున దశయోజ నవిస్తీర్ణం బగుభూమిని రత్నమయమ్ముగా నొనర్చి నీకు మూల్యమ్మునకుఁ గా నొసంగువాఁడ నాకు నివ్వానికతన నియ్యార్తి యడంగు నియ్యది నీ వొనర్చినయుపకారం బని చెప్పి.　　౫౯౧

క॥ రతనములు మాక్తికమ్ములు, నతులితి ముగుప్పె డియున్ సహస్రపు
సంఖ్యన్, మితి మీఱునట్టు లమ్మని,పతి కిచ్చెఁ బ్రీవీఁడెంత భాగ్య
ము గలఁడో.　　౫౯౨

చ॥ అటు మునిచేత నిక్రియము నంది త్రిశంకుసుతుం డు ''నాకు ని
జటిలుఁడు సేవ్యుఁ డీతనివశమ్మున నెయ్యదియేనిఁ జేసినన్
గుటిలత నన్నుఁ బొంద దనుకూలము యిమ్మునియాజ్ఞ సేఁత యిం
కెటులయినం గృతార్థుఁడ మునీంద్రు ఋణమ్మును దీర్ప నేర్చితిన్.

వ॥ అని నిర్వికారవదనుండై యానందించు నెడ నశరీరవాణి యిట్లను.

ఉ॥ ధన్యుఁడవైతి సత్యమును దప్పక బాముల నోర్చి రా
జన్యులు దేవతల్ నినుఁ బ్రశంస యొనర్ప న

న్యాన్యుఁడవై మునీంద్రునిబుణంబు తృణంబుగ నిచ్చి పుచ్చి యీ
సైన్యము లెక్కపెట్టక మునమ్మునఁ బొల్చెద వింత యొప్పనే. ౫౯౫

ఆ॥ వె॥ మేలు? మేలు? నీవు మేదినికెల్లను, భూషణమవు నిన్నుఁ బోల
రాదు, సత్యమున సులోకజనునకు నని నుతుల్, గొలిపి సురలు
పూలు గురిసి రపుడు. ౫౯౬

వ॥ పదంపడి హరిశ్చంద్రుండు ద్విగుణితానందుండై కౌశికునికిఁ
గేలు మొగిచి యిట్లను. ౫౯౭

క॥ తల్లియుఁ దండ్రియు దైవం, బెల్లగు నాకీవ నన్ను బుణముక్తునిఁ
గాఁ, జెల్లము చేసితి వౌరా, మునివల్లభ? నీయాజ్ఞ నే నవశ్య మొన
రుతుఁ. ౫౯౮

వ॥ నీ వెయ్యది చెప్పినను నాశ్రమమునకుఁ గాని యొండు
గాదు నిక్కమ్ముగ నేమి యొనర్తు నాన తిమ్మనుడు నమ్ముని యిది మొన
లీచాండాలునిపనుపున జాగరూకుండవై నర్తించుము నీకు శుభ మ్మగు
నని చెప్పి యరిగె నావుడు జనమేజయుండు మహాత్మా? యతండు
చాండాలసేవకుండై యవ్వాసగృహమ్మున నెట్లు వర్తించె ననుడు
వ్యాసుం డిట్లను. ౫౯౯

గీ॥ అట్లు కౌశికుఁ డరుగుడు నానృపాలుఁ, గని శ్వపచుఁ డిట్లు పలుక
దొంగవయిపోవు, నవో? యతే మొక్క? యందుబద్ధుండవగుము,టంచుఁ
గట్టించె రజ్జుల నంటఁ దీసి. ౬౦౦

వ॥ అట్లంటఁ గట్టి యునల్యొండవై పలాయనంబొనర్పకుండువాఁ
డవని దండమ్మునం దాడించుచుఁ దనపక్కణమ్మునకుఁ గొని పోయి.

గీ॥ ఇష్టబంధువియోగార్తు, నష్టతేజు, వ్యాకులేంద్రియు నానృపవర్యు
నిగళ, బద్ధునిఁగఁ జేసి నిద్రకుఁ బడియె శ్వపచుఁ, డకట! యాతని
గతి చూడఁ డాయె సురల. ౬౦౧

వ॥ అట్లు నిగళబద్ధుండును క్షుద్వ్యాకులుండునునై భార్యాపు
త్రులఁ గొని యిట్లు విలపించు. ౬౦౨

ఉ॥ దీనముఖుఁడు సుదుఃఖితునిఁ దేజము దక్కినవాని బాలుఁ దా
నానతవక్త్రుఁడై కని ‹‹సుతా! బెగడొందకుమయ్య యింతలో
మానిఋణంబు దీర్చి నృపమౌళి కృపన్ మన కీయవస్థ యె
ట్లైనియుఁ బాపు నంచు స్మరియించు నతీమణి నన్ను మాటికిన్.

గీ॥ అయ్యయొద్దకు నేగెద ననుచు నేడ్చు, సుతునినోదార్చ నక్కటా!
సుదతియుల్లి యేగుదువు గాని యనిచెప్పి యెలమి గల్గఁ, జేసిమఱ
పించు నేమియుఁ జేయ రామి.    ౬౦౫

గీ॥ అంతియే కాసి యకట! యయ్యతివ నేను, మాలనిగృహమ్మునం
దసామాన్యనిగళ, బంధమున నిట్టు లున్న సంబంధమెఱుఁగ. దెటఁగ
నేనియు మృతి చెందు నిదియ మేలు.    ౬౦౬

చ॥ రమణ నెసంగునట్టిఘనరాజ్యము పోవుట బంధుమిత్ర సం
ఘములకు దూరమైగుటం జగమ్మున కెల్ల మహాపతివ్రతా
త్వము గలభార్యయున్ సుతుఁడు దాస్యమునొందుట నాకు మాలగే
హానుగ [illegible] లాపలందఁ బడుఁగా.

వ॥ ఇట్లు ప్రతికూలం బగువిధికిఁ దలంకుచు భార్యాపుత్రుల
స్మరించి కొనుచు నొక్క నాలుగుదినమ్ములు గడపునంత నాపరివీరుం డత
నిబంధనిర్ముక్తుఁ జేసి పరుషదుర్భాషణంబులఁ గర్జించుచు మృతచేలాప
హరణమ్మునకై యిట్లు నియోగించె.    ౬౦౭

క॥ ఈనగరిదక్షిణమున శ్మశానము గల దచట నుండి శవవస్త్రసమా
దానము పనిగా న్యాయ్యము, బైనెగడెడివృత్తి యెలఁగు మనవర
తంబున్.    ౬౦౮

వ॥ జర్జరం బగునీదండంబు కైకొని యియ్యది నీకు బాహుం
డిచ్చె నని యెల్లరకుఁ దెలియ నుద్ఘోషించునది యని చెప్పి పనిచినఁ
దదాజ్ఞం గొని దండమండితకరుండై.

ఉ॥ ఆనరనాయకుండు భయమై శవమాల్యయుతంబు ఘా
ధానుగతంబు ధూమమయ మామిషలోలుపః

ర్ధ్యానము నర్థిదగ్ధశవదగ్ధసంగత వైమనస్యసం
ధానము నాశ్మశానము సదా ప్రలపచ్ఛవకంబు గన్గొనెన్. ౬౧౧

ఉ॥ పెనిమిటి కేడ్చుభార్యలును బ్రేయసి కేడ్చెడిభర్తలున్ దనూ
జున కడలొందు తల్లులును సోదరికై వగచెందునప్పలున్
మనుమల కేడ్చుతాతలును మామల కేడ్చెడిభాగినేయులై
పనుపడు నాశ్మశాన మతిభైరవశబ్దసమాకులంబునై. ౬౧౨

వ॥ ఇట్టి మహాఘోరాకారమ్మునఁ గల్పాంతకాలసన్నిభంబును జ్వలన్మాంసవసామేద«శ్ఛాయ్, చూయ్'ధ్వనిసంకులంబును నగునమ్మహాశ్మశానంబున కరిగి యాహరిశ్చంద్రుండు. ౬౧౩

చ॥ వెనుకటిరాజ్యమున్ సుతుఁడు భృత్యులుమంత్రులు భార్యయుండలం
పునఁ బొడకట్టఁ దన్మయతఁ బొంది ధృతిం గనలేక «వేప్రియసీ!
ననువిడనాడితే? కులము? నన్నెడ చేసితె? పుత్రకా? ననుం
గనుఁగొనరావుగా? యని యఖండగతిన్ పలవించు ఖిన్నుఁడై. ౬౧౪

క॥ కోపనుఁ డగునావిప్రుని,ప్రాపున మీ రెట్టిపాట్లు పడుచుంటిరో? మీ
యాపదలు నే నెఱుఁగ నా, యాపత్తును మీకు నెఱుఁగ నయ్యెడి నెకటా. ౬౧౫

హరిశ్చంద్రుండు శ్మశానమ్మునను౦డుట.

క॥ అని చింతించుచుధర్మం,బును దప్పిన నరుఁడు శుభము వొందఁడు యత్నం, బున నది రక్షించిన న, జ్జనునకు సుఖమును యశంబు సమకూరు నొగిన్. ౬౧౬

వ॥ కావున నెప్పాటనేని ధర్మరక్షణంబు కర్జం బని తనకు వీరబాహుం డాజ్ఞాపించినచందమ్మున వచ్చుశవమ్ములఁ గనుంగొనుచుఁ దత్తన్మూల్యగ్రహణంబున కటు నిటు నరుగుచుఁ దత్తత్కృత్యమ్ముల జాగరూకుండై రజోదగ్ధసర్వాంగుండై మెలఁగుచు. ౬౧౭

శవమూలమై మనకు నింతధనం బొడఁగూడె మీఁద నా
గణమ్ముగ శతాధికమూల్యము వచ్చు దీన భూ

మీఁదన కింత, యింతమన యేలిక మాలని, కింత నా, కటం
చాశ మెయిన్ జరించు నొకఁడై ధృతజీర్ణపటైకకంథుఁడై. ౬౧౮

క॥ నానాశకున్యాదనాదన, దూనానూనక్షుధార్తితోఁ దన్మాల్యా, ధాన
శిరస్కుఁడు దధ్బ, ప్మానుగతాంగుండు నగుచు నవనిపుఁ డచటన్.

చ॥ పవలును రాత్రియు న్నిదురఁ బాసి వసాదికలిప్తపాణియై
శవములరాశి చూచుచు నిమక్తవిలోచనుఁడై శ్వపాక జా
తి వలుకురీతిఁ బల్కుచు మదిన్ మఱి యొండు నెఱుంగ కొక్క యేఁ
డవశత నిట్లు పుచ్చె నది యా శతవర్షసమంబు పార్థివా. ౬౨౦

వ॥ అంత నొక్క నాఁడురోహితుండు నవయస్కులగు విప్రబా లురం గూడి పురమ్మున కనతిదూరమ్మున కేగి యచ్చటఁ గొండొక క్రీడించి రాఁబోవు వాఁడు ముందట. ౬౨౧

గీ॥ అల్పమూలమ్ములును మఱియగ్రిసహితములును గోమలములును
దర్భలను జూచి, యార్యునకు నివి యుక్తమ్ము లనుచుఁ గట్ట, కట్టి
సమిధాదికమ్ములు దొట్టి భక్తి. ౬౨౨

వ॥ ఇట్లు తనదాసిక యగు విప్రునకుఁ గూర్చువాఁడై పాలా శాదికాష్ఠమ్ములతో గట్టినమోపు నొకటి శిరమ్మున నిడికొని భారంబైన యెడ దింపికొని ఖేదంబు నొందుచు జలంబు సంప్రాప్తంబైనఁ ద్రావుచు వచ్చునెడ నొక్కవల్మీకమ్మునఁ గాష్ఠభారంబు దింపి మరల నెత్తికొను నంత విశ్వామిత్రప్రేరితంబై యొక్క సర్పం బతిఘోరవిషదూషితం బవ్వల్మీకంబు నిర్గమించి. ౬౨౩

క॥ ఆన్నృపసుతునిం గఱచిన, మేనెఱుఁగక పడియెఁ దోడ మెలఁగెడి
బాలుర్, దీనులయి వేగ చని రా, జ్ఞూనుజననిఁ గాంచి కొంత
శోకము గదురన్. ౬౨౪

ఆ॥ వె॥ వినుము విప్రదాసి! తనయుంత నీసుతుఁ, డరుగు దెంచె నా
లాడ నెంచి, యచటఁ బాము గఱచె నంతట భీతిలి
మిటకు వార్తఁ దెలుప.

క॥ అనుపలుకు వజ్రపాతం, బున కెనయై రాజపత్ని పొరిఁబొరి మూర్ఛన్
బనుపడి నఱికిన కదళీ, ఘనతరువుంబోలెఁ బడియెఁ గష్టము పాలై.

వ॥ అంత నవ్విప్రుం డరుదెంచి శీతలోదకంబు చల్లిన లబ్ధసంజ్ఞ
యై విలపించు నా శైబ్యం గని యతం డిట్లను. ౬౨౭

ఆ॥ వె॥ ఈ ప్రదోషవేళ నేడ్పుట లక్ష్మీక, రంబు గా దనుచుఁ గరంబు
నెఱిఁగి, నాగృహమ్మునందు నాతిరో! యేడ్చెదు, సిగ్గు లేదె యిదియుఁ
జెప్పవలెనె. ౬౨౮

వ॥ అని నిష్ఠురుండై తన్నుం దిట్టు నవ్విప్రుని కుత్తరం
బీనేరక తన్మయచిత్తయై. ౬౨౯

క॥ కన్నీరు కాల్వగట్టఁగఁ, దన్నెఱుఁగక కరుణ మొలయఁ దద్దయు
శోకా, భ్యున్నత నెలుఁ గెత్తుచు నే, డ్చె న్నందనుఁ దలఁచి "యెంత
చేసితి" వనుచున్. ౬౩౦

శైబ్య పుత్రస్మృతికి శోకించుట.

వ॥ ఇట్లు వికీర్ణకేశయై యెడ తెఱుఁగక మిన్నుమన్ను నెక్క
టిగా నోరలుచున్న రాజపత్నికి దుర్మార్గుండు పాఱుం డిట్లను. ౬౩౧

క॥ ధనము తగినంత యిచ్చితి, నినుఁ దెచ్చితి నింటిపనికి నీవిఁక లేవ
న్నను మోసపుత్తె దాసికె, జను నే యీరీతి నిన్నుఁ జంపెద మొండీ.

వ॥ అని తన్నుఁ గొట్ట నంకించునవసరంబున నా రాజపత్ని
మహాత్మా! నన్నుం గొట్టకుము నా సుతుండు సర్పదష్టుండై మృతుం
డయ్యె. ౬౩౩

క॥ కరుణించి యాజ్ఞ యిచ్చిన, నరిగెద నా పట్టి నాకులాభరణము తా
నురగవిషమ్మున నెచ్చట, మరణము గనె నటకు; నన్ను మన్నింపు
మొగిన్. ౬౩౪

॥ ఇఁక నీజన్మమున నకుఁ బు, త్రకు మోమ్ముం జూచు భాగ్యదశ గల్గదు నే
ఋణము తీరె నెక్కిం, త కరుణ నన్నటకుఁ బంపఁ దగదె
౬౩౫

వ॥ అని కన్నీరు వఱ్ఱుగా రోదనం బొనర్చు నమ్మానినిఁ గ్రుద్ధుండై వృద్ధుం డిట్లను. ౬౩౬

గీ॥ ఓసి దుర్మార్గురాల! నాదాసివయ్యు, నింటిపనులను డించి నీ వేగితేని
యెవఁడు నీతాత యిచ్చుని నెల్లఁ జేయు, స్వామికార్యవిఘాతంబు
సలుప నగునె. ౬౩౭

వ॥ ఎవ్వండేని వేతనంబుగొని స్వామికార్యం బొనర్పఁ డవ్వాఁడు మహారౌరవనరకమ్మునం బడి యొక్కకల్పం బుండి పదంపడి కుక్కుటంబై జనియించు. ౬౩౮

గీ॥ ఐన నాకేల నీయెడ నఖిలధర్మ, ములను వమ్ముగ వచియింప మూర్ఖు
లందు, నీచులందును వ్యర్థమై నెగడు నీతి, చౌటనేలను బడ్డబీజంబు
పగిది. ౬౩౯

వ॥ నీ కించుకేనిఁ బరలోకభయంబు గలదేని వచ్చి యింటికార్యమ్ములు చక్కఁబెట్టుమని నిష్ఠురమ్ముగఁ బల్కు నద్ధరాసురున కమ్మగువ వేపమాన యగుచు నిట్లను. ౬౪౦

క॥ ఒకయింతలోన మృతపు, త్రకుదేహము చూచి వత్తుఁ దడయక
నాపై, సకరుణదృష్టిం జూనుపుము, పకృతిం బొనరింపు మింత పా
టిగ నేనిన్. ౬౪౧

వ॥ అని చరణమ్ములం బడి యతికరుణమ్ముగ నేడ్చు నమ్మగువం గని కోపోద్రిక్తమ్మున నతం డిట్లను. ౬౪౨

గీ॥ కొడుకు చచ్చినమాత్ర కేటిగొడవ? యింటి, పనులు తక్కక చేయుము
గొనము గలిగి, కానిచో మత్కశాఘాత మూని వీఁపు, బ్రద్దలగు
మున్నెఱుంగవే పడఁతి! నన్నె. ౬౪౩

వ॥ అని పుయిలోడక పల్కునప్పాపాత్మునకు మాఱాడక ధైర్యం బవలంబించి తద్గృహకృత్యమ్ము లొనర్చి పాదసంవాహన మ్మొనరించునంతకు నర్ధరాత్రంబు గతించెఁ బిమ్మట నాపె కాంతం డిట్లను. ౬౪౪

క॥ ఇఁకఁ జనుము నీదుపుత్త్రిక. నకు దాహాదికము వేయొనర్చి గృహ
మునొ, ద్దకుఁ బొ్ద్దు వ్రేకుచునాయిం, తకుఁ బను లొనరింప రమ్ము
తడసెకు సుమ్మీ. ౬.౪౫

వ॥ ఇట్లు తదనుజ్ఞాతయై యేకాకినియై విలపించుచు యూథభ్ర
ష్ట యగుకురంగివసువున నస్సంహితయగు గోవు విధమున నరిగి పురమ్ము
నకు నవుల ననతిదూరమ్మున నెక్కెడ మృతుండై పడియున్న పుత్త్రుం
గని హాహానినదమ్ము దనర దరికేగుచు. ౬౪౬

గీ॥ పత్రిఁటదినమ్మును నెకు రేగువాఁడ విప్పు, డేల రా? వింత కోపింప నేల
నీకు, "అంబ"! యని పిల్వ రాదె నాయన్న? యనుచుఁ, దొట్రుపా
టొప్ప నేగి సుతుపయిఁ బడియె. ౬౪౭

వ॥ అట్లు పడి మూర్ఛిల్లి కొంతవడికిఁ దెలిసి బాష్పమ్ము లొలు
కుచు నబ్బాలకుని బాహువుల బట్టి కౌఁగిలించుకొనుచు నతని ముఖమున
మోము మడుచుఁ గరమ్ములచే నురమ్మును శిరమ్మును మోఁదుకొనుచు.

క॥ హాపుత్త్రా! హాపుత్త్రా!, హాపుత్త్రా! యనుచు మిగుల నార్తస్వనయై
యావడఁగి యడలి యెంతయు, వాపోఁవఁ దొడంగెఁ దీర్చువారలు
లేమిన్. ౬౪౮

వ॥ పదంపడి పతిం దలంచికొని.

క॥ ఓనర పాలక! నీసుతుఁ, డీనాఁటికి నిట్టులాయె నిప్పుడ చను దే
వే? నేఁడు దక్షిణ నిన్ను, నూనుచు నిపక్కరించు నురలఁ జూడం గలవే.

వ॥ అని వెంశియుఁ బరిపూర్ణ రాకాసుధాకరుం గ్రిందుపఱచు
నబ్బాలుని మొగమ్ము జీవితభ్రాంతిం జూచి యట్లుగామికి మరలఁ బెచ్చు
పెరుఁగు దుఃఖాతిరేకమ్మున మూర్ఛితయై కొంతవడికిఁ దెలిసి యబ్బా
లుని మొగమ్ము కరమ్మునం దిడికొని యిట్లను. ౬౫౦

చ॥ శయనమునుండి లె మ్మిది నిశాసమయం బిటఁ బ్రేతభూతసం
చయము చరించుచుండెఁ దెలుచన్ గడునార్చుచునుండె నక్కలు

య్యరయొ! నిను వీడి మిత్రులు రయమ్మున నిండ్లకు నేగిరయ్య! ని
ర్భయమున నీకు నిట్లునికిఁ బాడి యఁటయ్య! నృపాలపుత్రకా.

క॥ వే యనురాగమ్మున లే, వే! యను మనవిప్రునింటి కేగ న్వలె రా
వే! యనుఁ దల్లిని విడిచెద, వే! యనుఁ బ్రతివచన మొసఁగవే! య
ను నార్త్రై. ౬౫౩

ఉ॥ తల్లిని గాన వేను? ననుఁ దక్షోరులం బలెఁ జూడ నేల? నా
యుల్లము చల్లఁజేయుటకు నుద్భవ మంది యనాదరింతె? సం
పల్లవమేని లేక పురిఁ బాసియు నొక్కనియింట దాసినై
చెల్లియ! నిన్నుఁ జూచికొని జీవము దాల్చితిఁ గాదె పుత్రికా.

ఉ॥ ఆయువు దీర్ఘమై పృథివి కంతకు నేలికవై నిరంతర
శ్రీయును విద్యయుఁ యశము చేవయు నీఁగియు విప్రపూజయుఁ
బాయక తల్లిదండ్రులకు భక్తుఁడవై యితఁడొప్పఁ బుత్రిపౌ
త్రాయుతి నంచుఁ బుట్టినపు డగ్రజు లాడుట కల్లయే సుతా. ౬౫౫

గీ॥ చక్రమత్స్యాది రేఖలు స్వస్తికధ్వ, జాది రేఖలు నీదు కరాంబుజమున
నాయురారోగ్యదంబులై యలరు నవియు, వమ్ముచేసితె నాదు పాప
మ్ముకతన. ౬౫౬

శా॥ నీరాజ్యమ్మును నీధనంబు మఱియు న్నీమంత్రులున్ నీదు ది
వ్యారామమ్ములు నీదుహర్మ్యములు నీదానాతపత్రంబు సు
శ్రీ రంజిల్లెడినీహయమ్ములు కరుల్ సింహాసనం బేడ న
య్యా? రాజేంద్ర! సమస్తము న్విడిచి నీవాలోకముం జేరితే.

వ॥ అని మఱియును బతి నుద్దేశించి వారనిదుఃఖమ్మున.

సీ॥ కుంకుమాదికమునఁ గోమరానునీవఱు మతిబాల్యమున నెవ్వఁ డాత్మ
దేహ, సంగతమాలిన్యసంగతిచేఁ బంకిలంబుగాఁ జేయు ఫాలమ్ము
నందు, మృగనాభిపంకంబు మెదపితీర్చినతిలకంబును జూచి యంక
స్థుఁడగుచు, నెవ్వఁ డద్దానిని నవ్వుచుఁ దుడుచు నింకెవ్వనిమొగము
నా కెల్ల వేళ॥ గీ॥ మృత్స్నమాకులమయ్యును మేల్మిముద్దు, వచ్చు

నీ మాతనూజుఁ డివ్విధమున మృతిఁ జెందె నాయీ మొగం బరవిం
దతుల్య, మయ్యె నీఁగలకును నెల వయ్యె నధిప. ౬౫౮

గీ॥ దైవమా! పూర్వభవమున దారుణములగు, కృత్య మెయ్యది చేసితిఁ?
గీడు లిట్టు, లేకతమ్మున నాకబ్బె? నేరికేని, గీడులును మేలు లనునవి
కేవలములె. ౬౫౯

క॥ హా పుత్రక! హా కుమారక!, హా పుణ్యనిధాన! హా మహారాజతనూ
జా! పాపాత్మక యిది యని, యీపాటన్ విడిచి పోతివే యలుక
మొయిన్. ౬౬౦

తలవరులు శైబ్యం గట్టి తీసికొనిపోవుట.

వ॥ అని సారెసారెకుఁ జింతిల్లుచు నెలుఁగెత్తి మహాఘోరమ్ముగ
రోదనం బొనర్చుచున్న యాపతివ్రతకడకు నారెకు లేతెంచి నీవెవ్వతెవు?
పతి యెయ్యెడ కరిగె? నిట్టి నిశీథసమయమ్మున నొంటిపాటున నిప్పాట
శోకింప నేమికతము? మ్మని యడిగిన దుఃఖార్ణవమగ్న యగు నారాజపత్ని
నిరుత్తరయై యెప్పటియట్ల శోకించుచుండ నంతవారలు సంశయగ్రస్తులై

క॥ స్త్రీ గాదు బాలఘాతిని, నాఁగాఁదగు నెంతి పిల్చినన్ బలుకమికిన్
మూఁగయె యిబ్బాలకు నిం, దేఁ గొని భక్షింప నిటకు నేతెంచె
నొకో. ౬౬౧

వ॥ అని తత్క్షణమ్మున దాదవ్వుల కరిగి ధృతశస్త్రపాణులై
యియ్యది యెద్దియో నొకఖేచరి గావలయు నట్లగుటం జేసి మనకు
వధ్యయని యందఱు నొక్కపెట్టున వచ్చి యంటం గట్టి కేశభారంబు
పట్టికొని చాండాలవాటికకుఁ దీసికొని పోయి యియ్యది బాలఘాతిని
యగు ఖేచరి గావున వధింపు మన వాఁ డేతెంచి కాంచి వారల కిట్లనున్.

చ॥ అనయము నిప్పురం గలుగు నర్భకులం దినుచున్న దొక్క ఘా
తిని యని యిందు నెప్పుడును దీనిఁ గనుంగొన నేరనైతి నే
డ్పున నిటు కట్టి తెచ్చితిరి భూరియశమ్మగు మీకుఁ బట్టణం
బునకు సుఖమ్ము గల్గు నిది పుట్టిన బాలుర నెల్లఁ జంపెడిన్. ౬౬౨

చ॥ పలుచనఁ గొంపలం దగులఁ బెట్టుచు
వ్యాలుషుని విప్రులన్ శిశులఁ గాంతలఁ దారిఁ గొట్టుదు
గ్వ్యాల నదిరించువానిఁ గలుఁ గ్రోలెడిదుర్వ్యదువాని మేటియో
గలసినవానిఁ జంపుట నిశాముమహాసుకృతప్రదంబగన్

వ॥ ఇట్టికార్యమ్ము లొనర్పువాఁడు బ్రాహ్మణుం డనియుఁ గి
యనియుం జూడక వధ్యు లని చెప్పి యతికోపమ్మునం బట్టి కొట్టి కొ
నున్నతనయనుచరు హరిశ్చంద్రుం బిలిచి యిట్లను. ౬౬౬

క॥ ఇయ్యది బాలునిఁ జంపెడి, దయ్యము స్త్రీ యంచు లోనఁ దలఁపకు
మింకన్, జయ్యనఁ గడతేర్పుము మే, లయ్యెడు లోకమున కనుదు
నాసరవరుఁడున్. ౬౬౭

గీ॥ వచ్చిపాతోపమమ్ము నప్పలుకు విని మహాత్మ! యింకద్దియేనియు
నాజ్ఞయిమ్ము, శక్య మేనియు నయ్యది నలుప నేర్తు, నకట! స్త్రీ
హత్యఁ జేయఁ జేయాడు పెట్టు. ౬౬౮

క॥ అనవుడుఁ జాండాలుం డను, ననుచర! యసి కేలఁ గొని భయంపడ
కిద్దాని, సనిఁ దునిమింపుము పుణ్యం బగుఁ, జను నే? శిశుఘాత సేయు
దాన ఘటింపన్. ౬౬౯

వ॥ నావుడు నృపాలుండిట్లను.

క॥ వనితల యత్నమ్మునఁ గా, వ నగున్ బురుషుండు జ్ఞానవశమున నజ్ఞా
నమయతిఁ జంపినదుర్మా, ర్గునకున్ నరకమ్ము గల్గు రూఢిగ ననుడున్.

క॥ ఒకపాపమువలనన్ జగ, మకలంకత్వమునఁ బొదలునవ్వాడు లోకా
పకృతిస్వభావ దుష్టా, త్మక దీని నృణుక వలవదే? సుకృతార్థుల్.

వ॥ ఇయ్యది యనేకుల బాలుర వధియించె నిద్దానిం జంపుట
యావశ్యకం బాయుధంబు గైకొను మనుచు నాతం డిట్లను. ౬౭౨

క॥ చాండాలరాజ! నాకుం, గొండికతనమాది యింతకుం బాలఁతుకలన్
ఖండింప ననుచు వ్రత మి, ట్లుండఁగ నన్నింపుఁ జొనుపు టుచితం
బగునే. ౬౭౩

ద్రము చెప్పాటకన్న దోసముం

చ॥ అనవుడు స్వామికార్యమున కిటుల్ ప్రతి చెప్పెదె? యిట్టిద్రోహముం
డునె? మఱియొంకసముద్ధృతి యెన్నఁటికేనిఁ గల్గ నే
బొనరుచునీశసంబు గొని ద్రోహము సేసెదె దుష్టబుద్ధివై.
ర్చునెక్షిహాలకుం డను మహాత్మ! జగమ్మున నీకు శత్రుఁ డుం

చ॥ వ ననుఁ బంధు మిత్రుఁడు కడిందిబలమ్మునఁ దోడు వచ్చినన్
దునిమెద వాని నొక్క పెనుతూపున; మేదినికెల్ల నిన్ను నా
థునిఁగ నొనర్తు నియ్యబలఁ దున్చుట నాపని గాదు నావుడున్.

ఉ॥ "కూలికి వచ్చి పాలి కిటు కూయుఁగ" వచ్చునె? న్యాయ మేది; చాం
డాలునియింట దాసుఁడు హుటాహుటి కూరులపల్కు లాడఁగాఁ
బోలునె? చాలుఁ జాలు! నసి పూని కరమ్మున; నడ్డు చెప్ప కీ
బాలకహంతృశీర్షము చివాలునఁ దున్పుము నిర్దయాత్మకున్.

వ॥ అని ఖడ్గం బొసంగుటయు స్వామికార్యార్థి గావునఁ గైకొని
దగ్గఱ జని యన్యోన్యజ్ఞానంబు లేమి నాపె కిట్లను. ౬౨౨

క॥ ఓవనిత! నాదుహస్తము, చేవం గడలుకొనునేని శిరశ్ఛేదం
బేపడిఁ జేసెద నని సద్భావుం డవ్వనితఁ జంపఁ దత్పరుఁ డగుడున్.

చ॥ తనమరణంబు నెమ్మదిని దద్దయుఁ గోరుచుఁ బుత్రశోక మూ
ర్తి నిగుడన్ జేయు నిట్టులను దీనత దోఁపఁగ నోశ్వపాక! నా
తనయుఁడు ద్రెళ్లె నక్కొలనఁ దత్తనువున్నది దానిఁ దెచ్చి నీ
వనువున సయ్యెడన్ జితిను బన్ని దహించెద దాక మంతకున్.

వ॥ నావుడు హరిశ్చంద్రుండు ధర్మాత్ముండు గావున నట్ల యొన
ర్పుము పోయి రమ్మని యాజ్ఞ యిచ్చిన హాపుత్ర! హాబాలక! హాత
నూజ! యని మాటిమాటికిఁ గుందుచు నరిగి యబ్బాలకుం దెచ్చి
శ్మశానమ్మున నునిచి యాక్రోశించు దానిఁ బాంసుధ్వస్తశిరోరుహ నతి
మలినఁ గృశాంగి జన్మాంతరసంగతి నాఁదగు దాని నప్పరమపతివ్రత
నాత్మపత్నిగాఁ జిరవిరహాసంగతుండగుకతన నెఱుంగక యానృపేం
ద్రుండు కెలని కరిగి శవమ్మున నున్నవస్త్రమ్ములాగికొనుటయు నయ్యె

దియు నగ్రమ్మున నున్నయతిని నతికృశాంగు నస్యరూపు నాత్మధవు నిఁగా నెఱుంగ దయ్యె. ౬౮౦

క॥ అంకమున బాలు నిడికొని, కొంకుచుఁ బలుమాఱు దలఁచికొని
యేడుచున, వ్వంకజముఖదరి కరిగిన, జంకె హరిశ్చంద్రమనము
సంశయహతిమై. ౬౮౧

హరిశ్చంద్రుండు తనపత్ని నెఱుంగుట.

సీ॥ చంద్రునిఁ గాదనఁ జాలు వక్త్రముసొంపు గండముల్ దర్పణఖం
డములగుఁ, గుంచితాగ్రమ్ములు కోమలములు నీలములు దీర్ఘములు
పెన్నెఱులు దలంపఁ, గనులు రాజీవముల్ ఘనబాహులున్నతాం
సములు వక్షము విశాల మధరంబు, బింబమ్ము పాదముల్ పృథుల
ము లంగుళుల్ సూక్ష్మముల్ నాభి యనూక్ష్మ బిలము గీ॥ మఱి
యు లక్షణములవీఁడు మాన్యవేంద్రు, నింటఁ బుట్టినకొడు కగు
నింతనిజము, కాలవశమున నిట్టిదుర్గతికిఁ బాలు, వడియె నదిదాఁట
లేఁదుగా బమ్మయైన. ౬౮౨

వ॥ అని కొండొక విచారించి పునఃపునరాలోకనం బొనర్చు
చుఁ గ్రమక్రమమ్మున, ౬౮౩

చ॥ వెనుకటి రీతులెల్ల స్మృతివీథిఁ దగులొ్కని చేరవచ్చి నం
దనుఁ డని నిశ్చయించి పరితాపము పట్టఁగ లేక పుత్రికా!
యని విలపించుఁ గన్నుఁగవ నశ్రులు కాల్వలు గట్ట నాతనూ
జునకె తటస్థ మాయె నిటు శోకము నెట్లు భరింతునక్కటా. ౬౮౪

వ॥ అని పలుతెఱఁగుల శోకించుచున్నజ్జనపాలుని భర్తగా శంకించి
శైబ్య యిట్లను మహాత్మా! నీకియ్యెడ నిట్టిదుష్కార్యమ్మున నుండు టెట్లు
కలిగె మ మ్మెట్లు మఱచితి వనుచు దుఃఖావేశమ్మున విధి నుద్దేశించి.

క॥ ఓవిధి! యేవిధఁ జేసితి!, భూవిభునిఁ ద్రిశంకుపుత్రుఁ బూతచరి
తుని, శ్రీ వెలువరించి సుతభా, ర్యావిక్రయమునకుఁ బొనిపి యం
త్యజకులుఁగాఁ. ౬౮౫

వ॥ అని నాఁకె నాత్మపత్నిగా నిశ్చయించి యీదుఃఖ మంత
యు విధిప్రేరితంబై నాకైవచ్చిన యది యని వగచుచు. ౬౮౭

క॥ ఈతఁడె నాతిలోదరి, నాతనయుం డీశవంబు నాపాపము యీ, యీ
తనకు హేతువని సం, జాతార్తిన్ మూర్ఛఁ బొందె జనవరుఁ డంతన్.

వ॥ రాజపత్నియుఁ గనపతిదురవస్థచే ద్విగుణితశోకయై మూ
ర్ఛిల్లె నంతఁ గొంతవడికిఁ దెలిసి నరపాలుండు పుత్రుంజూచి యిట్లు
విలపించు. ౬౮౯

క॥ అన్నా దీనంబై కడుఁ, జెన్నదఱిఁగి యున్ననీదుచిన్నిమొగము గ
న్గొన్నంత మన్ననము పగులన్నెరక యుండె నిది శిలయొ వజ్రంబో

ఉ॥ హాసుత! హాకుమార! తనయా! పసబాలక! "తాత! తాత!" యం
చానమొయి న్నను బిలుచు నస్మదదృష్టమ! యేమిదోసముం
జేసితినోయి! నన్నుఁగని చెచ్చెర ముద్దులొ వచ్చి మేనిపై
భాసిలుపంక మంటుగతిఁ బ్రేమిఁ గోనంగదవోయి నవ్వుచున్. ౬౯౧

మ॥ అకటా! రాజ్యము బంధుసంతతియు ద్రవ్యౌఘమున్ జాండాలవా
టికి నేఁ దెంచితి వల్లకాటి నిటు లొంటిన్ వాసముం జేసి నే
వకవృత్తిన్ మనుచుంటి నిన్యదియు దైవంబోర్వఁగా లేక పు
త్రిక! పాముం గఱపించెనే! నిను; ననాథ్యంబెద్ది యద్ధాతకున్

క॥ ఘోరవిషవహ్నిఁ బంచత, గూరిచనినుఁ గనులఁ జూడఁ గూడెనె
నాకం, చా రాజర్షి పచారా, ననుండె యకుల్ఁ జేర్చె తెగని వగ
నుతున్. ౬౯౩

క॥ మృతసుతుఁ గౌఁగిట నిడికొని, సుత! సుత! సుత! యనుచు నెగడు
శోకభరమున, న్నావి చెడి మూర్ఛితుఁడై పడె, సుతశోకమునన్న
నొండు శోకం బున్నె. ౬౯౪

వ॥ ఇట్లు తేఁకువ చెడి మూర్ఛితుండై పడియున్న నరపాలు
నీక్షించి శైబ్య సర్వలక్షణమ్ముల నీతండు విద్వజ్జనమనశ్చంద్రుం డగు
హరిశ్చంద్రుండకా నిశ్చయింప నగు నని వెండియు. ౬౯౫

ఉ॥ ఉన్నతమై తిలప్రసవమో! యన నొప్పెడి నాసతీరు సం
పన్నళినాక్షికిం దగినవక్త్రము చారురదాళిసారు పే
రెన్నిక మెచ్చ వాక్పటిమ మిన్నిటికిం బయివచ్చు నీతఁ డా
నన్నరనాథుఁ డెవ్వనియుదారయశంబు త్రిలోకపూజ్యమా.

గీ॥ ఆహరిశ్చంద్రుఁ డీతండ యైన నీశ్వ, శానమునయుండు టేలొకో! సత్య
సంధుఁ, డనుచు సుతశోక ముడిగి యయ్యతివ సంత, సమును విస్మ
యదైన్యముల్ సనఁగఁ జూచె. ౬౯౭

గీ॥ భర్తృపుత్రశోకమ్ములభార మెక్కు, డై నహింపఁగ రాని నయ్య
తివ మిన్న, మూర్ఛపడి కొంతవడి లేచి మొనయువంత, మరల నర
నాథుపై దృష్టి మాసరముగ. ౬౯౮

చ॥ నిలిపి నృపాల! యెంతకును నిందు్యఁడ కాఁడె విధాత వానికిం
గలదె జుగుప్సయుం దయయుఁ గార్య మకార్యము నాఁగ; నక్కటా!
యిల సకలంబు ధర్మగతి నేలెడి దేవసమాను నిన్ను వం
తల కెలి చేసి మాలనికి దాసునిఁ జేయునె కీర్తిరోయునే. ౬౯౯

గీ॥ రాజ్య మెడచేసి పుత్రదారక్రయంబు, నకుఁ జొనిపి యంతఁ బోక
యంత్యకులుఁగా నె, నర్చియును నీడఁబోవఁడు నాథ! యేమి, త
ప్పొనర్చితివవ్విధాత యెడ నీవు. ౭౦౦

మ॥ అకటా! యియ్యెడఁ గానరావుకద? నీదానాతపత్రంబు ల
చ్చికేఁదావై రతినంపుఁగూర్చు గలనీసింహాసనంబుం యశః
ప్రకటంబై తగుచామరద్వయము పార్శ్వస్థాయిసంత్యాప్తిని సే
వకబృదంబును మంగళధ్వనులు దివ్యద్వాజిసంఘంబులున్. ౭౦౧

శా॥ ఏ నీ వేగడివేళ రాజమణులుం భృత్యత్వముం బూని ముం
దై నేర్పొప్పఁగ నాత్మవస్త్రముల రథ్యాపాంసుసంశుద్ధి సం
ధానంబుం బొనరింతు రిట్టి ధరణీనాథుండవై నీవు నీ
కానే! దుర్భగమా శ్మశానమున నిట్లావాసముం జేయఁగన్.

వ॥ మఱియుఁ గపాలసంకులంబును ధటీపటపరిచ్ఛన్నమ్మును మృత నిర్మాల్యసూత్రాంతర్లగ్నకేశసుదామణమ్మును వసాసిక్తస్పందసంకుచ్ఛ మహాపటలఖండితంబును భస్మాంగారార్ధదగ్ధాస్థిమజ్జాసంఘట్టభీషణంబును గృధ్రగోమాయునాదారవమ్మును బుష్టక్షుద్రవిహంగమమ్మును జితాధూమాయతపటనీలీకృతదిగంతరంబును గుణపాస్వాదనసంప్రహృష్టనిశాచరంబును నై దారుణం బగునీశ్మశానంబున దుఃఖితుండవై యెట్లుంటి వని శోకపరవశయై యతని నాలింగనంబు చేసికొని. ౨౦౩

చ॥ నరవరమౌళిమానితకనత్పదపీఠ ! మహీమహేంద్ర ! యి
క్కరణి ఘటించు టెల్లఁ గల గాదుగదా ? నిజమేని ధర్మత
త్పరునకు నీకు నిట్టియని ధర్మము తోడ్పడక నేరికా ! ఋతా
దరు లెవ? రెవ్వ రార్జవవిధమ్మున నుండెదిహా? లెయ్యెడన్ ౨౦౪

క॥ అని యెడఁగలుగని దుఃఖమ్మున నేడ్చెడి దానికి విశ్వభుండు తనకు మా
లని దాస్యము గల్గినమేటిమిత్రము సెప్పె బల్కకుండె వగ దగన్.

చంద్రమతి పుత్రుండు మృతియైనచందము పతికి దెల్పుట.

చ॥ ఇటు దన పాటు సెప్పి కడుహెచ్చినశోకము పేర్మి నార్తిలం
పటుఁ డగు ప్రాణనాథునకుఁ బట్టి మృతిం గను చందమెల్ల దు
ర్ఘట మగు వంతపెంపునఁ బరంపరగా వచియించె నాపె యం
తట నృపుఁ డాత్మజాతువదనమ్మున నక్ర్రిము చొచ్చి ఖిన్నుఁడై.

వ॥ ఖిన్నుండై యేమియు నెఱుంగక శోకించుచుండె నట్టి భర్తం గని శైబ్యయిట్లను, ౨౦౫

క॥ స్వామి నిగ్రహము సేయకు, మోమానవనాథ ? సత్య ముడిగెదె ?
నా పైఁ, బ్రేముడి నెడ చేసి శిరం, బీమెయి నలుకుసు విధాత కెద
ముద మొదవన్. ౨౦౬

చ॥ అన విని రాజు మూర్ఛఁ గొని యంతన లేచి మృగాక్షి? యింత మా
టనఁ దగునే? యశక్యకృతి కాదనె చేతులు? నాక కాక యె

వ్వానికిని" నాఁగ శమ్మగువ వల్కుఁ "బునర్భవమందు నిన్ను నా
థునిఁగ నొనర్ప దేవికి నతుల్ పచరించితి నెమ్మనమ్మునన్. ౨౦౯

క॥ ఇఁకఁ దడయనేల సత్యం, బకలంకము గాఁగఁ బ్రేమ మఱఁ జేసి శిరం
బొక వ్రేటునఁ దున్మము మి, న్నక వెనుదీయంగనేల నరనాథుఁడవై.

వ॥ నాపుడు నరపాలుం డఖండం బగుదుఃఖావేశమ్మున మూర్ఛి
తుండై యంతన తెలిసి పుత్త్రిమొగంబు చుంబించుచు భార్య కిట్లను.

ఉ॥ ఓనళినాక్షి ! యింక భువినుండఁగ నోప శరీరధారినై
కానఁ గృశానుసంగతినిఁ గ్రాఁగి పరమ్మున కేగుదెంతు నన్
బ్రాణసమంబుగాఁ గనుశ్వపాకునియానతి చెంద కిప్పుని
న్నే నయి చేయుచో నిచట నిందయు నచ్చట హానియుం దగున్.

క॥ చచ్చియు నీపాపమ్మున, వచ్చెడిజన్మమ్మునన్ శ్వపాకునిదాస్యం, బచ్చ
పడఁ గాంచు టొప్పునె, విచ్చలవిడి లేనిబ్రతుకు వృథ యెవ్వరికిన్.

గీ॥ ఏది యెట్లున దుఃఖమ్ము నెనయుకంటె, మేసినంబంధ మెడలుట
మేలు కాదె, లేక లేకొక్కరుఁడు పుట్టె లేఁతవయసు, నంద మృతి
చెందఁ బాప మేమాచరించె. ౨౧౪

క॥ కులము నెగడించు నీతం, డలఘుం డని నమ్మి యుంటి నకటా ?
జగదేకలలితుఁ బుత్త్రకుఁ బాసియు, నిలపై మనఁ గంటి నొకని
భృత్యుఁడ నగుటన్. ౨౧౫

గీ॥ లేనిస్వాతంత్ర్యము చు బూని లేమ? యిపుడు, ప్రాణములు వాసి
యేగినఁ బరమునందు, వైతరణి నందు నసిపత్త్రవనమునందుఁ, గలు
గుదుఃఖంబు దీనికిఁ దులయుఁ గాదె. ౨౧౬

చ॥ లలనరో? యెట్టులైనను జ్వలజ్జ్వలనమ్మున మత్కుమారుతోఁ
గలసి శరీరమున్ విడుతుఁ గాదని నన్ మరలింప కాజ్ఞ నా
వలన రయమ్మునం గొనుము బ్రాహ్మణునింటికి నేగి దాసివై
యలయక యమ్మహామహుని యాజ్ఞ మెలంగుము జాగరూకతన్.

క॥ దానములు చేసి యజ్ఞ వ్రతానమ్ము లొనర్చి గొప్పులఁ దనిపితి మేనిక్
హానిని? మనమూగురకుఁ, దా నగు సంబంధ మమరధామము
నందుఁ. ౨౧౮

వ॥ అట్టి సంబంధ మిఁక నీలోకమ్మున దుర్లభం బదియునుం గాక యొక్కండేని రహస్యమ్మునఁ బరిహాసమ్మునకుఁగా ని న్నవమానించి యుండుదు నయ్యది క్షమింపు మిఁకఁ బునర్దర్శనాకాంక్షిణినై ధర్మమ్మునకుఁ గట్టుపడి యున్నాఁడ పుత్రి నింట నుండి రాజపత్ని ననుగర్వమ్మున వారి నవమానింపక యెద్ది పంచినను సంపుట నీకుఁ బరసాధనం బని బోధించుటకిఁ బతివ్రత యిట్లను. ౨౧౯

క॥ నరనాథ? నాకమైనన్, నరకం బయినన్ హితంబు నాతికిఁ బతితో
మరణంబు నేను నిప్పుడ, యురుదెంచెద నీపిఱుంద నవహితమతివై

వ॥ నావుడుఁ బరమపతివ్రతాశిరోమణి వగునీకు నియ్యది యెప్పదే? యిట్లొనర్తువుగాక యని సహగమనం బంగీకరించి చిత నేర్పఱచి యందు మృతకళేబరం బునుర్చి భార్యాసహితుండై యంజలి ఘటించి పరమేశ్వరియు శతాక్షియు జగదీశ్వరియుఁ బంచకోశాంతరగతయుఁ బున్ఛబ్రహ్మస్వరూపిణియు రక్తాంబరపరిధానయుఁ గరుణారససాగరయు నానాయుధధరయు జగత్పాలనతత్పరయు నగుజగదంబ నాత్మం దలంచుచు నగ్నిసంధానంబొనర్చు నయ్యెడ. ౨౨౧

బ్రహ్మాదిదేవతలు ప్రత్యక్షంబగుట.

ఉ॥ వాసవుఁ డాదిగాఁగలసుపర్వు లఖర్వరయంబు పెంపున
గ్రేపరుఁ గాఁగ ధర్ము నిజ ప్రీతిమెయిం బొడసూపి యిమేలు మేల్
నీసరి వారు లేరు ధరణీధర? సత్యసహాయ? నాకసం
వాసుల మేము కిన్నరులు వారలు వీరలు సిద్ధచారణుల్. ౨౨౨

వ॥ అనునంతఁ బితామహుం డిట్లను.

గీ॥ ధర్మరూపుఁడ నేను బితామహుండ, వీర లందఱు సురలును జారణులును, గిన్నరులు రుద్రు లశ్వినుల్ నిన్నుఁ జూడ, వచ్చినారు మహారాజ? వైభవమున. ౨౨౩

వ॥ ఇతండు విశ్వ(త్రయమైత్రీకారణుం డగువిశ్వామిత్రుండు నీకుం బ్రియంబొనరింప నరుదెంచి యున్నవాఁడు విలోకింపుము.

గీ॥ నీతితిక్షాదిగుణముల నెమ్మిఁ గొలుప, వచ్చితిని ధర్ముఁడను నేను స చ్చరితుఁ, లందు నెవ్వరికెక్కుడై యనఘమూర్తి, వైతి పదు నాల్గు లోకములందు భూప. ౭౨౫

వ॥ ఇంద్రుఁ డిట్లనియె.

క॥ వాసవుఁడ నేను నాపైఁ, గ్రైసేయుము కొంతదృష్టికాంతయు నీవుఁ నీసుతుఁడును సుగుణమ్ములఁ,జేసి జగత్త్రయజయమ్ము చేసితిరి నృపా.

క॥ కొమరుఁడు నీవును భార్యయు, విమానసంగతుల రగుచు విచ్చే యుఁడు గే, హముతోడ స్వర్గమున కని, యమృతమయం బైన వృష్టి నాతఁడు గురిసెఁ. ౭౨౭

గీ॥ దుందుభులు మ్రోయఁ బూవులు దొలఁకరింప, నచ్చరలు మెచ్చు గా నాడ నాచితాంత, రమున శయనించి యున్నభూరమణ, పుత్రు పై నమృతవర్ష మప్పుడు పాదుకొనియె. ౭౨౮

క॥ సుకుమారం బగుదేహం, బకలంకం బైనవదన మలరఁగ నా రా జకుమారుఁడు రోహితుఁడు మ్రొ, తికిఁ దక్కఁ తనంత లేచె దెసలు వెలుంగఁ. ౭౨౯

చ॥ నరపతి పుత్రునింగని మనం బలరఁ దగఁ గౌఁగిలించి సు స్థిరుఁడయి భార్యఁ జూచి సురసేవ్యము లైనయలంకృతుల్ వరాం బరములుఁ బుష్పమాలికలుఁ బట్టియు భార్యయుఁ దానుఁదాల్చి మే దురతరమోదవారినిధి దోఁగుచుఁ బూర్ణమనస్కుఁడై తగెఁ.

వ॥ అయ్యెడ నింద్రుం డతని కిట్లను.

చ॥ పరమపతివ్రతామణియు భాసురశీలయునైన భార్యతో నురుగుణుఁడైనపుత్రుకు మహోత్తము నంకమునందుఁ జేర్చి పూ ర్వరచితమైన పుణ్యము కరంబు తిరంబుగనిర్వహింప నె వ్వరికి నగమ్య మైనత్రిదివమ్మున కీ వరుదెమ్ము భూవరా. ౭౩౧

క॥ అన సత్యహరిశ్చంద్రుఁ,డను దేవాధిప! శ్వపాకు ననుమతి గొని పైఁ జనుదెంతు నాకు నాతం, డు నియోగము సేయఁ దగు ఘనుండు విభుండుగా. 231

వ॥ నావుడు ధర్ముం డిట్లనియె.

గీ॥ ఓయి నరనాథ! నాదగుమాయకలిమి, నేనచాండాలరూపమ్ము నూని నాఁడ, భావిసంగతి నెఱిఁగి నీ బనిగొనంగఁ, బక్కణమ్మున నుంటి నప్పాట నవుడు. 233

వ॥ పిమ్మట నింద్రుం డిట్లను.

క॥ రాజాధిరాజ! దినకర, తేజ! హరిశ్చంద్ర! పుణ్య తేజస్వులు వి భ్రాజితతపముల చేనిక్కి, భా జను లానాకపదము వడయఁగ రమ్మా.

చ॥ అన నరనాథుఁ డిట్లను సురాధిప! మత్పురవాసులెల్ల న న్నును విడనాడి కుందరే! తనుం గని కొల్చెడివారి వీడువాఁ డును ద్విజుఁ జంపినట్టి యతఁడుగా మధుపాయియు స్త్రీనిహంత గో హననపరాయణుండు సము లౌట వచించెడిఁ గాదె ధర్మముల్.

క॥ వారలతో స్వర్గము కా, దారయు నరకంబయేని యది గమ్యము నా కో రాజ! తన్నుఁ గొల్చెడి,వారల నేమని త్యజింప వలనగు ననుడుగా

క॥ జనవర! పురవాసుల కె, ల్లను స్వర్గ మొసంగు టెట్లలవడెడి! వారల్ పొనరిచిన పాపపుణ్యము, లన వేఱుగ నుండుఁ దుల్య మగునే! యెందుగా, 232

వ॥ నావుడు రా జిట్లను.

గీ॥ వినుము సురనాథ! సేవకజనులకతన, రాజు రాజ్యం బొనర్చు ధర్మములు సేయు, జన్నముల కియ్యకొను నిందు సంభవించు, సుకృతము సమంబు నృపతికిఁ బ్రకృతితతికి. 23౮

వ॥ కావున మదనుష్ఠితంబు లగుపుణ్యంబులు వారలకును నను వగు నిది యిట్లుండ నింకొక్కటి వచింతు నాదగుసుకృతమ్మున బహుకాలోపభోగ్యం బగునాకపదంబ వారలం గలసి యొకదిన మనుభవిం

చినం జాలు నట్లగుట మత్సుకృతంబు విభజించి యిట్లొనరించుటకు నిన్నుఁ బ్రార్థించెద నావుడు నిందుఁడు డట్ల యగు నని సమ్మతించి ప్రసన్నహృదయుండై ధర్మవిశ్వామిత్రాదిపురస్సరమ్ముగ నయోధ్య కరిగి హరిశ్చంద్రుఁడు సమస్తమ్మున వారల కిట్లను. ౨౩౯

క॥ శర్మదమై యజ్ఞాదిసు, కర్మము లొనరించువారు గాంచెడి స్వర్గమ్మర్మిలి మీకెల్లరకును, ధర్మానుగ్రహముకలిమిఁ దనరారెఁ దగన్.

వ॥ కావున నెల్లవారును నరుదెంచునది యనునెడ హరిశ్చంద్రుం డు వారల కిట్లను. ౨౪౧

క॥ దివమునకు వచ్చుటకు మీ, కెవరెవరికి నిచ్చ వొడము నెల్లరు నాతో నవిరళగతి రాఁ దగు నీ, దివిజాధిపుఁ డట్లు తనమదిం గరుణించెన్.

హరిశ్చంద్రుండు కొడునకు రాజ్యంబిడి పౌరులతో స్వర్గమ్మున కరుగుట.

చ॥ అనుతమభూపునానతి సురాధిపునానతి యొండు గాఁగ భో రనఁ జనుదెంచి ఒప్పు నగరమ్మునవారలు కొంద ఱాదివం బునకు విమాన మెక్కి తమపుత్రులపైఁ దగ నాత్మసంస్కృతిం జొనిపి మనమ్ము స్వర్గమును జూచెడి వేడ్కల మిన్ను ముట్టఁగన్.

వ॥ హరిశ్చంద్రుఁడు తక్కంగలబంధుమిత్రులను దగుగౌరవమ్ములఁ దనిపి తనకొమరుం డగురోహితునకు సాధుజనసమ్మతమ్మున విధివిధానమ్ముగఁ బట్టాభిషేకం బొనర్చి. ౨౪౪

క॥ తనకాంతామణియును దా, నును స్వర్గమ్మునకుఁ జనిరి నూతనఘంటానినదమ్మునఁ బొలుపొందెడి, యనూనపుష్పకము నెక్కి యమరులు పొగడన్. ౨౪౫

వ॥ అట్లు సత్యనిధియైన హరిశ్చంద్రుండు స్వర్గమ్మున కేగుదెంచు నెడ నాలోకించి దివిజకవీంద్రుం డిట్టియర్థమ్ముగల శ్లోకంబు పఠియించె

క॥ ఎంతటిదానం? బెంతటి, శాంతిగుణం? బెంతసత్యసంధత? తగుఁ దానెంతకునైనను నీభూ, కాంతుఁడు స్వర్గమొకపెచ్చు గా దితనియెడన్. ౨౪౭

మ॥ జనలోకైకవిశుద్ధచర్యుఁడు హరిశ్చంద్రావనీనాథు వ
ర్తనముం జెప్పితి దీని భక్తిగ రిమన్ దా నెవ్వఁడే విన్న ని
మ్మున వాఁ డెయ్యదిగోరునయ్యదిసుఖమ్మో? రాజ్యమో? విద్యయో?
ధనమో? సంతతియో? సురాలయమొ? సందర్భించుఁ బారిక్షితా.

క॥ నావుడు జనమేజయుఁ డో, దేవా! దేవతలకన్నఁ దేజమ్మునఁ బెం
ద్దై వెలయుశతాక్షీపద, భావు హరిశ్చంద్రు వింటి భావం బలరన్.

గీ॥ ఈశతాక్షి యనఁగ నెట్లుదయించె? నే, తన్మహత్త్వ మెట్లు తనరు
నాకుఁ, దెలుపు మెద్ది వినినయలఘుల కర్వమే, ధశతఫలము ప్ర
తిపదమునఁ డొడరు. ౨౫౦

గీ॥ ఎంత పిఱికిడియైనను నెంతపాపి, యైనఁ దా నెంత నిర్భాగ్యుఁడైనఁ
భావ, నమ్ము శ్రోత్రఘహారి యిహమ్ముఁ బరము, నిచ్చు దేవీచరి
త్రిపై నిచ్చఁ గొనఁడె. ౨౫౧

క॥ అనవుడు వ్యాసుం డిట్లను, జనమేజయ! నీకు దాఁపఁ జనదెద్దియు స
జ్జనుడ వగుకతనఁ దెల్పెద, వినుము శతాక్షీమహత్త్వవిధ మది
యెల్లన్. ౨౫౨

క॥ దుర్గముఁ డనుపేర్వాఁడు ని,ర్గళబాహాపరితాపుఁ డతిలోకుఁడు దు
ర్మార్గుండు హిరణ్యాక్షుని,వర్గీయుఁడు రురునికొడుకు వఱలున్ జగతిన్

వ॥ అతండు దేవతలకు బలం బగువేదమ్ములు హరించిన వారును
నశింతు రని తలంచి హిమాలయమ్మునకుఁ జని వాయుభక్షుం డగుచు
సహస్రవత్సరమ్ములు విరించి గుఱించి తపమ్ము సేయుచున్నంత. ౨౫౪

శతాక్షీ మహిమ.

గీ॥ క్షోణి యంతయుఁ గంపించెఁ గులమహీధ, రమ్ములు చలించె నతని
తేజమ్ముకతన, నంతఁ జతురాననుఁడు ప్రసన్నాననాబ్జుఁ, డగుచు
హంసము నెక్కి ప్రత్యక్షుఁడయ్యె. ౨౫౫

వ॥ ఇట్లెదుటం బొడకట్టి సమాధిగతుం డగువాదుర్గముం గాంచి
నీతపమ్మునకు మెచ్చి భవదభీప్సితంబు నొసంగ వచ్చితి ననునలువకు

మ్రొక్కి దేవా! జగతీసురులయందును సురలయందును గలవేదమ్ము
లును మంత్రమ్ములును నాసమీపమ్మున నుంటయు సురలకుఁ బరాజ
యంబు సేయఁ గలుగుటయు నా కనుగ్రహింపవే! యనిన వల్లె యని
యవ్వీరించి తననివాసమ్మునకుఁ జనియె నంత. ౨౫౬

సీ॥ వేదశాస్త్రమ్ములు విప్రులు మఱచిరి స్నానసంధ్యాహోమజపతపమ్ము
లన్నియు నడఁగె హాహాకార మవనియంతయు నిండె సురలును
నాకమందు, యజ్ఞాదికమ్ముల హవ్యమ్ము దొరకమి సౌఖ్యమ్ము విడ
నాడి నజరులైరి, దుర్గముండును రణోద్యుక్తుఁడై పెల్చన నమరావ
తీపురి నాక్రమించె. గీ॥ వజ్రమయదేహుఁడై నయువ్వానితోడఁ,
బోరఁగా లేక యమరులు భూమిధరగు, హాంతరంబులయెడకుఁ బ
లాయమాను, లైరి శరణమ్ము గానక ప్రాణభీతి. ౨౫౭

వ॥ ఇట్లు దేవతలు గిరిగుహాంతరనిలయు లగుచు జగదంబం
గొనియాడుచున్నంత. ౨౫౮

గీ॥ జన్మములు మాసి ధర్మంబు సున్నయైన,శతన నూఱేఁడు లేకప్రకా
రముగ జ, గతి ననావృష్టిదోషంబు గలిగె దాన, నేల్లఁ జెఱువులు
నూతులు నెండి పోయె, ౨౫౯

వ॥ దానంజేసి పశుపక్షిమృగాదులయందును మనుజులయందును
శవసంగ్రహంబు విస్తరించె నిట్లు జగదుపద్రవంబు సంభవించినఁ బదం
పడి శాంతచేతస్కు లగుకొందఱు విప్రులు హిమాలయంబు వజ్జకుం
జని జగదీశానింగూర్చి సమాధిధ్యానపూజాయోగమ్ముల నిరాహారుల
గుచుఁ దదేకాయత్తచిత్తమ్మున నారాధించుచు నిట్లు వినుతించిరి. ౨౬౦
గీ॥ ఓమహేశాని! యపరాధయుక్తులైన, పామరులయెడ దయ లేమి
పాడియగునె!, కోప ముపసంహరింపుము పాపు మీాయ, నర్థ మిం
కెవరు శరణమమ్మ! మాకు. ౨౬౧

వ॥ అనంతకోటిబ్రహ్మాండనాయికయుఁ గూటస్థరూపిణియుఁ జి
దూ్రపయు భువనేశ్వరియు నగునీకు నమస్కారము «నేతినే” తీతివాక్య

మ్ములచే బోధ్యమాన వగుచు సర్వకారణంబ వగునీ కంజలి ఘటింతు
మైతత్కాలికం బగుదురవస్థఁ బాపి మమ్ముంగటాక్షింపవే? యనువారి
యెలుఁగు లాకర్ణించి యప్పరాంబయు నొక్కెడఁబ్రత్యక్షం బయ్యె.

సీ॥ నీలాంజనముఁ బోలఁ జాలు దేహమ్మును బీనసమోత్తుంగ వృత్తకర్కశ,
శపయోధరములును శతనయనంబులు భాస్కరకోటిప్రభాసమృద్ధి,
జగదతీత మ్మగుసౌందర్యమును లవణిమయును గలదాని విమలమ
ధుర, రసయుతక్షుత్తృడ్జరాఘ్న శాల్యోదన శాకఫలయుతహస్తము
లదానిఁ గీ॥ చాప మాయుధములును హస్తములఁ దాల్చి, వెల్గు
దానిని నప్పరాంబికను జూచి, స్తవ మొనర్చిన నాపె నేత్రముల
నుండి, వారిధారలు గురిసె నవారితముగ. ౭౬౩

వ॥ ఇట్లు నవరాత్రమ్ము లొక్కభంగి సకలౌషధీజాలసంతర్పకం
బగునేత్రజలాసారంబు వెల్లివిరిసిన దానం జేసి నదనదీనిర్ఝరమ్ముల
నూనమ్ములయ్యె సురలు గిరిగుహాంతరమ్ములనుండి వెలువడి భూసురులం
గలసి యంబిక నిట్లు సన్నుతించిరి. ౭౬౪

సీ॥ నిత్యసంతృప్తవు నిరుపమ వఖిలాగమాంతవేద్యవు భువనాధిపతివి,
బ్రహ్మస్వరూపవు భక్తకల్పాగమమవు దేవి! నీవ యీభువన
మెల్ల, మాయచే సృష్టింతు వేయవతార మైనను నెత్తుదువు భక్త
జనులకొఱకు, నమితలోచనముల నలరారునీరూప మంబ! నిర్జర
సివిత్తంబ కాదె. గీ॥ యెత్తితి శతాక్షి యనుపేర నెసఁగుమింక,
దివిరి మాయాగమమ్ములు తెచ్చి యిచ్చి, కరుణఁ జూడుము మమ్ము
నాఁకటికిఁ దాళ, లేమి నిన్ను నుతింపఁ గ లేము తల్లి. ౭౬౫

వ॥ అంత నప్పరాంబ తాను దెచ్చినభోజ్యమ్ము లాసురలకిచ్చి
యక్కతమ్మున శాకంభరి యనుపేర నెగడి యిట్లు వారలయుమ్మలికమ్ము
వాపెఁ బదంపడి దుర్గముండును దూతముఖమ్మున నిది యెల్ల నెఱింగి
సహస్రాక్షౌహిణీపరివృతసేనాసముపేతుం డగుచు హిమాలయమ్మున కరి
గి యద్దేవినికటమ్మున నున్న దేవతల నరికట్టి విప్రులఁ బీడించిన ౭౬౬

క॥ ప్రోవుము ప్రోవు మనుచు భూ, దేవత లోఁ బెట్ట నఱవ దేవియుఁ
గరుణా, భావమ్మున నొక ఛత్రము, గా వర్తిలఁ జేసి బిగాఁదుగాఁ
జక్రిమ్ముఁగ. ౨౬౨

## శతాక్షి దుర్గముం బరిమార్చుట.

వ॥ ఇట్లు బహిస్థిత యగుచు నొక్క శరం బేలియు నవ్వారిపైఁ బడకుండ సంరక్షించుచున్న దేవికిని దుర్గమునకును శరపరిచ్ఛన్న సూర్యమండలమ్మును బాణసంఘర్షణసముద్భూతపావకమ్మును గఠోరజ్యారణత్కారబధిరీకృతదశదిశాతటమ్మును నగు ఘోరసంగరమ్ము కరమ్ము ప్రవర్తిల్లుటయుఁ దచ్ఛతాక్షీదేహమ్మునుండి కాళికయు దారిణియు బాలయుఁ ద్రిపురయు భైరవియు రమయు బగళయు మాతంగియుఁ ద్రిపురసుందరియుఁ గామాక్షియు జంభినియు మోహినియు మున్నగు ద్వాత్రింశచ్ఛక్తులును ననుపదంబ చతుష్షష్టిశక్తులును బొడమి యసంఖ్యాతప్రకారంబున నడరి సాయుధహస్తలై మృదంగవీణాశంఖనాదనాదితం బగు రణాంగణమ్మున విజృంభించి శతాక్షౌహిణీపరిమితం బగు రక్షస్సైన్యమ్ము రూపుమాపుటయు దుర్గముం డగ్రేసరుండై శక్తులతోఁ బది నాళ్లు పోరొనర్చి పదునొకండవనాఁడు ౨౨౮

సీ॥ అరుణచందనమును నరుణసరమ్ములు దాలిచి గొప్పయుత్సవము చేసి,
పెంపారఁ ద్రిజగతీవీరునిగతి విక్రమించి శక్తుల నుక్కడఁచి సోకు.
మూఁకలతోడ వీరైకనియత మగు తే రప్పరమశక్తి తేరు నెదుట,
నిల్పిన వారి కనల్పంపుఁ బోరయ్యె యామద్వయంబు భయప్రద
ముగ. గీ॥ రక్కసునిపైఁ బదేనునారసము లేసి, రెంట లోచన
ములను నాల్గింట గుఱ్ఱ, ములను నొకశరమున ధ్వజమ్మును భుజముల,
రెంట సారథిఁ గొట్టె నుక్కంట దేవి. ౨౨౯

వ॥ తక్కుంగలయేనిట నవ్వానివక్షమ్ము చీల్చిన వాఁడును నెత్తురు గ్రక్కుచు నజ్జగదంబపురోభాగమ్మునం బడియె నంతవానికాయమ్మునుండి యొక తేజమ్ము వెడలి యాపెయందు సంక్రమించె. ౨౩౦

మ॥ ఇటు లక్ష్మంటకుఁ దెల్ల నేసిన జగమ్మెల్లన్ బ్రశాంతత్వసం
ఘటితం బయ్యె సమస్త దేవతలు! నోంకారాత్మ! యోదేవి! య
క్కటికం బీదృశ మేరికిం గలదె! దుఃఖగ్రస్తులన్ మేల్మిఁ బ్రో
చుట కంచున్ నుతియించుచున్ గరములన్ జోడించి రొక్కుమ్మడిన్

వ॥ ఇట్లు నుతించు హరి హరాదుల కాజగదంబ సంతోషకారిణియై కెలన నంజలి ఘటించి యున్న విప్రుల కిట్లనియె. ౨౧౮

క॥ ఈనామమే యధికమ్ముగ, మానింపం దగిన దేవు మాటికిఁ బూజా
గానాదికములఁ గొలిచిన, మానినులకు నిహముఁ బరము మానక
యిత్తున్. ౨౧౯

గీ॥ దుర్గముం డనురక్కసుతోడఁ బోరఁ, బెక్కుకన్నులతో నుద్భవించి
వాని, హతముచేసినకతన శతాక్షి యంచుఁ, దుర్గయంచును ననుఁ
గొల్వ దొసఁగు లడఁగు. ౨౨౦

క॥ అని యుపదేశం బొనరిచి, కనుమొఱఁగెన్ దేవి యిట్టికత విన్న
నుఁ వ్రా, సినఁ జదివినఁ జదివించిన, జనులకు నాదుర్గయే యొసంగు
నుశుభముల్

వ॥ ఇది పరమరహస్యమ్ముగా గోపనీయం బని మునుపు వ్యాసుం గాంచి జనమేజయుండు పరశక్తిభక్తు లగు చంద్రవంశ్యుల చరిత్రమ్ము వినవలతు నావుడు నాతం డిట్లనియె. ౨౨౨

క॥ అంబికదయచేత మహత్త్వంబుం గొనినట్టిచంద్రవంశ్యులచారిత్రం
బును వచియించెదఁ ద, త్త్వంబున్ దగ నిశ్చయించి ధరణీనాథా.

క॥ ఎంతయు నూర్జితమును శ్రీ, మంతమ్మును గడు విభూతిమంతము
నగునీ, యంతయు దేవీమయ మా, వంతయుఁ దదితర మొకింత
యగుపడ దరయన్. ౨౨౪

వ॥ సంసారవృక్షమ్మున కప్పరాంబికాపాద సేవనంబుదక్క మఱియొండు కుఠారంబు గానము ధాన్యార్థి యగువాఁడు మముకం ద్యజియించువగిది నీసర్వంబును బోవిడిచి భువనేశ్వరీపాదమూలంబు సేవించునది యని మఱియును. ౨౨౫

సీ॥ ప్రాఁబల్కులను నకూపారమ్ము మథియించి యప్పరశక్తి పాదార
వింద, మనురత్న మరసి నే నతిధన్యుఁడ నయితిఁ బంచబ్రహ్మాసన
యంచు వినుతిఁ, గన్నయప్పరశక్తి కన్న నన్యము గాన నైదింటి
కన్నను నధికమైన, వస్తు వవ్యక్త మానవస్తువునం దోతమును బ్రో
తమును జగ మనుచుఁ దెలియ, తే.గీ॥ పలయు,భువనేశ్వరీ పదవా
చ్యమైన యప్పదార్థమ్ము దెలియని యజ్ఞులొందు వారు దుఃఖం
బుతజ్ఞులు, దారసౌఖ్య భాజనులటంచు నెఱుఁగు మోహార్థవేదవ్ర॥

వ॥ శ్వేతాశ్వతరశాఖీయులు స్వగుణనిగూఢ యగునాత్మశక్తిని దేవతలు ధ్యానయోగమ్మునం జేసి కాంచిరని నొడివిరి. వేయేల? జన్మసాఫల్యమ్ముకొఱకు సర్వసంగంబు పరిత్యజించి మనమ్మును హృదయమ్మున నిరోధించి లజ్జాభయభక్తులం దెద్దానిచే నైనను దన్నిష్ఠుం డగుచుఁ దత్పరతత్వంబు గాంచునది యని వేదాంతసిద్ధాన్తంబు. ౨౨౭

క॥ నడుచుచు నిద్రిం బోవుచుఁ, గుడుచుచుఁ గూర్చుండుచుణ్ సుగుణ
నద్దేవిన్, గడుభక్తిఁ గొలుచునా మ, ర్త్యుఁడపో ముక్తుండు తదిత
రుఁడు గాఁడునృపా. ౨౨౮

వ॥ కావున విరాడ్రూపయు, సూత్రరూపయు, నంతర్యామిరూపిణియు. బ్రహ్మస్వరూపిణియు, సచ్చిదానంద లక్ష్యార్థరూపయుఁ, బ్రపంచోల్లాసవర్జితయు నగు నప్పరశక్తిని సక్రమమ్ముగ భజించి ముక్తుండవు కమ్మను వ్యాసునకు జనమేజయుం డిట్లనియె. ౨౨౯

గీ॥ హరిహరబ్రహ్మలకు మును పంబ రమను, గౌరిని సరస్వతి నొ
సంగెఁ గాన్కగాఁగ, నంచుఁ జెప్పితి వందుఁ బద్మాలయకును, గౌ
రికిని నన్యకన్యాత్వఘటన యెట్లు? 230

వ॥ నావుడు వ్యాసుం డిట్లనియె. 23౧

క॥ మును హాలాహల నామక, దనుజులు వరజాత మైన దర్పమున్మ

ను, ధ్వని దేవలోకములఁ దను, ననయమ్మున ముట్టడించు నవ
సర మందున్. ౨౩౨

వ॥ హరిహరు లిరువురును నలువదివేల వత్సరమ్ములు సంగ్రాం
బొనరించి రక్కసుల నుక్కడంచి, తమ తావులకుం జని, తమతమ
శక్తుల యొద్దఁ దమతమ పరాక్రమక్రమమ్ముల నుగ్గడించుకొనిన వా
రును ననాదర సూచకంబుగ మందహాసం బొనరించుటయు, నాదిమా
యామోహితులగు కతనఁ గసలి వారల దురుత్తరాపహాసితంబుం
జేసిన నాశక్తులు తత్క్షణంబ కనుమొఱంగి చనుటయుఁ బదంపడి హరి
హరులు శక్తిశూన్యులై తత్తత్కృత్యములయెడ నసమర్థు లగుటకు విరించి
కొండొక చింతించి కారణం బరసి హరిహరుల కార్యంబులు సైతము
తాన నిర్వర్తించుచు కొంత కాలమ్ము గడపి పదపడి మన్వాదులును
సనకాదులును నగు తన కొమరులం దలంచి మీరు దేవి నారాధించి
తత్కరుణా పాత్రులరై హరిహరులకు మరల శక్తి ప్రసాదంబు సం
పాదింపుఁడు నావుడు వారలును హిమాలయ తటమ్మునకుఁ జేరి మా
యాబీజంబు జపించుచు లక్షహాయనంబులు తపమ్మొనర్చి రంత. ౨౩౩

## సనకాదులకు దేవి ప్రత్యక్షంబగుట.

సీ॥ వరమిచ్చు కేలు నభయమిచ్చుహస్తంబు పాశ మంకుశమును బట్టు
పంచ, శాఖద్వయమ్మును సచ్చిదానందరూపంబును గరుణారసం
బు వొరఁగు, లోచనత్రయమును లోనగు లక్షణంబులు గల్గి తగు
సర్వభూతజనని, సాక్షాత్కరించిన సాష్టాంగముగ నమస్కారంబు
గావించి సకల మునులు, గీ॥ భక్తి చెన్నార నుతియింప భావుకప్ర
సాద సూచి కటాక్ష ప్రసార గరిమ, చాలువాఱంగ వారి కష్టంబు
దీర్పఁ, దలఁచి మధురమ్ముగా నంబ పలికె నిట్లు. ౨౩౪

గీ॥ మీ తపమ్మున కెంత మెచ్చి మీ యభీష్ట, ములనొసంగంగ వ
చ్చితి మునులు వలయు, వరములను గోరికొనుఁడన హరిహరులకు
శక్తి లాభమ్ము గోరిరి సకల మునులు. ౨౩౪

వ॥ అందు నొక్కఁడగు దక్షుండు విశేషించి తనయందు దేవీ
జన్మ లాభమ్ము నైతము గోరి యప్పరదేవి నివాసమ్ములును జప ధ్యా
నాది విశేషమ్ములును నానతిమ్మని ప్రార్థించుటయు, జనని యిట్లను
మదంశమ్మునం గలిగిన శక్తుల కొలఁది మెఱుంగక యవమానించిన
కతన హరిహరులకీయవస్థ తటస్థించె నయ్యాదియు, భవదీయ తపోబల
సమాసాదితానన్యజననుగ్రహమ్ముకతన నెడలెనని చెప్పి వెండియు ౨౩౬.

క. భవదీయగర్భమున శివ, యవతారంబెత్తు రమ పయస్సింధువునం,
దవతారమెత్తు నిక్కము, భవునకు విష్ణునకు ధర్మపత్నులు గాఁగన్.

వ॥ అని మాయాబీజజపమ్ము తనకుఁ బ్రీతికరమనియు సర్వజ
గమ్ములును దనకు నివాసమ్మనియు, విరాట్స్వరూపంబొండె, నిర్యో
డ మీకుం బొడకట్టెడి యాకారంబొండె, ధ్యేయమ్మనియు, బోధించి
యమ్మణిద్వీపవాసిని యంతర్హిత యగుటయు వారలును గమలాసను పాలి
కిం జని కలతెరం గెఱింగించిరి. పదంపడి హరిహరులు స్వస్థులై జగజ్జ
ననీకటాక్షభాజనులై రంతఁ గొంతకాలమ్మునకు. ౨౩౮

గీ॥ శక్తి తామస తేజంబు సర్వలోక, హితకరమ్ముగ దక్షుని యింటఁ
బొడమె, దేవతలు సంతసించిరి దివ్యపుష్ప, వృష్టి గురిసె బ్రపం
చమ్ము వెల్లి విరిసె. ౨౩౯

వ॥ ఒక్కండడననేల, నయ్యంబిక యవతరించిన కతన యావజ్జగ
మ్మును శుభమయంబయ్యె, నంత నక్కన్నియకు సతియను పేరిడి యో
గ్యకాలమ్మున దక్షుండు శంకరునకిచ్చి పెండ్లిచేసెనంత బదంపడ యా
యంబిక దైవయోగమ్మున జ్వాలజ్వాలన దగ్ధ శరీరయయ్యె. నావుడు
జనమేజయుం డిట్లనియె. ౨౪౦

చ॥ వినఁ గొఱగాని వార్త నెటువినులుసూడినభంగి వింద నెం, దు
ను ననవద్యమైన గతిఁ దోఁచెడి వస్తువదేల నగ్నిలోఁ బెనఁపరె నే
జగజ్జనని పేరు స్మరించిన వారికిఁ భవా, గ్ని నిధనమబ్బ దట్టి
భవనీరధిపోతము వహ్నిఁ గ్రాఁగునే. ౨౮౧

వ॥ ఇయ్యది యే కర్మవిపాకమ్మున ఘటించె నోడువు మనుడు
వ్యాసుండు రాజేంద్రా! మున్ను దుర్వాసుం డొక్కనాఁడు జాంబూ
నదేశ్వరీ సందర్శనమ్మున కరగి యయ్యెడ మాయాబీజ జపంబొనరించి
నఁ బొడకట్టి యద్దేవియు. ౨౮౨

క॥ నిజ కంఠస్థల గతమై, యజహత్పరిమళ పరీతమై సతతాళి, వ్రజ
సేవితమై తగునొక, స్రజముం గరుణించి యొడఁ బ్రసాదం బనుచున్

వ॥ అతండును దన్మాలిక శిరమ్మున ధరించి యంబరమార్గమ్ము
న నరుగువాఁడు దక్షు నికటమ్మునకుం జని, యయ్యెడ సతీదేవింగాం
చి వినయ వినమితుండై మ్రొక్కినఁ బిమ్మట దక్షుం డమ్ముని శీర్ష
మ్మునం దనరు మాలికం గాంచి యీయసాధారణంబగు మాల్యం
బెయ్యెడఁ జేకుఱె నావుడు మునియు నానందాశ్రు లురుల నియ్యది
పరదేవీప్రసాదం బని చెప్పెఁ బిదప దక్షుం డయ్యది తన కిమ్మనుడు. ౨౮౪

క॥ మునివరుఁ డంగీకార, మ్మున దేవీభక్తునకు సమ్మఁడు గాడెవ్వాఁ,
డును వాఁడు దేసఁగోరినఁ, జననీ ననియెంచి యొసఁగె స్రజ మా
తనికిఁ. ౨౮౫

వ॥ దక్షుం డామాలికం గ్రహించి తన కేళీసదనమ్మునఁ బది
లపఱచి. ౨౮౬

క। పదపడి రాతిరి మోహా, స్పదుఁడై తన్మాల్య గంధవర్ధిత మోదా
భ్యుదయుండై క్రీడాపర, త దవిలి వర్తించెఁ బేర్మి దక్షుఁడొత్తంగఁ

వ. ఇయ్యపరాధమ్ము కారణమ్ముగ దక్షునికి శివునియందును
గూఁతురగు సతీదేవియందును ద్వేషమ్ము ఘటియించె నని వెండియు

క॥ ఇయ్యది కారణమున న, త్తొయ్యలి తజ్జన్యమైన తొల్లిటి కాయం
బొయ్యన యోగాగ్నికి నిడి, యయ్యవనీధరవరునకు నాత్మజ,
యయ్యెన్. ౭౪౯

క॥ అనవుడు జనమేజయుఁ డో, మునివర! శంభునికిఁ బ్రాణమునకన్న
ను హె, చ్చననొప్పు నా సతీమణి, యనఘ మృతింగనిన మీఁద
నతఁ డెట్లుండెన్ ? ౭౫౦

చ॥ అనఁ మునినాథుఁ డిట్లనును నాసయివృత్తము దిట్టిదంచుఁ జె, ప్ప
నలవికాదు శంకరు నపారపుఁ గ్రోధము వీరభద్రు నం, జనకము
గాఁగ నాతఁడు వెసన్ ద్రిజగమ్ములు నీఱుచేయునం, తన జలజాస
నాదులు ద్రుతమ్ముగ శంకరు నాశ్రయించినన్. ౭౫౧

వ॥ శంకరుండును దద్భయార్థితులగు బ్రహ్మాదులకుఁ దనసేగి లెక్కింపక కరుణాకరుండు గావున నభయంబిచ్చి భాగవక్త్రమ్మున నద్దక్షుం బ్రతికించి పదంపడి ఖిన్నాత్ముండై యజ్ఞవాటమ్మున కరిగి వహ్నికుండం బెల్లెడ వెదకి దహ్యమానయుఁ జత్కలారూపిణియు నగు సతిం గాంచి స్కంధమ్మున నిడికొని హా సతి! హా సతి! యని సారెసారెకు రోదనం బొనర్చుచు భ్రాంతచిత్తుండై నానా దేశమ్ములు పరిభ్రమించు చుండె నంత బ్రహ్మాదులును జింతాదంతురులైరి పిదప విష్ణువు బాణపాతమ్మున నాసతీదేవి యవయవమ్ముల ననేక ఖండమ్ములుగా ఛేదించిన నయ్యవి తత్తత్స్థానమ్ములంబడియె. శంకరుండును నాయా చోట్ల నానా రూపధరుండై వసియించుచు, దేవతలం గాంచి యిట్లనియె. ౭౫౨

క॥ ఈ యీ స్థానమ్ముల శ్ర, ద్ధాయుతులై దేవి నెవరు తద్దయుఁ
బూజల్, సేయుదు రవ్వారికి శుభ, దాయిని యగు నాపె కరుణ
దైవారంగన్. ౭౫౩

వ॥ అయీ చోట్లఁ దనయవయవమ్ములయందు నద్దేవి నిత్యమ్మును సన్నిహితయై యుండుకతనఁ బురశ్చరణాదరులగు మర్త్యుల కయ్యెడ మంత్రసిద్ధి సత్వరంబుగ నగు నదియునుంగాక మాయాబీజంబయ్యెడ జపించెనేని నతిశీఘ్రకాలమ్మున సిద్ధించు నని చెప్పి. ౭౮౪

క॥ విరహాతురుఁడై యా శం, కరుఁడు జప ధ్యాన పరతఁ గాలక్షేపా
దరుఁడై యా యా చోటుల, నరయుచు వర్తించుచుండె నవనీనాథా! ౭౮౫

క॥ నావుడు జనమేజయుఁ డ, ద్దేవీ స్థానముల సంఖ్యఁ దెలిపి తదీయం
బై వెలయు నామ సంఖ్యయు, వేవినుపింపఁగదె ననుఁ బవిత్రునిఁ జేయన్. ౭౮౬

గీ॥ అనుచు వ్యాసుండు వల్కె నో జనవరేణ్య!, శక్తిపీఠమ్ములను
నాదు శక్తికొలఁది, తెలిపెదను విను మెవ్వానిఁ దెలిసి నరుఁడు,
పాపముల నీఁగు మిగుల సంపద్దలఁ దోఁగు. ౭౮౭

## —♦ దే వీ స్థా న మ్ము లు. ♦—

వ॥ భూతికాములగు వార లే యే పీఠమ్ములయం దుపాసనాపరులై సిద్ధింబడయుదు రయ్యవి వివరింతు. వారాణసి యందు ♦ విశాలాక్షియు, నైమిశమ్మున లింగధారిణియుఁ, బ్రయాగమ్మున లలితయు గంధమాదనమ్మునఁ గాముకియు, దక్షిణమానసమ్మునఁ గుముదయు, నుత్తరమానసమ్మున విశ్వకామయు, గోమన్తమ్మున గోమతియు, మందరమ్మునఁ గామచారిణియుఁ, జైత్రరథమ్మున మదోత్కటయు, హస్తినాపురమ్మున జయంతియుఁ, గాన్యకుబ్జమ్మున గౌరియు, మలయాచలమ్మున రంభయును, నేకామ్రపీఠమ్మునఁ గీర్తిమతియు, విశ్వమ్మున

♦ ముఖము పడినచోటు వారణాసి. అట వసించు గౌరికి విశాలాక్షి యను పేరు, అని వ్యాఖ్యాత.

విశ్వేశ్వరియుఁ, బుష్కరమ్మునఁ బురుహూతియుఁ, గేదారపీఠమ్మున సన్మార్గదాయినియు, హిమవత్పృష్ఠమ్మున మందయు, గోకర్ణమ్మున భద్రకర్ణికయు, స్థానేశ్వరమ్మున భవానియు, బిల్వకమ్మున బిల్వపత్రికయు, శ్రీశైలమ్మున మాధవియు, భద్రేశ్వరమ్మున భద్రయు, వరాహశైలమ్మున జయయుఁ, గమలాలయమ్మున గమలయు, రుద్రకోటియందు రుద్రాణియుఁ, గాలంజరమ్మునఁ గాళియు, సాలగ్రామమ్మున మహాదేవియు, శివలింగమ్మున జలప్రియయు, మహాలింగమ్మునఁ గపిలయు, మాకోటమ్మున ముకుటేశ్వరియు, మాయాపురియందుఁ గుమారియు, సన్తానమ్మున నంబికయు, గయయందు మంగళయుఁ, బురుషోత్తమంబున విమలయు, సహస్రాక్షమ్మున నుత్పలాక్షియు, హిరణ్యాక్షమ్మున మహోత్పలయు, విపాశయం దమోఘాక్షియుఁ, బుండ్రవర్ధనమ్మునఁ బాటలయు, సుపార్శ్వమ్మున నారాయణియుఁ,ద్రికూటమ్మున రుద్రసుందరియు, విపులమ్మున విపులయు, సహ్యాద్రియందేకవీరయు, హరిశ్చంద్రమ్మునఁ జంద్రికయు, రామతీర్థమ్మున రమణయు, యమునయందు మృగావతియుఁ, గోటితీర్థమ్మునఁ గోటవియు, మాధవవనమ్మున సుగంధయు, గోదావరియందుఁ ద్రిసంధ్యయు, గంగాద్వారమ్మున రతిప్రియయు, శివకుండమ్మున శుభానందయు, దేవికాతటమ్మున నందినియు, ద్వారవతియందు రుక్మిణియు, బృందావనమ్మున రాధయు, మథురయందు దేవకియుఁ, బాతాళమ్మునఁ బరమేశ్వరియుఁ, జిత్రకూటమ్మున సీతయు, వింధ్యమ్మునవింధ్యాధివాసినియుఁ, గరవీరమ్మున మహాలక్ష్మియు, వినాయకమ్మున నుమాదేవియు, వైద్యనాథమ్మున నారోగ్యయు, మహాకాలమ్మున మహేశ్వరియు, నుష్ణతీర్థమ్మున నభయయు, వింధ్యపర్వతమ్మున నితంబయు, మాండవ్యమ్మున మాండవియు, మాహేశ్వరీపురమ్మున స్వాహాయు,

భగలండమ్మున( బ్రిచండయు, నమరకంటకమ్మున( జండికయు, సోమేశ్వరమ్మున వరారోహయు(, బ్రభాసంబున(బుష్కరావతియు,సరస్వతియందు దేవమాతయు, సముద్రతటంబున( బారావారియు, మహాలయమ్మున మహాభాగయు(, బయోష్ణియందు( బింగళేశ్వరియు(, గృతశౌచమ్మున సింహికయు(, గార్తికమ్మున నతిశాంకరియు, నుత్పలావర్తకంబున లోలయు, శోణసంగమమ్మున సుభద్రయు, సిద్ధవనమ్మున మాతయు, భరతాశ్రమమ్మున ననంగయు, జాలంధరమ్మున విశ్వముఖియు(, గిష్కింధపర్వతమ్మున( దారయు, దారువనమ్మున( బుష్టియు(, గాశ్మీరమండలమ్మున మేధయు, హిమాద్రియందు భీమయు, విశ్వేశ్వరమ్మున( దుష్టియు(, గపాలమోచనమ్మున శుద్ధియు(, గాయావరోహణమ్మున మాతయు, శంఖోద్ధారమ్మున ధరయు(, బిండారకమ్మున ధృతియు, జంద్రభాగయందు( గళయు, మచ్ఛోదమ్మున శివధారిణియు, వేణాయం దమృతయు, బదరియం దురసియు, నుత్తరకురుక్షేత్రమ్మున నోషధియు(, గుశద్వీపమ్మున( గుశోదకయు, హేమకూటమ్మున మన్మథయు(, గుముదమ్మున సత్యవాదినియు, నశ్వత్థమ్మున వందనీయయు, వైశ్రవణాలయమ్మున నిధియు, వేదవదనమ్మున గాయత్రియు, శివసన్నిధియందు( బార్వతియు, దేవలోకమ్మున నింద్రాణియు, బ్రహ్మాస్యమ్ములయందు సరస్వతియు, సూర్యబింబమ్మున( బ్రభయు, మాతలయందు వైష్ణవియు, సతులయం దరుంధతియు, రామలయందు( దిలోత్తమయు,(, జిత్తమ్మున బ్రహ్మకళయు, సర్వశరీరులయందు శక్తియు నెగడుదు రని వెండియు. 2౫౮

క॥ ఎనిమిదివందల పీఠము, లును నందఱు శక్తులును బొలుచు చుండెడి నో జనమేజయ యే తత్సం, ఖ్యను విన్న నఘమ్ము లడఁగుఁ గలుగు శుభమ్ముల్. 2౫౯

వ॥ సతీదేవ్యంగభూతమ్ములగు సిద్ధపీఠమ్ములకు యాత్రార్థమ్ముగా నరిగి పితౄదుల సంతర్పించి భగవతిం బూజించినవారు కృతకృత్యులగుదు రని వెండియు. ౭౬౦

సీ॥ భక్ష్య భోజ్యాది సంపన్నమ్ముగను విప్ర జనులకు భోజనంబు నిడి
యును సు, వాసినీ జనులను వటుకాదులను గుమారికల నట్టుల
యలరింప వలయు, నింతేల? యెయ్యెడ నెవ్వఁడేనియుఁ బూజనీ
యుండు కులభేద నియతి వలవ, దెయ్యెడ నుండెడి యంత్యజుఁ
డేనియు దేవి స్వరూపుఁడు తెలియు మధిప? గీ॥ యచటఁ జే సా
పవలదు శక్త్య నుస్మృతిగను, మంత్రము జపింప వలయు నమ్మాత
ప్రీతి, కోఱకు నిట్లెవ్వఁ డొనరించుఁ గుజనుఁ డేని, వాని పితరు
లు బ్రహ్మలో కాను గతులు. ౭౬౧

వ॥ వాఁడును సమస్త సుఖమ్ముల ననుభవించి దేహత్యాగానంతరమ్మున దేవీ పురమ్మున ముక్తుండై వసియించు నీ నామాష్టశతంబు జపించి సిద్ధిపడసినవార లనేకులు గలరని వెండియు. ౭౬౨

క॥ ఈ నామాష్ట శతమ్మును, దా నెవ్వఁడు పాత్రమందుఁ దగ వ్రా
యు నతం, డూనఁడు గ్రహ మారీ భయ, మో నరవర! వాని
తుల్యుఁ డొక్కరుఁ డున్నే. ౭౬౩

క॥ ఏ మాసవుఁ డైనను దా, నామాష్టశతంబు జపమునన్ బొదలిన
వాఁ, డౌ మానవుఁడు దేవతలకు, భూమీశ్వర! శక్తిరూపము
నతం డొందును. ౭౬౪

గీ॥ ఎవఁడు శ్రాద్ధకాలమ్మున నిది జపించు, నతవి పితరులు పరగతి
కరుగు వారు, సిద్ధపీఠమ్ము లియ్యవి సెప్ప నేల? ముక్తిదము లని
జ్ఞాన సుముఖము లనియు. ౭౬౫

క॥ నరవర! ప్రశ్నంబున కుత్తర మిచ్చితి నతిరహస్య తత్త్వము నీకుం

బరమాదరమునఁ దెలిపితి, నరసి మఱింక నేద్ది యడిగెదవ నృపుఁ
డనియెన్. ౨౬౬

## గౌరీ జన్మము.

చ॥ మునివర! మంచుకొండపయి మున్నుదయించెఁ బరాంబ యం
చు నీవినిచినమాట నెంతయు సవిస్తరరీతి వినంగ నెంతు స
జ్జనని కథామృతం బెవఁడు చాలుఁగఁ గ్రోలియుఁ దృప్తిచెందు దీ
ని నెనయు వానికిన్ మృతిజనింపదు గల్గు సుధాశి కేనియున్.

ఉ॥ నావుడు వ్యాసుఁ డిట్లను మనం బిటు నీకుఁ బరాంబయందు సం
భావితమౌనె? ధన్యుఁడవు మాన్యుఁడ వైతి నరేంద్ర! యా సతీ
దేవి శరీరము న్విడువ దేవనతుండు శివుండు భ్రాంతిమై
నే విషయమ్మునన్ నిలువ కెల్లెడఁ ద్రిమ్మరుచుండె నొక్కఁడై.

క॥ ఘనమున దేవీ రూపం, బనయము ధ్యానించుచున్ సమాధిగ
తుండై, తన యంతఁ గాలయాపన, మును శంభుఁ డొనర్చుచుం
డె భూధవతంసా. ౨౬౯

చ॥ జగములు శక్తిహీనత నసారములై పొల్పుపేద్రె లోకముల్
నెగడె గ్రహాది బాధలు జనించె గణింపఁగరాక భిన్నత వృ
ద్ధి గనె నిటుల్ దురుద్ధరగతిం దగు నాసమయమ్మునందు దు
ష్టగుణుఁడు తారకాసురుఁ డసాధ్యుఁడు బ్రహ్మ వరంబు పెంపునన్

గీ॥ మూడు లోకమ్ము లేలుచు నాఁడునాఁటి, కెల్ల సురలను మునుల
ను బల్లిదుఁ డయి, బాధపెట్టఁ దొడంగె నప్పుడు జంభుఁ, దగ
రొరులు శివునౌరస తనయుఁ దక్క. ౨౭౧

ఉ॥ "అంగనలేని శూలి కెటు లాత్మజుఁ డుద్భవమందు"? నంచుఁజిం
తం గొని దేవతల్ తమకుఁ దారకు బాధ యపారమై శమ

ఖ్యుం గనకున్న నెల్లరు నమోనమ యంచు హరి న్నుతింప న
య్యంగజుఁ గన్న తండ్రి యిటు లానతి యిచ్చె నుపాయశాలియై

సీ॥ కామకల్పద్రుమంబు లోకజనయిత్రి, గలదు చింతింప నేల? ని
క్కముగ మన య, నయమునం జేసి యాపె మిన్నకయ యుం
డె, మనకు నిది శిక్షయగు నంచు మదిఁ దలంచి. 223

క॥ లాలనమునఁ దాడనమున, నే లలనకు నైన సుతుల యెడ దయ
యుండుగా, బాలకులు సేయు దుందుడు, కేలా తల్లులకుఁ గాక
యితరుల కుడుపగా. 224

క॥ కావున జగదంబికయై, భావమ్మునఁ గరుణ యెపుడు పరివేష్టింపగా
జీవులఁ బ్రోచెడి యప్పర, దేవిగా శరణంబుఁ గొన్న దీనత లున్నె?

వ॥ అను కమలలోచను నాజ్ఞ సురలెల్లరును హిమశైలమ్మున
కరిగి యయ్యెడఁ బురశ్చరణ పరాయణులై దేవీయజ్ఞం బొనరించుచుఁ
దృతీయాది వ్రతమ్ముల నాచరించుచు నుండి రందుఁ గొందఱు స
మాధినిష్ఠాతులును, గొందఱు నామపరాయణులును, గొందఱు సూ
క్తా సక్తులును, గొందఱు మంత్రపారాయణ పరులును, గొందఱు కృ
చ్ఛ్రచాంద్రాయణ వ్రతనిష్ఠులును, గొందఱంతర్యాగ సంస్థులును,
గొందఱు న్యాసపమాదరులును నై భువనేశ్వరీమంత్రమ్మునఁ బరశక్తి
పూజ నొనర్చుచు బహువర్షమ్ములు గడపు చున్నంత. 225

ఉ॥ మేలగు చైత్రమాస నవమీ దివ మంధలి శుక్రవారమం
దోలి సురాళి కట్టెమట నొక్క మహాద్భుత తేజ మున్నత
శ్రీలలితంబు కోటిశశి శీతల మూర్క సహస్ర కాంతి సం
కీలితమై తటిత్కలనఁ గేరుచు నుద్భవమంద్ర శ్రోణమై. 226

వ॥ వెండియు. 227

సీ॥ మూర్తిమంతమ్ములై మొనపి వేదములు నాలుగు నాల్గు దిక్కు
లఁ బొగడుచుండ, నాద్యంత రహితమై యవయవద్యయై యూర్ధ్వ

గతియుఁ దిర్యగ్గతి గనక కరచ, రణముఖా ద్యవయవ ప్రావృ
తమ్మును గాక స్త్రీ పుం నపుంసక స్థితి నొలయక, దీప్తిచే నమ
రుల దృక్ప్రసారమ్ముల మిఱుమిట్లు గొల్పుచు మెఱసి యంత, గీ॥
నా మహాతేజ మంగనయై మనోహర స్వరూపమ్ము తనరఁ గర
మ్ము నమర, వరుల మనముల నానంద వార్థి ముంచె, నా విధం
బట్టి దిట్టిది యనఁగ రాదు. ౨౨౯

సీ॥ కమలకుట్మలముల కొమరు గాదనఁ జాలు గబ్బి గుబ్బల కీవి గ
లుగు దానిఁ, గల రణత్కింకిణికా జాలసింజత్సుమంజీర మేఖలల్
మలయుదానిఁ, గనక కేయూరక గ్రైవేయ కాంగద గళబంధ
ముల పొల్పు గలుగుదాని, మొగలిదళముల సొబగుమీఱి వా
సించు నీలకుంతలములు నెగడుదానిఁ, గీ॥ గప్పురఁపుతావి నెల్లెడ
గుప్పు వీడి, యంపు బల్ కావి నొప్పు నాస్యమ్ము దానిఁ, బృథు
నితంబ బింబమ్మున వెలయు దానిఁ, గనక తాటంక యుగళమ్ము
నెనయుదాని. ౨౩౦

సీ॥ అష్టమీచంద్రబింబాభ లలాటమ్ము నాయతభ్రూవిలా సాస్పదం
బు, రక్తారవింద విరాజన్నయన మున్నత ఘ్రాణ ముద్య దధర
సమేత, మబ్జరేఖాసముద్యచ్ఛిర మమల ముక్తాహార మిద్ధ రత్న
మకుటంబు, కుందకుట్మల దంత కోటీ విలాసంబు కాశ్మీర తిలక
సంకలిత మతుల, గీ॥ మల్లికా మాలతీ కన న్మాలికాభి, కీలిత సు
కేశ పాశంబు కేవ లారు, ణాంబరంబును పాశాది కాయుధ స
ముపేత మగు దివ్య రూపంబు వెలయు దాని. ౨౩౧

చ॥ పొలుపగు దాడిమీ కుసుమ పుంజము నాఁ దగు కాంతిదాని సు
జ్వలములు నాల్గుబాహువు లెసంగెడి దాని సమస్తకామముల్
చిలికెడు దాని లేనగవు చెన్నలరారెడు దాని నిత్య శీ
తల కరుణా సనాథయగు దానిఁ గనుంగొని రంబికన్ సురల్.

క॥ కని మ్రొక్కెడి యానందా, శ్రు నిరుద్ధ స్వనులు ప్రేమ చుం
బిత నిజలో, చనులును నై తన్మయులగు, మన మొండేమియు
ను వినమి మ్రొక్కెడి పిదపన్. ౭౮౩

వ॥ ఎట్టకేలకు ధైర్యమ్ము దెచ్చికొని యజ్జగదంబ నిట్లు సన్ను
తించిరి. ౭౮౪

గీ॥ రజ్జువున మాలయందు సర్ప భ్రమంబు, వసువున జగమ్ము నీ
యందు భ్రాంతి కల్పి, తం బగు నని తెలియని కతమున నిన్నె,
ఱిఁగిన మీఁదట భ్రాంతి యడఁగు జగమున. ౭౮౫

క॥ తత్త్వసుట కుదాహృతి సం,విత్తున నగు నిన్ను భువన విశ్వ వటంచుం
జత్త్వాన్మతి వటంచున్, బత్తిమెయి నమస్కరించు వారము తల్లీ!

వ॥ అఖండానందంబును బ్రణవంబును హ్రీంకారమ్మును
బ్రత్యగాత్మయును నీస్వరూపమ్ము లాగమ తాత్పర్య భూమికయు నవ
స్థాత్రయ సాక్షిణియుఁ బంచ కోశాతిరిక్తయు నగు నీకు నమస్కా
రము. త్వం పదమ్మునకు వాచ్యంబ వగు నిన్ను నానా మంత్రా
త్మిక వనుచు నుతింతు మని శ్రీ సూక్తంబులఁ దన్ను నుతించు నిర్జ
రులం గాంచి సుధా మధుర స్వరంబున నజ్జగదంబ యిట్లనియె. ౭౮౬

క॥ దేవతలార! మదగ్రము, మీ వచ్చిన కార్య మేమి? మీ మొగము
లు శో, కావిలత నొంద నేల? ము, దానహాయగు నేను వరదనై
యుండంగన్. ౭౮౭

క॥ నాయందు భక్తిగలవా, రేయెడ నాపదల నొందిరేనియు సత్యం
బాయాపద వోలఁగించి ము, దీయుల నొనరింతునను ప్రతిజ్ఞ
మొఱుఁగరే. ౭౮౮

చ॥ అనుచు దయా సమేతముగ నానతి యిచ్చిన దేవి పల్కులన్
విని ముదమందుచున్ సురలు నిర్భయులై తమ దుఃఖ మీఁగతిన్

మనవియొనర్చి, రెండు భువనమ్ముల నెచ్చట నేని నీకునుం
గన విన రాని సంగతులు కల్లలు గావె ప్రపంచ మాతృకా. ౭౯౦

క॥ తారకుఁ డసురకులుఁ డే, పార సరోజాత భూదయా పాత్రుం డై,
కోరిన వరములు గొని దు, ష్ప్రారంభతఁ జేసి మమ్ము బాధిం
చు నొగిన్. ౭౯౧

క॥ శివు వలనం బుట్టిన వాఁ, డు వధించెడి వాని శర్వుఁ డును భార్యా
నై, భవ మెఱుఁగనివాఁ డెటు సం, భవమందున్ గోము కోకం
డు భవ్రుఁడ తల్లీ! ౭౯౨

చ॥ అని విలపించు దేవతలయందు దయాంతరయై పరాంబ యి
ట్లనియె మదీయ శక్తియ హిమాద్రికిఁ బుత్రిక యై జనించు నా
పేనుఁ బురసైరి కెల్లరును బెండిలి సేయుఁడు దానఁ జేసి యా
తనికిఁ గుమారుఁడుం బొడముఁ దారకునిన్ వధియించుఁ బొండిఁకన్

వ॥ అను పరాంబ పల్కులకు సంతసించి సురలతోడం జను
దెంచిన హిమాచలరాజంబ కిట్లనియె. ౭౯౪

క॥ ఏమీ! నాపుణ్యము త, ల్లీ! మా యింటం జనింతె లీలాకృతివై,
కామిత ఫలదాయిని నా, నేమమ్ము ఫలింప నేర్చెనే! యిప్పటికిన్

క॥ జడుఁడన్ మందుఁడ నే నె, క్కడ? చిద్రూపిణి పరాంబికయు ద
యచే నా, కడుపునఁ జనించుటయు నె, క్కడ? జన్మశతముల
కైనఁ గలుగునె తల్లీ! ౭౯౬

గీ॥ అశ్వమేధాది యాగమ్ము లాచరించు, సుకృతులేనియు నీరూపు
చూడ లేరు, తాదృశంబగు రూపమో తల్లి! నాగృ, హమున జని
యించు టరిది భాగ్యంబ కాదే? ౭౯౭

శా॥ మంచుంగొండ! యనేక జన్మముల నేమం బెంతగా నొప్పనే?
యొంచు నన్నును నిన్ను భక్తకరుణాయూదఃపతింగొంగ న

్గించున్ లోకము మత్ప్రత్యాణము విముక్తింజెందు నోతల్లి! ని
ర్మించున్ వేఱొక పుణ్యలోకమును జేర్మిన్ బమ్మ యవ్వారికిన్.

వ॥ సర్వవేదాంత సారభూతంబగు నీ విశ్వరూపం బొకమరి సాక్షాత్కరింపం జేసి శ్రుతి సమ్మతమ్ములగు భక్తి జ్ఞాన యోగమ్ము లానతిచ్చి కృతార్థుం జేయుము నావుడు హిమవంతునకు వికసిత ముఖపంకజ యనుచు నప్పరాంబ శ్రుతి గూఢంబగు నా రహస్యం బిట్లు వక్కాణించె. ౭౯

## —। దేవీవిశ్వరూపపరిదర్శనము. ।—

క॥ అమలం బనుపమ మవిత, ర్క్య మనామ యమేకముం బరబ్రహ్మ
భి, ఖ్యము సంవిత్తును సగు తే, జ మనఁగ విను నేనసూ రసాధర
మాళీ. ౮౦

గీ॥ తత్సహజ శక్తి మాయ నాఁ దనరు నది య, సతియు సతియును
నుభయానుగతియుఁగాక, శశికిఁ జంద్రిక యగ్ని కుష్ణతయు భా
స్కరునకు దీధితిరీతిగాఁ దనరుచుండు. ౮౧

వ॥ స్వీయశక్తిసమాయోగమ్మునంజేసి యేన బ్రపంచమ్మున కు బీజంబ నైతి. నస్మచ్ఛక్తి యనఁగా మాయ. యది తపస్తమోజడాది నానానామంబులు గలయది. ఆ యీ నామమ్ములెల్ల నిగమాదిప్రసిద్ధంబులు. కాని, యన్యోపండితుల స్వకపోల కల్పితంబులు గావు. అమ్మాయ జీవాశ్రిత యగుపట్టున నవిద్యయనఁ బఱఁగు. దానికి స్వాశ్రియ వ్యామోహ కృత్త్వంబొండు దోసంగు గలదు. ఏతద్దోషమ్మునుండి రక్షించి జీవునకు మోక్షం బొసంగుటయ సృష్టికి ముఖ్యప్రయోజనంబు. మాయాప్రతిబింబితమ్మగు చైతన్యంబు సృష్టికి నిమిత్తకారణంబు. మాయసమవాయికారణంబు. దృశ్యంబగుకతన

మాయాజడంబును జ్ఞానమువలన నశించుటంజేసి మిథ్యయునగు. చైతన్యంబు దృశ్యంబుగాదు. కాన నిష్పరవస్తువును జడమనరాదు. ఇయ్యది దీపమ్మువడువుఁ బరప్రకాశకమ్మును స్వయంప్రకాశమానమ్మును నని యెఱుఁగునది. జాగ్రదాద్యవస్థాత్రితయమ్మునం దిదియొక్కటేగతి భాసించు. నియ్యది సంవిదాత్మకంబు, సుఖాత్మకంబు, పరప్రేమాస్పదంబగుకతన నానందాత్మకంబు నిత్యంబు, సత్యంబు, దీనికన్న నితరమ్ము మిథ్య. కావున నిష్పరవస్తువున కసంగత్వమును నపరిచ్ఛిన్నత్వమును స్ఫుటముకదా? ఏవంభూతమగు పరవస్తువును నేను. నేను జ్ఞానాత్మికనుగాని జ్ఞానధర్మిణినిగాను. జ్ఞానరూపమ్మును బ్రహ్మమ్మును ద్వైతజాలవివర్జితమ్మును నగు పరవస్తువు కామకర్మాదియుక్తయగు స్వీయమాయకతమ్మునను బూర్వానుభూతసంస్కారవశమ్మునను గాలకర్మవిపాకమ్మునను దత్త్వావివేకనిమిత్తమ్మునను సిసృక్షాభాజనంబగుచున్నయది. ఈసర్గంబు బుద్ధిపూర్వకంబుగాదు. ఇంతదనుక నలౌకికమ్మగు నారూపమ్ము నీకుం జెప్పంబడినది. ఇదియ యవ్యాకృతంబును నవ్యక్తంబును, మాయాశబలితమ్మును, సర్వకారణకారణమ్మును, నాదితత్త్వమ్మును, సచ్చిదానందవిగ్రహమ్మును, సర్వకర్మఘనీభూతమ్మును, నిచ్ఛాజ్ఞానక్రియాశ్రయమ్మును, హ్రీంకారమంత్రవాచ్యంబును, నని యెఱుంగునది. ఇద్దాన శబ్దతన్మాత్రరూపకంబగు నాకాశమ్మును దానివలన స్పర్శాత్మకంబగు వాయువును, దానివలన రూపాత్మకంబగు తేజమ్మును, దానివలన రసాత్మకంబగు జలమ్మును, దానివలన గంధాత్మికయగు భూమియుఁ బొడమె. నందాకాశమ్మునకు శబ్దమ్మను, వాయువునకు శబ్దస్పర్శమ్ములునుఁ, దేజమ్మునకు శబ్దస్పర్శరూపమ్ములును, నుదకమ్మునకు శబ్దస్పర్శరూపరసమ్ములును, భూమికి శబ్దస్పర్శరూపరసగంధమ్ములును, గుణమ్ము లీ భూతపంచకమ్మువలన

వ్యాపకమ్మును వాయురూపమ్మును నగు లింగదేహమ్ముద్భవించె. స
ర్వప్రాణాత్మకంబగు నియ్యదియె యాత్మకు సూక్ష్మదేహంబని తెలి
యదగు. కారణదేహంబవ్యక్తంబు, దీనియందె జగంబు బీజరూప
మ్మునను౦డు. నియ్యదియె లింగదేహమ్మునకు హేతుభూతంబు. దీనిం
గుఱించి మున్న వివరింపఁబడియె. పంచీకరణమార్గమ్మునం జేసి పంచ
మహాభూతమ్ము లుద్భవించెఁ, దత్ప్రకారంబు వివరింతు. ౧౦౨

తే॥గీ॥ ముందుఁ బంచమహాభూతములను రెండు భాగములుచేసి యం
దొంటుభాగమునకు, నాల్గుభాగమ్ములను గల్పనంబొనర్చి, యు
నియు స్వస్వేతర ద్వితీయాంశమందు. ౧౦౩

వ॥ యోజింపవలయు, నిట్లు యోజించినయట్టి భూతమ్ము లొక్కొక్క
టి పంచావయవమ్ములుగ నేర్పడు. దీనినే పంచీకరణమని చెప్పుదురు
పంచీకృతభూతజన్యంబగు దేహంబ నాకుస్థూలదేహమ్ము. పంచభూ
తసత్వాంశమ్ములవలన జ్ఞానేంద్రియమ్ము లైదునుంగలిగె. నవియేక
మై యంతఃకరణమ్మునాఁదగె. నది వృత్తిభేదమ్మున నాల్గుభేదమ్ములు
గలయది. యందు సంకల్పవికల్పాత్మకంబగునెడ మనంబనియు, నిశ్చి
తంబగునెడ బుద్ధియనియు, నిత్యానుసంధానపరమ్మగునెడఁ జిత్తమ్మని
యు, నహంభావాన్వితంబగునెడ నహంకారంబనియు, నుడువంబడు.
రాజసాంశమ్మువలనఁ గర్మేంద్రియమ్ములైదును గలిగె. నవియేకమై
ప్రాణంబునాఁబరఁగు. నది ప్రాణాపానవ్యానోదానసమానభేదమ్ముల
నైదువిధమ్ములుగలయది. యందు హృదయమ్మునఁ బ్రాణమ్మును,
గుదమ్మున నపానమ్మును, నాభియందు సమానమ్మునుఁ గంఠమ్మున
నుదానంబును, సర్వశరీరమ్మున వ్యానమ్మును, నివసించుఁ ద్వక్చక్షు
శ్శ్రోత్రజిహ్వాఘ్రాణమ్ములు, వాక్పాణిపాదపాయూపస్థంబును, ప్రా
ణాపానవ్యానోదానమ్ములును, బుద్ధియును, మనమ్మును, గలసి లింగం

బనఁదగు నస్మదీయసూక్ష్మశరీరంబు. వెండియుఁ బ్రకృతివిశేషమ్ము లాలింపుము. మాయయనియు, నవిద్యయనియు,రెండు దెఱంగు లందు (1) సత్త్వాత్మకమాయ (2) గుణమిశ్రిత యవిద్యయని యెఱుంగునది యందు స్వాశ్రయసంరక్షకమ్ము మాయ. యందీశితృప్రతిబింబంబీశ్వరుం డతండు సర్వజ్ఞుండును, సర్వకర్తయును, సర్వానుగ్రహ కారకుండును, నాఁబడు; నవిద్యాప్రతిబింబంబు జీవుండనఁబరఁగు; నీయిరువురకు (3) నవిద్యానిమిత్తకంబగు పూర్వోక్తదేహత్రయాభిమానమ్మున నామత్రితయంబుగల దండుఁ (4) బ్రాజ్ఞతైజసవిశ్వ నామమ్ములు జీవునకు నీశసూత్రవిరాట్పదమ్ము లీశ్వరునకుంజెల్లు నందు జీవుండు వ్యష్టిదేహాభిమానియు, నీశ్వరుండు సమిష్టిదేహాభిమానియు నగునని వెండియు. ౮౦౪

క॥ జీవానుగ్రహకామము, చే విశ్వంబెల్లఁ దానచేయును నానా, భావ
ముల నీశ్వరుఁడు మ, ద్భావుండై నాదుశక్తిఁ దగఁ బ్రేరితుఁడై.

చ॥ సకలచరాచరమ్ములును శక్తికృతమ్ముల యట్టి నాదుమా
యకు మఱినాకు నెన్నఁ బరమార్థతభేదములేదు; చూడ లౌ
కికులకు భేదముండు నది కేవలమత్కృత మింకఁ దత్త్వద
ర్శకులకుఁ దత్త్వమొక్కటియ శాస్త్రనిదానము భూధరోత్తమా!

ఆ॥వె॥ అట్టి నేను జగముసకలమ్ము సృజియించి, ప్రాణమగ్రిముంద ప
రిథవిల్లు నందుఁజొచ్చియుందు నట్లుకాకున్న లో, కాంతరగతి
ఘటనయగుటయెట్లు? ౮౦౫

---

1 సత్త్వాత్మక=శుద్ధతత్త్వ. 2 గుణమిశ్రిత=మలీనసత్త్వ
3 అవిద్యయన మాయయు, నవిద్యయు నని వ్యాఖ్యాత.
4 కారణదేహాభిమాని ప్రాజ్ఞుఁడు, సూక్ష్మదేహాభిమాని తైజసుడు, స్థూలదేహాభిమాని విశ్వుఁడు.

వ॥ ఉపాధిభేదమ్మున ఘటాకాశాదులకు భేదంబు కల్పితంబగుపగిది మాయాభేదమ్మునంజేసి నాయందును భేదమ్ము కల్పితమ్ము. భాస్కరుండుచ్ఛనీచాదివస్తువుల వెలిగించియు, దుష్టుండు గాని తెలుంగున నేనును దత్తద్వస్తుగతదోషమ్ములకు భాజనంబుగాను. బుద్ధ్యాదినిష్ఠంబగుకర్తృత్వమ్మును వివేకశూన్యులు నాయందుఁగల్పింతురు కాని వివేకులిట్లు పొరఁబడరు. ఘటాకాశ మహాకాశమ్ములపగిది జీవాత్మపరమాత్మలకు భేదంబు కల్పితంబు. జీవబహుత్వంబువడువున నీశ్వరబహుత్వమ్మును, మాయాకల్పితంబయగు. నిందిృయసంఘాత వాసనాభేదభేదితయగునవిద్య జీవబహుత్వమ్మునకును, గుణసంఘాత వాసనాభేదభేదితయగునవిద్య యీశ్వరబహుత్వమ్మునకును గారణంబగునని వెండియు

సీ॥ నేన యీశ్వరుఁడను నేనసూత్రాత్ముఁడ నేనవిరాడాత్మ నెఱుఁగు
మయ్య, హరిహరబ్రహ్మలు నావైష్ణవియు గౌరియును బ్రాహ్మ
యును నేన; యినుఁడు శశియు, దారకలును నేన; తస్కరవ్యాధచాం
డాలురు నేన; యన్యంబులైన, పశుపక్షులును నేన; పరమోత్తము
లు కర్మఠులు నేన; దుష్కర్మకులును నేన; తే॥గీ॥ యఖిలభూతమ్ము
లందు నాకన్న వేఱు, లేదు ఫణిమాలకాది విభేదములను, నొంది
యును రజ్జు వేకమైయుండుపగిది, నేన వెలుఁగుదునెందు నో హిమగి
రీంద్ర! ౧౦౯

క॥ అని నొడువు నప్పరాంబం, గని హిమగిరి దేవి! నీయఖండాకారం,
బును గనుఁ గోనఁగా నెంచెద, ననవుడు విశ్వస్వరూప మంబయుఁ
జూపెన్. ౧౧౦

వ॥ సురలును లోచనభీకరంబగు తద్విరాడ్రూపంబుఁ గాంచి విస్మితులైరి; దీనికి యీరూపం బెట్టిదంటేని! ౧౧౧

సీ॥ వ్యోమంబు శిరము, సూర్యుండు చంద్రుండులోచనములు, చెవులు

దిశలు, తొలిచదువులు మధురంపుఁబల్కులు, పవనంబు ప్రాణము, ప్రపంచము హృదయము, ధరిత్రి,కటి, ఖంబు నాభి, భగణము వక్షము, మహర్లోకంబు మెడ, జనోలోక మాస్యము, లలాట మరయఁదపోలోక, మింద్రాదులెల్లరు బాహువు, లిదియుఁగాక, తే॥గీ॥ నాస గంధంబు, దస్రులు నాసికావివరములు, పవలు రాత్రి ఱెప్పలు, జలంబు,కాకుదంబు, రసంబు నాల్క, కనుబొమలు,బ్రహ్మలోకమ్ము, యముఁడు దంష్ట్రలు, మఱియును.

వ॥ స్నేహంబు దంతమ్ములు, మాయహాసంబు,నేత్రాంతప్రసారంబు స్వర్గమ్ము, వ్రీడ యుత్తరోష్ఠమ్ము, లోభం బధరోష్ఠంబు, ధర్మమార్గంబు పృష్ఠంబు, ప్రజాపతి మేఢ్రమ్ము, సముద్రంబులు కుక్షి, పర్వతమ్ము లస్థులు, నదులు నాడులు, వృక్షంబులు కేశంబులు, బాల్యయౌవనకౌమారవార్ధకమ్ములు గతులు, మేఘమ్ములు లోమమ్ములు, సంధ్యలు వసనంబులు, చంద్రుండు మనంబు, హరి విజ్ఞానంబు, రుద్రుఁ డంతఃకరణమ్మునుగా దంష్ట్రాకరాళంబును, నానాయుధ ధరంబును, బ్రహ్మకుత్రాసనంబును, సహస్రశీర్షమ్మును, సహస్రనయనంబును, సహస్రపాదమ్మును, గోటిసూర్యప్రకాశమ్మును, విద్యుత్కోటిసమప్రభంబును, భయంకరమ్మును, ఘోరమ్మును, హృదక్షిత్రాసకారకమ్మును,నగు నమ్మహారూపమ్ముఁ గాంచి కంపమానహృదయులగుచు దేవతలు మూర్ఛిల్లి పడంపడి కెలననున్న వేదమ్ములు ప్రబోధింప తేచి ముకుళితకరకమలులై. ౮౧౭

శా॥ నీ రూపంబు జగద్భయంకరము నెంతేఁజూచి మూర్ఛాభయాక్రాంతంగొంటిమి నీదుసంస్తవము సేయన్నేర్తుమే? త్వద్రూపాంభోరుద్వంద్వముఁ గొల్చువారముల మమ్ముం బ్రోవుమో దేవి! విశ్వాకారాధంబగు నీస్వరూప ముపసంహారంబుఁగావించుచున్. ౮౧౮

వ॥ అగ్నియు సూర్యచంద్రులును నోషధులును దేవతలును సాధ్యులునుఁ బశుపక్షిమృగాదులును మనుజులునుఁ బ్రాణాపానంబులును వ్రీహియవంబులును తపంబును శ్రద్ధయు సత్యంబును బ్రహ్మచర్యవిధియు (1) సప్తప్రాణార్చులును సప్తసమిధలును హోమమ్ములును లోకంబులును సముద్రంబులును నదులునుఁ బర్వతంబులును సంవత్సరంబులును సర్వౌషధంబులును యజ్ఞంబులును యూపంబులును దక్షిణలును ఋగ్యజుస్సామంబులును నెందుండి జనించె నట్టి సర్వాత్మకునకు నమస్కరించెదమని వెండియు. ౧౧౫

తే॥గీ॥ పరమమగు నీదువిశ్వరూపంబు విడిచి, మున్ను గైకొన్న యా
జననోత్సవానంపు, రూపుమూర్వము మాంభీతిమాపుమంచుఁ, బ్రా
ర్థన మొనర్చ్చె నమరులయందుఁ బ్రేమ్మ. ౧౧౬

వ॥ పిదప నంబయు నా విశ్వరూపంబుచాలించి తొంటిరూపంబు గైకొని యమరులకిట్లనియె. ౧౧౭

ఆ॥వె॥ మందభాగ్యులగు సమరులు మీరేడ? నా,విశ్వరూపమేడ? భక్తి
నొందు,టబ్బురంబె? నే దయామతి మీకు సా,క్షాత్కరింపఁ జేయుఁ
గడఁగితిఁజూఁడి. ౧౧౮

— మోక్షమ్మునకు జ్ఞానంబావశ్యకమనుట —

క॥ యోగంబుల దానంబుల, నాగమముల మేటితపములాదిగ నేయే,
యోగములనైన నన్నుఁగ, వే గనుఁగొనఁ జాలుటబ్బునే?
యొండేనిన్. ౧౧౯

వ॥ అని చెప్పి హిమగిరినుద్దేశించి గిరీంద్రా! ప్రకృతంబాలింపుము పరమాత్మ యుపాధిభేదమ్మున జీవత్వమ్ముఁ జెంది కర్తృత్వాద్యనుగ

1 ప్రాణములు, అర్చిస్సులు, అని ద్వంద్వము.

యుండఁగుచు ధర్మాధర్మైకకారణంబులగు నానాకృతులొనర్చుచు నానాయోనులజనించుచు సుఖదుఃఖమ్ములనుభవించుచు మరలఁద త్తత్కర్మానుభవమ్మునంజేసి నానాశరీరమ్ములుతాల్చుచు సుఖదుఃఖానుభవంబొనర్చుచు ఘటీయంత్రింబుచందమ్మున విరామంబుగొనక యజ్ఞానంబునంబడి పొరలుచుండు. ౮_౨౦

సీ॥ కావున మనుజుఁడజ్ఞానంబు నశియించుపొంటె విద్యాభ్యాసము ను
నొనర్ప,వలయు; జన్మంబుసఫలమగుటయుఁ బురుషార్థసమా ప్తియు
నమృతము క్తి,దశియు నజ్ఞానంబునశియించుటయుకాదె? యజ్ఞానజ
మగు నుపా స్తియొండె, గర్మంబునొండె నజ్ఞాననాశనమునఁ గారణ
ములుకావు; కాని రాగ, తే॥గీ॥ దోషముఖ్యమ్మలైనట్టి దోసఁగు
లెసఁగఁ,జేయుఁగాన ననర్థంపుఁజేఁటుఁదెచ్చు, గర్మములవంకఁబోక
నజ్ఞానమహిమ,చెందుపొంటెఁ బ్రయత్నమ్ముచేయవలయు. ౮_౨౧

వ॥ కొందఱు కైవల్యమ్మునకు విజ్ఞానంబ కారణంబైనను "కుర్వన్నేవేహకర్మాణి" యను ననుశాసనంబుకలిమిఁ గర్మంబును తత్ప్రాప్తికి సహాయంబనియు హితకారియనియుం బలుకుదురు. ప్రాగ్ధ్రింధిజన్యంబగు కర్మమ్మునకు హృద్గ్రంథిభేదసాధనంబగు విజ్ఞానంబునకును దమఃప్రకాశంబులకుంబలె యోగపద్యంబుసంభవింపదు. కావున వైదికంబులగు సర్వకర్మంబులును చిత్తశుద్ధికరమ్ములనియెఱింగి శమదమతితిక్షావైరాగ్యసంభవపర్యంతమ్మును గర్మమ్ములొనర్చుచుఁ బిదప సర్వసంగపరిత్యాగంబుచేసి శ్రోత్రియుండును బ్రహ్మనిష్ఠుండును నగు గురువరుఁగాంచి నిర్వ్యాజంబగు భక్తిదళుక్కొత్త వేదాంతశ్రవణంబుసేయుచుఁ దత్త్వమస్యాది వాక్యమ్ములకర్థంబు విచారించునది.

తే॥గీ॥ "తత్త్వమసి"యను వాక్యమద్వైతబోధ,కము తదర్థమ్మెఱింగినవి
మలమతియ,యేను; నేనయతండు; గిరిందు! తెల్ప,తెల్లముగను

తత్సర్థంబు తెలియ వినుము. ౧౨౩

వ॥ తత్పదమ్మునకు సర్వజ్ఞత్వవిశిష్టచైతన్యంబును, త్వం పద మ్మునకుఁగించిద్జ్ఞత్వవిశిష్టచైతన్యంబును, వాచ్యంబు. అసి పదవా చ్యంబైక్యం బిదిపదార్థంబు. సర్వజ్ఞత్వవిశిష్టచైతన్యంబును గించద్జ్ఞ త్వవిశిష్టచైతన్యమ్మును నొక్కటియేయని వాక్యార్థం బిట్టియర్థంబు విరుద్ధంబుకావున తత్త్వంపదమ్ములకు జహదజహల్లక్షణచేఁ జైతన్య మాత్రార్థకత్వంబుస్వీకరించి యితరార్థంబు పరిహరింపవలయు. నట్లె ని చైతన్యంబుచైతన్యంబునొక్కటియేయని యవిరుద్ధంబగు వాక్యా ర్థంబు లభించునని చెప్పి మఱియునిట్లనియె. ౧౨౪

తే॥గీ॥ స్థూలమును, గారణంబును, సూక్ష్మమనఁగ, మూఁడు దేహం
బులాత్మకు మున్నుసాధు, లవి నశింపఁగ నందున్న మైదుఁగో
శ,ములనుదాఁటిన నా బ్రహ్మపుచ్ఛమరయు. ౧౨౫

వ॥ పంచీకృతమహాభూతసంభవంబును భోగాలయమ్మును జ రావ్యాధిసంయుతమ్మును నగునది స్థూలదేహంబు. జ్ఞానకర్మేంద్రియ యుతంబును ప్రాణపంచకయుతంబును నపంచీకృతభూతసంభవంబును మనోబుద్ధియుతంబును సుఖదుఃఖాద్యవబోధకంబును నగునది సూక్ష్మ దేహంబు. అనాదియు ననిర్వచనీయమ్మును నగునజ్ఞానంబ కారణదే హంబు. ఈదేహత్రయమ్ము నశియించినపిదపఁ గేవలాత్మమిగులు. నితనికి జననమరణమ్ములు లేవు. శాశ్వతమ్మును నిత్యమ్మును బురా ణంబును నణువుకన్న నణువును మహత్తుకన్న మహత్తును జంతు (1) గుహానిహితంబును నేతినేతితివాక్యపరిశిష్టమ్మునుహాననకర్తృత్వ హాననకర్మత్వదూరమ్మును నగు నాత్మవస్తువును వితశోకులగువారు సాక్షాత్కరింతురు. ౧౨౬

1 బుద్ధి

సీ॥ రథియాత్మ దేహంబు రథము సారథిబుద్ధి త్రోళుఁబమన మింద్రి
యాశ్వవారువము లింద్రియములమనముగూడి తద్గోచరములగు
పలువిషయముల నాత్మ యనుభవించుననుచు మునులందు రయ్యవి
ద్యయు సమనస్కత్వ మశుచి విధము గలవారలెన్నఁడు గాంచ
రుతత్పదమును సంసృతినిబడి పొరలుచుందు రి, తే॥గీ॥ విద్యయును
సమనస్కత్వవిధియు శుచిత యును గలుగువారు తత్పదములభిం
తు రి, రజ్జుప్రగ్రహంబు చేతనా సారథిగఁ గల్గు వాఁడు తుద ముట్టు ము
త్పదార్థమ్మునందు. ౮౨

వ॥ ఇట్లు శ్రుతిమత్యనుసారంబుగ నాత్మచే నాత్మనిశ్చయుండవై
నిదిధ్యాసనమ్మున నాత్మరూపనగు నన్నుఁదలంచునది. యోగ
వృత్తికమున్న దేవీప్రణవంబగు హ్రీం కారమ్మునందలి యక్షరత్రి
యార్థంబు విచారించి హ కారంబు స్థూలదేహంబనియు ర కారంబు
సూక్ష్మదేహంబనియు ఈ కారంబు కారణదేహంబనియు హ్రీం కా
రంబు తురీయంబగు దేవీరూపంబనియు నిట్లు సమష్టివ్యష్టిదేహంబులు
స్తవ్యంబులౌనట్టి వివిధ సర్వాత్మకైక్యమ్ము నిశ్చయించి నిలీనాత్ముండ
గుచు నాసాభ్యంతరసంచారులగు ప్రాణాపానంబుల సమంబొనర్చి
విగతవిషయాకాంక్షత్వమ్మును వీతదోషత్వమ్మును విమత్సరత్వమ్మును
నిరత నిర్వ్యాజమ్మగు భక్తిప్రపన్నుని రావంబగు గురుముఖంబుఁ బ్ర
వేశించి హ కారరూపుండగు విశ్వాత్మను ర కారరూపుండగు తైజసా
త్మయందును సర్వాని ఈ కారరూప ప్రాజ్ఞాత్మయందును సర్వాని
హ్రీం కారమ్మునందును బ్రవిలాపమ్మొనర్చి వాచ్యవాచకతాహీన
మ్మును ద్వైతభావవివర్జితమ్మును నఖండంబును నగు సచ్చిదానంద
మ్మును చైతన్యాగ్నిదీపశిఖాంతరమ్మున భావించుచుఁ దద్భావనంజే
సి మదీయసాక్షాత్కారంబుఁ గాంచి మద్రూపుండగుచు మదైక్య
మ్ముఁగాంచు నని నవిని హిమవంతుండంబకిట్లనియె. ౮౩

తే॥గీ॥ తత్త్వదర్శనమునకు సాధనము యోగ,మంబ!సంవిత్ప్రదాయక
మంచుమీరంటిఁ, దెలియఁజెప్పుము తద్విధి తేటతెల్ల,ముగను భక్తుని
ధన్యుసిదగ జేచేయు? ౨౯

— యోగమంత్రవివేచనము. —

వ॥ అని వినయావనతుండగుచు నడుగుటయు నంబిక గిరీంద్రా! యోగంబన జీవాత్మైక్యంబకాని వేఱొండుగాదు. తత్ప్రకారంబెఱిఁగింతు. యోగవిఘ్నకరమ్ములగు కామక్రోధలోభమోహమదమాత్సర్యమ్ములను యమనియమాసనప్రాణాయామ ప్రత్యాహారధారణ ధ్యాన సమాధులనియెడి యష్టయోగాంగమ్ములచే జయింపవలయు. నహింసయు సత్యమ్మును నస్తేయమ్మును బ్రహ్మచర్యంబును దయయు నార్జవమ్మును క్షమయు ధృతియు మితాహారమ్మును శౌచమ్మును ననుపదియు యమంబులు. తపంబును సంతోషంబును నాస్తిక్యమ్మును దానమ్మును దేవపూజయు సిద్ధాంతశ్రవణమ్మును లజ్జయు మతియు జపమ్మును హోమమ్మును ననుపదియు నియమమ్ములు పద్మాసనమ్మును స్వస్తికమ్మును భద్రమ్మును వజ్రాసనమ్మును వీరాసనమ్మును ననునైదును నాసనమ్ములు. ౩౦

క॥ చరణతలములు రెండును సక్థులందుఁ జేర్చి బొటవ్రేళులను రెండు
చేతులఁగొన,వలయు వ్యుత్క్రమముగు గతినలయి కెడలి, యదియు
పద్మాసనము భూధరాధినాథ. ౩౧

సీ॥ చరణతలమ్ముల జానూరుమధ్యభాగమ్మునునిడి ఋజుకాయుఁడగు
ట, స్వస్తికమ్మందు[1] సీవనిపార్శ్వములయందు గుల్ఫద్వయ
మ్మునదగులఁగనిల్పి, యండకోశాధస్సమర్పిత పాదపార్ష్ణియగుచుఁ

1 సీవని = అండస్థశిరా.

గరములచేతఁబట్టి,కొనుట భద్రాసనమనియండ్రు జానుభాగము
లందుఁబ్రత్యఙ్ముఖమ్ములైన, గీ॥ వ్రేళ్లుగలచేతులనిమిడ్చి కాళ్లు
దొడల,యందుఁ గ్రమముగనిడుట వజ్రాసనమగు, నొకపదము
క్రిందఁదొడ మీఁదనొకటియుంచి,యమర ఋజుకాయుఁడగుట
వీరాసనంబు. ౮౩౨

వ॥ షోడశమాత్రాప్రణవోచ్చారణకాలమ్మున నిడానాడిచే బాహ్యవాయువునాకర్షించి చతుష్షష్టిమాత్రాప్రణవోచ్చారణకాలమున సుషుమ్నానాడిచే నద్దానిసాఁగి ద్వాత్రింశన్మాత్రాప్రణవోచ్చారణకాలమ్మునఁ బింగళానాడిచే నల్లన రేచించుట ప్రాణాయామమ్మనఁబడు. నియ్యది సగర్భవిగర్భభేదమ్మున రెండుతెఱంగు లందు జపధ్యానాదిసహితంబౌద్యంబు. తదపేతంబుద్వితీయంబు. ౮౩౩

గీ॥ క్రమముగా నిట్టులభ్యాసకలన నెగడు,ధన్యులకు స్వేదకంపభూ
త్యాగములు ల,భించు నందాద్యమధమతమించు రెండ,వయది
మధ్యమమగు మూఁడవయది మేలు. ౮౩౪

వ॥ స్వస్వవిషయమ్ముల నిరర్గళమ్ముగసంచరించు నింద్రియమ్ములనరికట్టుట ప్రత్యాహారంబు. మఱియు నంగుష్ఠగుల్ఫజానూరుమూలాధారలింగనాభులయందును హృ 1 ద్గ్రీవాకంఠదేశమ్ములయందును 2 లంబికయందును నాసయందును భ్రూమధ్యమస్తకాదులయందును యథావిధిగఁ బ్రాణమరుద్ధారణంబు ధారణయనఁబడు, చైతన్యాంతరవర్తియునుసమాహితమ్మునగుమనమ్ముచేనాత్మయందభీష్టదేవతాధ్యానంబు ధ్యానంబునాఁదగు. జీవపరమాత్మలకు సమత్వభావనసమాధినాఁబరఁగు.నిది యష్టాంగలక్షణంబింకమంత్రయోగంబాకర్ణింపుము. చంద్రసూర్యాగ్నితేజోయుక్తమ్మును జీవబ్రహ్మై

1 గ్రీవ = మెడ, కంఠము = కుత్తుక. 2 లంబిక = కొండనాలుక.

క్యారూపకమ్మును బంచభూతాత్మకమ్మును నగువిశ్వంబు శరీరంబు. అందు మూఁడుకోట్లయేబదిలక్షలనాడులుగలవు. అందును బదిప్రధానంబులు. అందుమూఁడు ప్రధానతమమ్ములు. వానినామమ్ము లిడాపింగళాసుషుమ్నలు. ఇందిడానాడి చంద్రరూపిణి. పింగళశక్తిరూపయు నమృతవిగ్రహయు పుంరూపయు సూర్యవిగ్రహయునై వెలయు. ఈరెండును మేరుదండస్థితమ్మును సూర్యచంద్రవహ్నిరూపిణియునగు సుషుమ్నానాడికి వామదక్షిణపార్శ్వమ్ములనొప్పెడి. సర్వతేజోమయమ్మగు నీసుషుమ్నానాడియొక్క మధ్యమ్మునందు విచిత్రనామకంబగు నొకయవాంతరనాడియుండు. దానిమధ్యమ్మునందుఁగోటిసూర్యసమప్రభమ్మును * నిచ్ఛాజ్ఞానక్రియాత్మకంబును నగు స్వయంభూలింగమ్ముకలదు. తదూర్ధ్వమ్మున హ్రీం కారాత్మకంబగు మాయాబీజమ్మువఱలు. తదూర్ధ్వమ్మున రక్తవిగ్రహయు దీపశిఖాకృతియు నగు కుండలిచెలంగు. నదియ దేవ్యాత్మికయనంబరఁగుఁ దద్బాహ్యమ్మున వకారాది సకారాంత చతుర్దళమ్మును బీతవర్ణమ్మును దీప్తహేమసమప్రభమ్మును నగుపద్మమ్మును తదూర్ధ్వమ్మున ననలప్రఖ్యమ్మును వజ్రకాంతమ్మును బకారాది లకారాంత షడ్దళంబును 1 స్వాధిష్ఠానమ్మును నగు 2 మూలాధారంబుకలదు. తదూర్ధ్వమ్మున నాభిదేశమ్మున మేఘాభమ్మును విద్యుత్ప్రభమ్మును బహుతేజోమయమ్మును డకారాది ఫకారాంతదశవర్ణదళసంయుతమ్మును విష్ణ్వధిష్ఠితమ్మును విష్ణ్వాలోకనకారణమ్మునునగు 3 మణిపద్మమ్ముగలదు. తదూర్ధ్వదేశమ్మున ద్వాదశదళయుతంబును నుద్యదాదిత్యసన్నిభం

1 స్వాధిష్ఠానమ్ము, స్వస్య=తనకు. అనగా పరలింగమునకు ఆధారము.

2 మూలాధారము=ఆధారషట్కమ్మునకుమూలము. 3 మణిపద్మము=మణివలెవికసించినపద్మము. మణిపూరమనియుంగలదు.

బును నానందనిలయంబును కకారాది ఠకారాంత వర్ణఘటితమ్మును రుద్రాధిష్ఠితమ్మును నగు 4 ననాహతపద్మంబు కలదు. తదూర్ధ్వమ్మున షోడశస్వరయుక్తమ్మును ధూమ్రవర్ణమ్మును మహాప్రభమ్మును నగు షోడశదళపద్మం బెయ్యది యయ్యది పరమాత్మావలోకనద్వారమ్మున జీవునకు శుద్ధినొడఁగూర్చుటం జేసి విశుద్ధంబనఁబడు. ఇద్దానికి నాకాశంబనియు నామాంతరమ్ముగలదు. తదూర్ధ్వమ్మున నాజ్ఞాచక్రంబు పొసఁగు. దీనియందు జీవునకు నితికర్తవ్యతా విషయమ్మగు పరమేశ్వరాజ్ఞ సంక్రమించుకతన దీని కీనామం బన్వర్థంబగు. నిదియగా త్మాధిష్ఠానంబు. ఇయ్యది హకార క్షకారాత్మక ద్విదళయుక్తంబు. దీని మీఁద కైలాసచక్రంబును, దానిమీఁద రోధినీచక్రంబును కలవు. తదూర్ధ్వంబునఁ బరమాత్మస్థానంబగు సహస్రచక్రంబు గలదు. ఇయ్యది యాధారచక్రంబుల క్రమంబు. ముందుఁ బూరకయోగంబున బాహ్యవాయువుల నాకర్షించి కుంభకంబొనరించి, యవ్వాయువుతోఁగూడఁ దనమనంబును మూలాధారమందుఁ జేర్పవలయుఁ బిమ్మట మూలాధారచక్రమునందలి 2 కుండలినీశక్తిని మూలాధారగతవాయువుచేఁ బీడించి మేల్కొల్పవలయు. నటులొనర్చి మున్ను వివరింపఁబడిన చక్రములయందలి తేజోమయస్వయంభూప్రముఖలింగములను భేదించుచు నమ్మార్గంబున నక్కుండలిని సహస్రమును బొందింపవలయును. అనంతరమ్మటనున్న శంభునితో నక్కుండలిని నైక్యంబు భావింపవలయు. నయ్యెడ శివశక్తి సమాయోగంబునఁ బొడమిన ద్రుతలాక్షారససమానవర్ణంబగు నానందరసాత్మకామృతంబును గుండలినిచేఁ ద్రావించి పదపడి పూర్వోక్తషట్చక్రాధిష్ఠాన దేవ

1 అనాహతమనగా, తాడనములేకయే ధ్వనికలిగియుండునది.

* కుండలిని = శక్తి.

తలనెల్ల సయ్యమృతమ్మునన సంతర్పించి, పిమ్మట నేమార్గమ్మునం గుండలి సహస్రారమ్మునందెనో, యామార్గమ్మునన మూలాధార చక్రమ్మునకు దింపవలయు. ౧౬౨

క॥ ఈరీతి ననుదినం జే, వారైన నొనర్తురేని వారు జరావ్యా, ద్యా
హాంగం చనిక నం, దారుముదరియింపుదురు రసాధరవశాళీరా!ఽ

వ॥ వారికి ఛిన్నాదిదోషదూషితమ్ములగు మంత్రమ్ములు సైతము సిద్ధించు. వేయేల? జగన్మాతనగు నాయం దేయేగుణంబు లెసంగు నవన్నియు వారియందును వర్తించెడి. నియ్యది వాయుధారణ ప్రకారం బిట్టిధారణం జేసి దిక్కాలాద్యనవచ్ఛిన్నన గు నాయందుం జిత్తముంచి జనబ్రహ్మైక్యయోజనంబుకతనం దన్మయుండగునట్లు మలినంబగు. సిద్ధింపనయోని యవయువయోగమ్మున యోగాభ్యాసం బొనరించునది. మదీయంబులగు హస్తపాదాదుల మనంబు గుత్తికొల్పి క్రమక్రమమ్మునం బ్రతిస్థానమ్ముగడచి విశుద్ధచిత్తుండై మదూర్పమ్మున మనమ్మునిచి, చిత్తలయంబగుదనుక జపహోమాదికంబుల నిష్ఠమాత్రాభ్యాసంబొనర్చి జ్ఞానప్రాప్తి నందవలయు. పదపడి పూర్వోక్తయోగాభ్యాసమ్మున కర్హతగలిగెడి. యోగములేని మంత్రమ్మును మంత్రములేని యోగమ్మును లేవని యెఱుంగునది. ౧౬౭

తే॥గీ॥ యోగమంత్రమ్ము లెందు నన్యోన్యసాధ, కములగుచు బ్ర
హ్మసిద్ధికిం గారణములు, బ్రహ్మమగుపడనగును మాత్రమున
దివ్వె, కతనం జీకటి యింటిలోం గలశి పగిది. ౧౩౦

తే॥గీ॥ ఇట్టి యోగమంత్రమ్ముల నెఱుంగంబడెడి, మాయచే నావృతం
బాత్మమోయగేశ!, యోగివిధి దేశికునిగొల్చి బాగుగనెఱుం
గంవలె శాస్త్రపఠనమ్ము గఱుపలేదు. ౧౩౧

తే॥గీ॥ స్వప్రకాశంబు బుద్ధి నిష్టంబు బ్రహ్మ, మిందుం గల్పితమిా

జగమెల్ల బ్రహ్మ, మరయ నెవరికిఁగాదు శక్యంబు దీని, నెఱుఁగు
వాఁడు మృగ్యుండని యెఱుఁగుమచల. ౧౪౦

## —|| ధ్యానయోగము. ||—

వ॥ వెండియు సదసద్వరేణ్యమ్మును, బరమ్మును, విజ్ఞానాగోచరమ్మును, వరిష్ఠమ్మును, లోకాధారమ్మును, సూక్ష్మమ్ముకన్న సూక్ష్మమ్మును, స్థూలమ్ముకన్న స్థూలమ్మును, నక్షరమ్మును, నమృతమ్మును, సత్యమ్మును, నగు పరబ్రహ్మంబు నెఱుంగవలయు. నది యెట్లంటేని? ఔపనిషదంబగు ధనువునం దుపాసనంబుచే నిశితంబగు మనంబు శరంబుసంధించి తల్లక్ష్యంబు భేదింపవలయు. మఱియుఁ బ్రణవమ్మె ధనువును, నంతఃకరణమ్మె శరమ్మును, బ్రహ్మంబులక్ష్యమ్మనుగాఁ జూపట్టుఁ దద్భేదనమ్మునకు నప్రమత్తచిత్తత్వం బపేక్షితంబగు. నది సమకూరినచో శరమ్మునకుంబలె దన్మయత్వం బలవడునని వెండియు. ౧౪౧

క॥ దివియును నాకాశంబుఁ బృ, థివి మఱి ప్రాణములు నెం దొదిగి
వఱలు నదే,యవునాత్మ దీనినెఱుఁగుము, యవితథముగ నితరవిద్య
లవియేమిటికిఁ. ౧౪౨

వ॥ ఇదియ మోక్షప్రాప్తికి పరమసాధనంబగు మార్గము. మఱియు రథనాభియందరమ్ములతెఱంగున నాడుల్న్నియునెందుండు నతండ సర్వాంతర్యామియు బహుధాజాయమానుండనియు నెఱింగి యప్పరవస్తువు "నోం" మనుచు నజ్ఞాననాశనమ్మునకై ధ్యానింపుము. నీకు శుభంబగు నయ్యాత్మ దివ్యంబగువ్యోమరూప బ్రహ్మపురమ్మున నుండునని తెలిసికొనుము. ౧౪౩

తే॥గీ॥ ఆతఁడు మనోమయుండయి ప్రాణదేహ, నేతయయి యన్న.

తుఁడయి నెగడునట్టి, కేవలానంద మమృతమిాక్షింతురు ధీరు
లైనవారలు తమఘనజ్ఞానపటిమ. ౮౪౪

క॥ ఉడుగనికర్మముల పెం, పడఁగుఁ దనహృదయసంశయంబు లడం
గ్నుఁ, విడునొగి హృదయగ్రంథియు, నడరు పరాపరముఁ జూచి
నంతన యెందుఁ. ౮౪౫

క॥ తనరు హిరణ్మయకోశం, బున జ్యోతిర్జ్యోతి విరజమును నిష్కళ
ముఁ, ఘనమును నగు బ్రహ్మము నెఱిఁ, గినవారలె యాత్మవి
దులు గిరికులతిలకా. ౮౪౬

తే॥గీ॥ అచట వెలుఁగడు సూర్యుఁ డబ్జారి తార, కలును మెఱుపులు
వెలుఁగవు వెలుఁగదగ్ని, యాత్మయె వెలుంగు నవ్వాని నను
సరించి, సర్వము వెలుంగుఁ దత్కాంతి జగము వెలుఁగు. ౮౪౭

తే॥గీ॥ పార్శ్వముల ముందు వెనుక నభమ్మునందు, బ్రహ్మము; జగం
బు సర్వంబు బ్రహ్మమనుచు, ననుభవమ్మున నెఱిఁగిన యట్టి
వాఁడు, ధన్యుఁడు కృతార్థుఁ డుత్తమోత్తముఁడు గిరిప. ౮౪౮

క॥ రెండవవాఁడుండిన భయ, ముండెడి నవ్వాఁడ లేకయుండిన భయ
మె, ట్లుండెడి? నద్వైతంబిటు పండిన నొకలోపమున్నె?, పర్వత
మాళీ. ౮౪౯

వ॥ వానికిని నాకును వియోగంబులేదు. వాఁడ నేను; నేన
వాఁడని యెఱుంగుము. జ్ఞానవంతుండున్నచోటున యేనుందు. జ్ఞాని
హృదయాంభోజమధ్యమ్మునందక్కఁ గైలాస వైకుంఠాదిలోకమ్ము
ల నేనుండుదానఁగాను. ౮౫౦

తే॥గీ॥ నన్నుఁబూజించుకంటె ననంతకోటి, గుణితఫలమిచ్చు మద్భ
క్తకోటిపూజ, వాఁడధన్యుండు కృతకృత్యవానితల్లి, వానివం
శంబు శస్తంబు వంశ్యమనఘ. ౮౫౧

క॥ ఎవనిమనమ్మునఁ జిల్లము, మవు బ్రహ్మజ్ఞానమును సతతసేవనఁ
బుణ్యావతీధర యింకనా చెప్పవలసినది నీకులేదు పర్వతపుత్రీ.

వ॥ ఇది భక్తియుక్తుండును సత్స్వభావుండును నగు జ్యేష్ఠపు
త్రునకును తాదృశుండగు శిష్యునకుఁ దక్క నేఱొక్కనికిఁ జెప్పఁగూడ
దగదు. దేవతాగురుభక్తియుక్తుల కుపదేశించు బ్రహ్మవిద్యయు ప్ర
కాశితంబు. తదుపదేష్టయు పరమేశ్వరుండు. బ్రహ్మజన్మప్రదాయ
కుండు. తండ్రికంటెను నధికుండు. వానిఋణంబు తీర్పవాఁడులేఁ
డని చెప్పి మఱియు నిట్లనియె! ౧౯౩

ఆ॥వె॥ గురువుప్రోచు శివుఁడు కోపించెనేనియు, గురువు శిష్యునెడలఁ
గోపియైన, శివుఁడుప్రోవలేఁడు; సిద్ధమియ్యది కాన, గురువు
నెడలభక్తిఁ బూనయువలయు. ౧౯౪

క॥ త్రికరణశుద్ధిగ గురునెడఁ, బ్రకటింపఁగవలయుభక్తి బ్రహ్మజ్ఞానా,
త్మకమగు విద్యనిడిన గురు, నకు ద్రోహమొనర్చినట్టి నరుఁడఘ
మొందున్. ౧౯౫

వ॥ మున్నింద్రునిచే [1] నథర్వణుండు శిరశ్ఛేదమ్ము పణమ్ము
గాఁ బడసిన బ్రహ్మవిద్య నశ్వుల కుపదేశించినకతమ్మున నింద్రిన
జ్ఛిన్నశిరస్కుండై మరల నాభిషగ్వరులచే సంయోజితశిరస్కుండ
య్యె గావున. ౧౯౬

తే॥గీ॥ బ్రహ్మవిద్య లభించుట బహుళకష్ట, సాధ్యమదియీఁదగ ద
పాత్రజనులకెందు, సుజనులకొసంగుచును దారుసుకృతమంది,
సుకృతమందింపవలయు శిష్యులను గూడ. ౧౯౭

---

1 ఈయథర్వణునిపేరు దధ్యఙ్ముని. ఇతనిమొదటిశిరస్సును అశ్వనులెవఱికి యశ్వ
శిరము నతికిరి. ఇంద్రు డద్దానినే ఛేదించెను. పిదప స్వశిరస్సునే యశ్వినులు
సంధించిరి.

## — భక్తియోగము. —

వ॥ అని యుపదేశించినయంబంగాంచి హిమాలయంబు మ
ధ్యమాధికారియగు విరాగికి జ్ఞానలబ్ధికై సుఖోపాయం బానతీయవేయను
డు నాపెయిట్లనియె. ౫౯౮

తే॥గీ॥ కర్మయోగంబు జ్ఞానయోగంబు, భక్తి, యోగమను మూఁటి
లో భక్తియోగము సుకరంబు మనుజులకెల్లఁ గరంబు కా
య,మానసాదులకును బీడలేనికతన. ౫౯౯

వ॥ గుణత్రియ భేదమ్మునంజేసి మనుష్యులభక్తియున్న మూఁ
డు తెఱంగు లందు. ౫౬౦

క॥ పరపీడచేయుటకు మత్సరముఁ గ్రోధంబుఁ దాల్చి దంభమ్ము
పురస్సరముగ నడచెడి నరఘస్మరులకుఁ గలభక్తి తామసంబు
గిరీంద్రా! ౫౬౧

క॥ అసమున సక్తియుఁ గోర్కెల,పసయును భేదమతి భోగపరతయుఁ
గలమానినులదయిన భక్తియ రాజసియగుఁ దత్కృతులకు ఫల
సక్తతకలిమిన్. ౫౬౨

క॥ పరమేశార్పణముగఁ గర్మరతియు వేదమ్ములందుమాన్యతయును
ది,వ్యరసాయనమ్ములగు మత్పురాణములు వినుట సత్త్వపూర్ణభక్తి
యగున్. ౫౬౩

వ॥ ఈసత్త్వభక్తియపరభక్తిప్రాపికయగుఁగాని తక్కురెండునుఁగా
నేరవు. మద్గుణశ్రవణమ్మును, మన్నామకీర్తనమ్మును, గళ్యాణగుణ
రత్నంబులకు నాకరంబనగు నాయందుఁ దైలధారాసమంబుగఁ జిత్త
ంబునిలుపుటయు, సామీప్య సార్ష్టి సాయుజ్య సాలోక్యమ్ములం దిచ్చి

కుండుటయు మత్సేవకంటె నన్యమెఱుంగమియు సేవ్యసేవకభావమ్మున్ నంజేసి మోక్షమ్మునందనిచ్ఛయుఁ బరానురక్తి కలిమి నన్నుఁ జింతించుటయు స్వాభిన్నంబుగ నన్నుఁ దెలియుటయు, సర్వజంతువులయందు మద్రూపంబు భావించుటయు, స్వాత్మయందుం బోలెఁ బరాత్మయందుఁ బ్రీతియుఁ జైతన్యంబుల కైక్యం బెఱింగి భేదబుద్ధి లేకుండుటయు, నా చండాలాంతంబు సర్వత్రవర్తమానయు, సర్వరూపయు నగు నన్నెఱింగి వారిం బూజించుటయు, నమస్కరించుటయు, నెందేని ద్రోహబుద్ధి లేకుండుటయు, మదాలయసందర్శనంబునందును, మద్భక్తాలోకనంబునందును, నాసక్తియు, మచ్ఛాస్త్రమంత్రతంత్రాదిశ్రవణశ్రద్ధయుఁ, బ్రేమాకులమతియు, రోమాంచితశరీరుండును, గద్గదకంఠుండును, నానందాశ్రుజలపూర్ణలోచనుండును నగుచు ననన్యభావమ్మున సర్వకారణకారణంబ నగు నన్ను యజించుటయు మదీయంబులగు నిత్యనైమిత్తికవ్రతంబు లాచరించుటయు, మదుత్సవదిదృక్షయు, నస్మదుత్సవకరణమ్మును, మన్నామంబుల యుచ్చైర్గానంబును, దదనుగుణంబగు నృత్యంబును, నహంకారరహితుండును, దేహతాదాత్మ్యవర్జితుండును, నగుచుఁ, బ్రారబ్ధానుగతమ్ములగు కర్మమ్ములనుభవించుచు నందువిచారంబు లేకుండుటయు, నిట్టి గుణంబులుగలవానిభక్తి పరభక్తి యనఁబడు. నిట్టిభక్తుండు చిన్మాత్రమ్మగు మద్రూపమ్మున లయంబుఁ జెందు. నేతాదృశమ్మగు భక్తినే జ్ఞానమ్మని యెఱుఁగఁదగు. ఇయ్యదియ వైరాగ్యపరమావధియు నని మఱియు నిట్లనియె. ౧౬౮

క॥ ఏతాదృశుఁడగు భక్తిస, మేతుండును బూర్వకర్మమేళనమున వి,
జ్ఞాతృత్వము పొరయనిచో, నాతఁడు మద్ద్వీపమునకు నఱుఁగు
గిరీంద్రా! ౧౬౯

వ॥ అచట నిచ్ఛలేకయు సమస్త భోగమ్ముల ననుభవించుచు పిదపఁ జిద్రూపజ్ఞానమ్ముఁ గాంచి దానం జేసి ముక్తిం బడయు. నీలోకమ్మున నదృఢతరజ్ఞానమ్ము కలవాఁడు బ్రహ్మతాదాత్మ్యంబు గాంచు. బ్రహ్మము నెఱింగినవాఁడె బ్రహ్మమ్మని యెఱుంగుము. భ్రాంతితిరోహితంబగు కంఠచామీకరంబు తన్నాశమ్మునం జేసి తెలియుపగిది నజ్ఞానచ్ఛన్నంబగు నాత్మను జ్ఞానమ్మునఁ దెలియుట లబ్ధలబ్ధియగుఁ గాని నూతన లాభంబుగాదు. ౧౬౬

తే॥గీ॥ జగతి వైరాగ్యవంతుఁడై జ్ఞానహీనుఁ, డగుచు మృతిఁ జెందెనేని
యయ్యఘచరితుఁ, డంబుజోద్భవలోకంబునందు సౌఖ్య, మ
మర వసియించు నాకల్ప మదిరినాథ! ౧౬౭

తే॥గీ॥ అట్లు వసియించి శ్రీమంతులైనవారి, యింట జనియించు విజ్ఞాన
మొసఁగ మొసఁగ, ముక్తియును జెందుఁ గావున మోక్షకామి,
జ్ఞానమార్జింప యత్నంబు సలుపవలయు. ౧౬౮

వ॥ విజ్ఞానంబన ననేకజన్మసాధ్యంబగుట నద్దానికై ప్రతిజన్మమ్మునను బ్రయత్నంబొనర్పవలయుఁ గానినాఁడు పూర్వపదభ్రష్టుండును గాఁగలఁడు. ౧౬౯

తే॥గీ॥ జన్మములయందు మానవజన్మ మధిక, కష్టసాధ్యంబు దాన న
గ్రిజతయును శమాదిషట్కంబు యోగసంప్రాప్తి యుంచి, గురు
వు దొరకుట దుర్లభ మరయనెందు. ౧౭౦

వ॥ ఇయ్యవి దొరకొనినను నింద్రియపాటవమ్మును దను 1 సంస్కృతత్వమ్మును దుర్లభంబులగు. ౧౭౧

1 వేదోక్తసంస్కారవత్త్వము.

॥క ఏతాదృశసాధన సము,పేతుండయ్యును సుబుద్ధి పెంపున విజ్ఞా, న
తిశయముఁ గొననెంచని, పాతకిజన్మంబుఁ దలఁప వ్యర్థముగ
జుమీ. ౨౭

క॥ జ్ఞానమార్జింపఁ దివిరెడిమానవుండు, ప్రతిపదమ్మును హాయమే
ఫలముచెందు, సర్వభూతములందు విజ్ఞానముండుఁ, బాలఘృ
మున్నభాతిగఁ బర్వ తేండ్రి. ౨

వ॥ మనమ్మనుసంధానమ్మున విజ్ఞానంబుతెలిచిన దానంజే
చిదైక్యంబుదొడరునని వేదాంతసిద్ధాంతంబని నొడువునప్పరాంబిక
హిమాద్రియిట్లనియె. ౨౭

తే॥గీ॥ అంబ! చూడంగఁదగిన దేశంబులెవ్వి?, సంతసంబిచ్చున
యుత్సవములెవ్వి?, తసరఁ జేయంగఁదగినవ్రతమ్ములెవ్వి?
ప్పుమీాయన నిట్లనిచెప్పఁదొడఁగె. ౨౭

క॥ అన్నియు దృశ్యస్థానము, లన్నియుఁ గృత్యవ్రతమ్ము లన్నియు
మత్సర్వోన్నతమహాకాలమ్ములు, కొన్నివచించెదనునందుఁ గ
నకొనివినుమా. ౨౭౬

## —*దేవీవ్రతోత్సవాదికము*—

వ॥ లక్ష్మీనివాసంబగు కోలాపురమ్మును రేణుకానివాసంబగ
మాతృపురమ్మును, హింగుళానివాసంబగు తుళజాపురమ్మును, జ్వా
లాముఖీనివాసంబగు సప్తశృంగంబును, శాకంభరీ భ్రామరీ రక్త
దంతికా దుర్గా స్థానమ్ములును వింధ్యాచలనివాసినీ స్థానము
ను, నన్నపూర్ణానివాసమ్మగు కాంచీపురమ్మును, భీమాదేవి

విమలయు, శ్రీచంద్రలయుఁ గౌశికియు, నుండుచోటులును, నీలాం
బానివాసంబగు నీలాచలంబును, జాంబూనదేశ్వరీస్థానంబగు శ్రీనగ
రంబును, గుహ్యకాళీస్థానంబగు నేపాళమ్మును, మీనాక్షీస్థానంబగు
(1) చిదంబరంబును, సుందరీసమధిష్ఠితంబగు వేదారణ్యంబును, 2
పరశక్తినివాసంబగు నేకాంబరంబును, దక్షిణదేశస్థితంబగు మహాల
సాస్థానంబును, వరాటదేశస్థితంబగు యోగీశ్వరీస్థానంబును, జనదేశ
స్థితంబగు నీలసరస్వతీస్థానంబును, వైద్యనాథక్షేత్రస్థంబగు బగళా
స్థానంబును, భువనేశ్వరినగు స్థానంబుమణిద్వీపంబును శ్రీమత్త్రిపు
రభైరవీస్థానంబగు 3 కామాఖ్యాయోనిమండలంబును, దృశ్యంబులు.
ఇందుఁ దుట్టతుదిస్థానంబగు యోనిమండలంబు మహామాయాధిష్ఠి
తంబగుకతన భూమండలస్థితంబులగు క్షేత్రమ్ములకెల్లరత్నంబనం బ
రఁగు. దీనికెక్కుడుక్షేత్రం బీధరాతలమ్మున లేదు. ప్రతిమాసంబున
శ్రీదేవి యొచటరజస్వలయగునో 4 తాదృశంబగు కామాఖ్యాయోని
మండలమ్మునఁ గల దేవతలందఱును బర్వతతాదాత్మ్యంబుచెంది వ
సింపుచుందురు. వేయేల? తద్యోనిమండలక్షేత్రమ్మునకు సంబంధించి
న పృథివియెల్ల దేవీరూపమ్ముగానెఱుంగఁదగు. మఱియుఁ బుష్కర
మ్మున గాయత్రియు, నమరేశ్వరమ్మునఁ జండికయుఁ, బ్రభాసమ్మునఁ
బుష్కరేక్షణియు, నైమిశమ్మున లింగధారిణియుఁ, బుష్కరాక్ష
మ్మునఁ బురుహూతయు, నషాఢియందు రతియుఁ, జండముండీమహా
స్థానమ్మునఁ బరమేశ్వరియగు దండినియు, భారభూతియందు భూతి

1 చిదంబరము, హాలాస్యస్థానము, 2 పరాశక్తి, భువనేశ్వరి. 3 దీనింగూర్చి విస్తరము
దయగోరువారు కాళికాపురాణమందుఁ గను, కామాఖ్య, సతీదేవి, ల యోనిమం
డలముపడినచోటు. 4 ఈరజస్వలాప్రసక్తింగూర్చి కాళికాపురాణమున విస్తరిం
చి కలదు.

యు, నాకులమ్మున్న నకులేశ్వరియు, హరిశ్చంద్రమ్మున్నఁ జంద్రికయు, శ్రీగిరియందు శాంకరియు, జప్యేశ్వరమ్మున్నఁ ద్రిశూలయు, నామ్రాతకేశ్వరమ్మున్న సూక్ష్మయు, 1 మహాకాళమ్మున్న శాంకరియు, మధ్యమేశ్వరమ్మున్న శర్వాణియుఁ, కేదారమ్మున్న మార్గదాయినియు, భైరవమ్మున్న భైరవియు, గయయందు మంగళయుఁ, కురుక్షేత్రమ్మున్న స్థాణుప్రియయు, నాకులమ్మున్న స్వాయంభువియును, కనఖలమ్మున్న నుగ్రయు, విమలేశ్వరమ్మున్న విశ్వేశయు, నట్టహాసమ్మున్న మహానందయు, మహేంద్రమ్మున్న మహాంతకయు, భీమమున భీమేశ్వరియు, వస్త్రాపథమ్మున్న భవానియు, నర్ధకోటిమ్మున్న రుద్రాణియు, నవిముక్తమ్మున్న విశాలాక్షియు, మహాలయమ్మున్న మహాభాగయు, గోకర్ణమ్మున భద్రకర్ణికయు, భద్రకర్ణమ్మున భద్రయు, సువర్ణాక్షమ్మున నుత్పలాక్షియు, స్థాణ్వీశమ్మున స్థాణ్వీశయుఁ, గమలాలయమ్మునఁ గమలయు, ఛగలండమ్మునఁ బ్రచండయుఁ, గురండలమ్మునఁ ద్రిసంధ్యయు, మాకోటమ్మున మకుటేశ్వరియు, మండలేశమ్మున శాండకియుఁ, గాళంజరమ్మునఁ గాళియు, శంకుకర్ణమ్మున ధ్వనియు, స్థూలకేశ్వరమ్మున స్థూలయు, జ్ఞానిహృదయాంభోజమ్మున హృల్లేఖయు, నివసింతు, రయ్యెడ దేవిప్రియమగుస్థానంబు లీక్షేత్రమాహాత్మ్యంబులు వినుమిప్పుడివి తత్తత్క్షేత్రవిహితోక్తప్రకారంబుగు విధానమ్మున యజించునది యని పలికెను. ౧౭౭

క॥ ఈ నేఁ జెప్పిన, నానాతీర్థములు కాశినాఁబురిఁగల పాస్థనమ్మున నివసించిన, వానికిఁ దత్ఫలంబు వచ్చుగిరీంద్రా! ౧౭౮

ఉ॥ వేకువలేచి వే హృదయపీఠిక నంబికఁ బూనుకొల్పి యా

1 ఉజ్జయిని.

బూజించియు, సంతర్పణంబొనరించియు, నన్నుం గొల్చువారు, మత్కారుణాపాత్రులగుచు ధన్యులుగాఁ గల రీవడిగిన ప్రశ్నమ్ములకుత్తరమ్ము లియ్యవి సంక్షేపమ్ముగాఁ జెప్పితి నెన్నండును నశిష్యునకును నభక్తునకును నుపదేశింపకు మనవుడు హిమాద్రి విధిచోదితంబగు భవత్పూజావిధానంబానతీవేయునికోరుడు శ్రీదేవి యిట్లనియె. బాహ్యంబనియు, నాభ్యంతరంబనియు, మత్పూజ రెండు తెఱంగులందు బాహ్యంబు వైదికంబనియుఁ, దాంత్రికంబనియు, ద్వివిధంబు. వైదికోక్తదీక్షాపరు లాచరించునది యాద్యంబు. తాంత్రికదీక్షాపరు లొనర్చునది ద్వితీయం బిందాద్యమ్మును రెండువిధమ్ములు గలయది. తత్ప్రకారంబు ముందువివరించెద. సర్వశక్తిసమాయుక్తంబును, సర్వప్రేరకమ్మును, సహస్రమూర్ధంబును, సహస్రనయనమ్మును, సహస్రచరణమ్మును, నగు నీచూచిన నాయీరూపంబ ఫలంబుకన్నఁబరంబని యెఱుంగు మద్రూపముఁ బూజించుటయు వైదికంబగుఁ గావున సమాహితచిత్తుండవై యహంకారంబువర్జించి శాంతినివహించి. ౧౨౩

క॥ దానిన యుబజపము సేయుచు, దానిన శరణమ్ము చెంది దానినమదిలో, నూనుచు దానిన యెంచుచు, దానిన ధ్యానింపుమయ్య తత్పరతేఁడగ౯. ౧౨౪

క॥ నను యోగములందనుపుచు, మనమున హేతువంశుకలఁపమాని పెనుతపం, బున దాన జపములను వి, న్ననవుగ నర్చింపు లోకనాయిక నగుట౯. ౧౨౫

క॥ ఏరు మదాసక్తులు నై వారలు నన్నన్యయుంచి భావింతురు? మ, త్కారుణ్యపాత్రులెవ్వరు?, వారల సంసారబాధ వారింతునొగి౯

వ॥ ధ్యానమ్మునదొండె భక్తియుక్తంబగు జ్ఞానంబునదొండె నన్నుంగననగుఁగాని కేవలకర్మమ్మునఁగాదు. ధర్మమ్మునలన భక్తి

యు, భక్తివలన విజ్ఞానంబును, లభించు. శ్రుతిస్మృతిబోధితంబగునది యె ధర్మం బన్యశాస్త్రబోధితంబగునది ధర్మాభాసమ్ముగాని ధర్మంబు కాదు. సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వ యుక్తనగు నావలన వేదమ్ములుద్భవించె. నాయం దజ్ఞానమ్ములేకుంటం జేసి యివి ప్రమాణంబు లజ్ఞానులగు శాస్త్రకర్తలచే నొనర్పంబడిన శాస్త్రమ్ములు ప్రమాణంబులుగానేరవు. శ్రుత్యర్థగ్రాహకములగుకతన మన్వాదిస్మృతులును ప్రమాణంబులు. తంత్రోక్తమ్ములగు ధర్మమ్ములు వేదవిరుద్ధమ్ములగుటం జేసి వైదికగ్రాహ్యమ్ములుగావు. రాజాజ్ఞ సర్వజనమాన్యయగుచు గిది నాచే నుపదేశింపంబడిన వేదమ్ములు సర్వమాన్యమ్ములు. ముముక్షువులకుం దదాశ్రయణం బవశ్యకర్తవ్యంబు. మదాజ్ఞాసంరక్షణార్థంబుగ బ్రహ్మక్షత్రియజాతులు నుత్కల్పితంబులు. ధర్మగ్లానియగుతఱిం దదభ్యుత్థానార్థం బేను నయ్యై యవతారమ్ములు ధరింతు. దేవదైత్యవిభాగంబు 1 దానం జేసి కల్పింపంబడియె. వేదోక్తధర్మాభ్యాసంబొనరింపని పాతకుల శిక్షించుపొంటె శ్రవణమాత్రభయప్రదమ్ములగు నరకమ్ములు మన్నిర్మితంబులు. వేదవిరుద్ధ శాస్త్రాలోడనం బొనర్చువారలు నాచే స్వదేశమునుండి నిష్కాసితులు. వీరు బ్రాహ్మణులకు సంభాష్యులును బంక్తిగ్రాహ్యులును గారు. భృగుదక్షదధీచుల శాపమ్మున దగ్ధులై వేదమార్గబహిష్కారమ్ముగాంచిన విప్రులకొఱకు శైవవైష్ణవాద్యాగమమ్ములు శివప్రోక్తమ్ములుగాం దెలియుము. అయ్యవి వామ కాపాలక కౌలక భైరవాది నామమ్ములం బ్రసిద్ధంబులు. మోహనార్థ ప్రణీతంబులగు నాయీ యాగమంబులును సోపానన్యాయమ్మునం గాలాంతరమ్మున ముక్తికారణమ్ములుగా సంగీకరిం

1 వేదములుండుటంజేసియే వేదరక్షకులు దేవతలనియును, తన్నాశకులు రాక్షసులనియు విభాగం బేర్పడినదని భావము.

పందగు వేదాధికారహీనులు। తత్పరసపారనాధికారులు. వైదికులకును వర్గతంబులగు వేదావిరుద్ధాంశమ్ములు గ్రాహ్యమ్ములు. వేదమ్ములనాశ్రయించి ధర్మసహితమ్మగు విజ్ఞానంబు సంపాదించి దానంజేసి యీషణత్రియత్యాగంబొనరించి భూతదయాళుత్వమ్మును సహంకారశూన్యత్వమ్మును గలిగి నన్నుశరణుఁజెంది మద్గతప్రాణులగుచు సంయసన్యాసులొండె బ్రహ్మచారులొండె గృహస్థులొండె వానప్రస్థులొండె నైశ్వరంబగు యోగమ్మున నన్నుపాసించునది. యని మఱియునిట్లనియె. ౧౩౮

క॥ సతతాభియుక్తులగు వా,రితమంబజ్ఞానజము హరించెదవినుమే,నలిన
యవిజ్ఞానాహ్వ,ర్పతి దివ్యతరప్రకాశపటిమ గిరీశా! ౧౩౯

వ॥ ఇది ప్రథమవైదికపూజాప్రకారంబేక ద్వితీయంబాలింపుము. ప్రతిమయందొండె సూర్య చంద్ర మండలమ్ములయందొండె జలమ్మునఁదొండె యంత్రమ్మునఁదొండె మహాపటమ్మునఁదొండె బాణలింగమ్మునఁదొండె స్థండిలమ్మునఁదొండె హృదయాంభోజమ్మునఁదొండెఁ గరుణారసపూర్ణయు సుగుణయు, నరుణారుణయుఁ, దరుణియు సౌందర్యసారసీమయు, శృంగారరససంపన్నయు, భక్తార్తికాతరయుఁ, బ్రసాదసుముఖియుఁ జంద్రఖండశిఖండియుఁ బాశాంకుశాదిధరయు, నానందరూపిణియు నగునప్పరదేవతను ధ్యానించి తత్తదుపచారమ్ముల విత్తానుసారమ్మునఁ బూజించునది. యీబాహ్యపూజ తనకు నాంతరపూజాధికారంబు వాటిల్లుదనుక ననుసరించి పదంపడి త్యజింపవలయు.

క॥ విను మాభ్యంతరపూజన, మన సంవిల్లయము నాకు ననుపాధికమై,
తనరెడి రూపము సంవిత్తననెగడుఁ దుషారభూధరాధిప
మాళీ. ౧౪౦

వ॥ ఇట్టి మదాశ్రయమ్మున నిరాశ్రయమ్మునం జేతమ్ము నిలుపవలయు. సంవిదాశ్రయాతిరిక్తమ్మగు జగమ్మంతయు మాయామయంబుగాఁ దెలియుము. ౮౯౧

తే.గీ. భూధరేశ్వర! సంసారమునుహరించు, పొంటె సన్మాత్రరూపిణి
భువననేత్రి, నిర్మనస్కంబు యోగసన్నిహితమునగు, చేతమున
నెంచి భావనసేయవలయు. ౮౯౨

వ॥ మఱియు బాహ్యపూజాప్రకారంబెట్లంటేని? ప్రాతఃకాలమ్మున లేచి ప్రకాశమానమ్మగు సహస్రారమ్మునఁ గమ్యాసనమ్మంబోలె స్వచ్ఛుండును నిజగురుసమానాకారుండును బత్నీసంయుతుండును లసద్భూషాభూషితుండును సుప్రసన్నుండును నగు శ్రీగురువరుని సంస్మరింపవలయునొండెఁ బతిసంయుతయగు పరశక్తిని స్మరింపవలయు. ౮౯౩

తే.గీ. 1 కడంగి ప్రథమధ్యానమునఁ బ్రకాశమాన, యాగః ప్రతిప్ర
మాణమ్మున నమృతమయత, నలరి యంతఃపదపీఠుండు మెలఁ
గునబల, సుందరాకార నెంతు నానందరూప. ౮౯౪

వ॥ ఇట్లు కుండలినీమధ్యమ్మున ధ్యానించి పిదప శౌచాదిక్రియల నిర్వర్తించి మత్ప్రీతికై యగ్నినారాధించి హోమాంతమ్మున విష్టరమ్మునఁ గూర్చుండి భూతశుద్ధిఁ జేసి మాతృకాన్యాసంబొనర్చి హృల్లేఖామాతృకాన్యాసంబుసలిపి పూజాసంకల్పంబొనర్పవలయుఁ దన్న్యాసక్రమంబువినుము. మూలాధారమ్మున హాకారమ్మును హృదయమ్మున రకారమ్మును భ్రూమధ్యమ్మున నీకారమ్మును మస్తకమ్ము

1 ఈపద్యభావమెఱుంగ గోరువారు మూలగ్రంథమునందలి 'ప్రకాశమానాం' అను శ్లోకవ్యాఖ్యానము చూడందగు. విస్తరభయమున నిందుదాహరింపలేదు.

న హ్రీంకారమ్మును బొసఁగించి తత్తన్మంత్రోదితమ్ములగు నన్యన్యాసమ్ములుసయితము సలుపవలయుఁ, బదంపడి 1 ధర్మాదులచే నాత్మదేహమ్మునఁ బీఠమ్ముఁగల్పించి ప్రాణాయామాదులచే వికాసితమ్ముగు హృత్పద్మమ్మునఁ బంచప్రేతాత్మకంబగు మదీయస్థానమ్మున నన్నుధ్యానింపవలయు. బ్రహ్మవిష్ణురుద్రేశ్వరసదాశివులేగురును బంచప్రేతపదవాచ్యులు. వీరెల్లప్పుడును మత్పాదమూలమ్మున నుందురు. మఱియును వీరు పంచభూతాత్మకులును బంచావస్థానాయకులు నని యెఱుంగుము. నేనవ్యక్తచిద్రూపనుగుటచేత వీరలకతీతనగుటంజేసి వీరలు నాకు పీఠరూపంబగుట శక్తితంత్రప్రసిద్ధంబు. ఇట్లు మానసికమ్ములగు నుపచారమ్ములచే నన్నుం బూజించి జపించి యద్దాని నాకు సమర్పించి యనంతరమ్ము బాహ్యపూజార్థం బర్ఘ్యస్థాపనంబొనర్చి పాత్రాసాదనంబు సల్పి మన్మంత్రప్రోక్షితజలమ్ముచేఁ బూజాద్రవ్యమ్ములశోధించి దిగ్బంధంబొనర్చి నిర్వర్తితగురునమస్కారుండై తదనుజ్ఞవడసి యింతకుమున్ను హృదయమ్మునఁ బాటించు మన్మూర్తిని బ్రాణప్రతిష్ఠాపనమంత్రమ్ముచే బాహ్యపీఠమ్మున నావాహింపఁ జేసి యర్ఘ్యపాద్యాచమన స్నానవాసోభూషణగంధపుష్పాదుల భక్తిపూర్వకమ్ముగ సమర్పించి యంతస్థమ్ములగు నావరణమ్ములఁ బూజింపవలయు. ఇట్లు ప్రతిదినమ్మును నాచరింప నసమర్థులగువారలకు నొక్క 2 శుక్రవారంబు నియమింపఁబడుచున్నయది. అదియుంగాక మూలదేవీప్రభాస్వరూపిణులగు నంగదేవతలస్మరింపవలయు. నీ త్రైలోక్యమ్మును దత్ప్రభాపటలవ్యాప్తంబని చింతింపనొప్పు. మఱియు సుగంధమ్ములగు గంధపుష్పాదులచేతను నైవేద్యతర్పణతాంబూలదక్షిణాదులచేతను

1 ధర్మజ్ఞానవైరాగ్యైశ్వర్యమ్ములచే. 2 ఇయ్యది యావరణ పూజకు మాత్రమే.

ద్వాత్కృతమ్ముగు[1] నామసహస్రమ్ముచేతను "అహంరుద్రేభిః" అను దేవీ
సూక్తోక్తమ్ముగు శవమ్ముచేతను హృల్లేఖోపనిషద్భవమ్ములగు దేవ్యథర్వశి
రోమంత్రమ్ములచేతను మహావిద్యా మహామంత్రమ్ములచేతను నన్ను నా
వరణ దేవతాసహితమ్ముగ సారెకుఁ బూజించి ప్రేమార్ద్రహృదయుం
డై కుమారావణాదిజెప్పికొని. ౧౯౫

క॥ పులకాంకిత సర్వాంగత, నలరారుచు బాష్పరుద్ధమగు నత్తియు
గం, బాలయుంగ నృత్తగీతా, దులచే మెచ్చింపవలయు దారకో
ను పేర్మిన్. ౧౯౬

క॥ వేదములఁ బురాణమ్ముల, నానగు నిర్ణయము దగఁగనంబడుట
ను న, త్యాదరమునఁ దత్పరనం, బాది నను బూజసలుపు టు
త్తమ హితమా. ౧౯౭

వ॥ పిదప తన దేహమ్మును సర్వమ్మును మదధీనంబొనర్పవల
యు. ఇట్లు ప్రతిదినమ్మును నిర్వర్తించి పదంపడి నిత్యహోమమ్మొన
లిపి బ్రాహ్మణులను సువాసినులను వటుకులనుఁ దక్కంగల పామరు
లను దేవిబుద్ధిచే భోజనాదికమునఁదనిపి పిదపఁ దనహృదయమ్మున
నమస్కరించి సంహారముద్రచే విసర్జనంబొనర్పవలయు. ౧౯౮

గీ॥ శ్రీలమ్మై నాదుపూజహృల్లేఖచే నొ,నర్పఁగావలె సర్వమంత్రముల
కదియు,నాయిక ; తదంతరాళమునను, ననుఁ బ్రతిబింబితగ నీవ
లుంగు పృథ్వీధరేశ! ౧౯౯

వ॥ దానఁజేసి హృల్లేఖాసమర్పితంబగు పూజసర్వమంత్రసమ
ర్పితంబయగు ననంతరమ్మున భూషాదికమ్ములచే గురుపూజనంబొన
ర్చి కృతకృత్యత్వమ్మునవహించునది. ౨౦౦

క॥ ఎవఁడీభంగిని శ్రీమ,ద్భువనేశ్వరినైన నన్నుఁ బూజించు సతం,

---

1 ఈనామ సహస్రము కూర్మపురాణమున గలదు.

డవసీధ్రి? మణిద్వీపమ్మున వసించు సుఖముల నిహామునఁ గొని
పిడపన్. ౯౦౧

వ॥ అట్టివానినెల్ల దేవతలును నమస్కరింతురు. వానికి దుః
ఖంబొండుండదు. మఱి పూజావిధానంబియ్యదియని, ఇది మొదలు దేనిన
రసి యథాకారానుసరణమ్మునఁ బూజించితివేని కృతార్థుండవు కాఁగల
విగీతాశాస్త్రమ్ము నశిష్యునకును నభక్తునకును ధూర్తునకును దుర్వాల
దునకును నొసంగక గోప్యంబుగనుంచునది దీనిం బ్రకటించుట మా
తృస్తనప్రకటనంబు, వెండియు శిష్యునకును భక్తునకును జ్యేష్ఠపుత్రు
నకును నియ్యది యవశ్యంబొసంగవలయు నియ్యది శ్రాద్ధకాలమ్మునఁ
బఠించినఁ బితరులకుఁ బరమపదప్రాప్తి యలవడు నని బోధించి దేవి
యంతర్ధానంబునందుటయు, దేవతలు దేవీసందర్శన సంగతానందు
లైరి. ౯౦౨

క॥ ఆమీఁద గౌరియని మొడి, నామమునఁ దుషారగిరికి నందనినై
ని, త్యామోదగరిమ వర్ధిలె, నామాతృక గిరియు నాపె హరునకు
నొసఁగెన్. ౯౦౩

వ॥ వారలకు స్కందుండుదయించి తారకువధియించె నని మఱి
యును.

క॥ సురలు తనున్ వేఁడఁగ సా, గరమున జనియించెరమయుఁ గమలా
క్షున కిచ్చిరి వారలాపె శక్తిస్ఫురణమ్మున దాన హరియుఁ బొం
పిరివోయెన్. ౯౦౪

క॥ ఇది గౌరీ లక్ష్మీ జన్మది శోవిషయంబు మిగులమాన్యం బత్యా,
భ్యుదయప్రదంబు గోప్యం, బెది నీవడిగితివో? దానికిదియు త్తరమౌ

వ॥ ఇంక నెయ్యది విననిచ్చగింతువని వ్యాసుండు జనమేజయు
నకుఁ జెప్పెననుటయు. ౯౦౫

—॥ స్కంధాంత పద్యములు. ॥—

ఉ॥ వాఙ్మనసక్రియాతులితవర్తన తత్త్వవిచారధోరణీ
భాస్మనసప్రచార గుణవత్ప్రియశిష్యజనోపవేశితా
వాఙ్మహిమప్రకారబుధవర్ణిత సత్వవచోవిచార వా
ర్వృగ్జన్మహానీయకాయ పరిముక్తతరేషణ శాంతిభూషణా. ౧౦౮

క॥ సరస ధరాదమణసభాం, తరగతబహుమాన సుకవితారసవిచర,
త్తిరుపతి వేంకట నామ, స్ఫురదస్మద్గురువరేణ్యసూరిశరణ్యా. ౧౦౯

భుజంగప్రయాతము.

జగద్గీతకీర్తీ సుశాస్త్రప్రవర్తీ, నిగర్వప్రచారా ఘనీభూతసారా
నగశ్రేష్ఠజాతాధినాథప్రభూతా, తిగణ్యాంతరాశీతదృష్ట్యంబురాశీ

గద్య

ఇదిశ్రీ......... తిరుపతి వేంకటేశ్వర ప్రణీ
తంబగు దేవిభాగవతంబను మహాపురాణ
మ్మునందు సప్తమస్కంధము
సంపూర్ణము.



శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీమత్పరదేవతార్పణమస్తు.

# శుద్ధపత్రం.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 19 | మేజ | మేజ |
| 9 | 9 | ప్రియా | క్రియా |
| 14 | 25 | రెల | రెల్ల |
| 15 | 21 | మూాఁగురు | మూాఁగురు |
| 34 | 18 | ఎల్లఱ | ఎల్లర |
| 43 | 21 | సర్ప | సర్ప |
| 46 | 14 | ద బ | దహోబ |
| 52 | 18 | నర్పు | నర్చు |
| 70 | 24 | ధిగీ | గీరథ |
| 72 | 12 | వచ్చెడినని | వచ్చెనని |
| 85 | 6 | గుదుపు | గుదువు |
| 90 | 7 | దనం | దనర |
| 94 | 11 | జూలు | జాలు |
| 106 | 11 | షిధీ | మధీ |
| 107 | 18 | రుసె | రిమె |
| 109 | 1 | మధి | ముధి |
| 110 | 11 | కొంత | గొంత |
| 111 | 21 | న | యు |
| 111 | 23 | పడ | పడి |
| 112 | 2 | న | యు |
| 112 | 7 | కర | కని |
| 112 | 17 | గాడె | గాఁడె |
| 113 | 11 | రి | రి |
| 115 | 4 | శ్రీ | శ్రీ |
| 116 | 2 | న్స్వ | స్వ |
| 116 | 12 | మచ్ఛో | నచ్ఛో |
| 116 | 15 | ద్గర | ద్ఘా |
| 116 | 23 | జడినో | జడరో |
| 119 | 4 | మిన్ని | మిన్న |
| 119 | 16 | నిష్టు | నిష్ఠు |
| 120 | 11 | రఁపు | రఫు |
| 121 | 4 | శైథిల్య | శైథిల్య |
| 121 | 14 | వాచ్వ | వాచ్య |
| 122 | 11 | పెనఁ | ను |
| 122 | 18 | ఉత్మ | ఉన్మ |
| 123 | 6 | యుసు | యును |
| 124 | 4 | దాహ్య | దాస్య |
| 124 | 16 | తానంద | దానంద |
| 125 | 15 | యం | అం |
| 125 | 23 | వసు | వస |
| 126 | 10 | థసు | థను |
| 126 | 21 | త త్త్వ | న త్త్వ |
| 127 | 20 | బుసఁ | బును |
| 128 | 9 | స్వర్గ | స్వర్గ |
| 128 | 14 | డతః | డంతః |
| 128 | 23 | బోరు | భోరు |
| 129 | 1 | సూర్వ | సూర్య |
| 129 | 3 | తపం | దపం |
| 130 | 11 | గర్మ | కర్మ |
| 130 | 18 | చిత్త | ఆత్త |

# శుద్ధపత్రం.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 131 | 4 | గించ | గించి | 140 | 21 | శిశ్య | శిష్య |
| 131 | 5 | తత్త్వం | దత్త్వం | 141 | 7 | యున్న | యును |
| 131 | 21 | తితి | తితి | 141 | 21 | దిచ్చి | దిచ్చు |
| 132 | 6 | ములభిం | మనుగమిం | 142 | 2 | నన్నుచిం | నన్నుఁజిం |
| 132 | 22 | తానం | దానం | 143 | 1 | చుచుపి | చుచుఁబి |
| 133 | 3 | నిద | నిఁద | 143 | 9 | యయ్యాఘు | యయ్యానఘు |
| 136 | 9 | ప్టానం | స్థానం | 144 | 18 | భార్మరీ | భార్మరీ |
| 137 | 11 | గు,సిద్ధింగు, | చిత్తంబుసిద్ధిం | 145 | 18 | లింగా | లింగ |
| 137 | 15 | మాతాృ | మంత్రా | 146 | 18 | మహా | మహాహా |
| 137 | 20 | ,జీకటి | జీఁకటి | 147 | 2 | నంజ | నర్జ |
| 138 | 17 | కిప | కిఁబ | 147 | 6 | బను | బగు |
| 139 | 3 | కర్మము | కర్మమ్ము | 149 | 20 | సిద్దం | సిద్ధం |
| 139 | 12 | వన్క | వెన్క | 150 | 17 | శిఖండియు | శిఖండిసియు |
| 139 | 19 | చోటున | చోటన | 151 | 3 | కాతెలి | కాఁదెలి |
| 140 | 4 | తా | దా | 151 | 16 | లపీ | లిపీ |
| 140 | 7 | లేడ | లేఁడ | | | | |

ఇంతవఱకుఁ జూపిన తప్పొప్పులను జదువరులు శ్రద్ధగా గమనింపవలయునని కోరుచున్నాఁడను. ఇందు 108 పుటలు నేను బందరులోనున్న దినములయందే ముద్రితమయినవి. ఇటీవల నశ్రద్ధచేయుట చే నీస్కంధమాపదుమూఁడేడులును బ్రకటింపఁబడక మూలఁబడియుండె, బందరులోనచ్చైన పుటలలోఁ గడుంగడుదక్కువగాఁ బ్రమాదములుండుటకును, నిపుడచ్చైన పుటలలో నంతకన్న విస్తరించి ప్రమాదములుండుటకును గత మిప్పుడు ప్రూఫులు స్వయముగాఁ జూడకపోవుటయేయని చదువరులు గుఱితింతురుగాన విస్తరింపను. వ్య

యు నీక్రింది సవరణలనుగూడ గమనింపఁ గోరెదను.

ప్రథమస్కంధము. 46 వ పుట 279 పద్యములో కం॥ "శంభుండును హరియును" అనుచోట, శంభుండును నజుఁడును, అనియు తృతీయస్కంధము- 31 వ పుట తుదిపంక్తిలో- "మృగయా" అనునది "మృగయూ?" అనియు డిటో స్కంధమునందే 60 పుటలో ౨౪౦ వ పద్యములో నాల్గవ చరణమున—"లోఁదలపోయకు" అనుచో "నల్లదలపోయకు" అనియు సవరించుకోఁగోరెదను.

॥ అచ్చు వేయఁబడుచున్న పుస్తకములు. ॥

1 శ్రవణానందము 2 పాణిగృహీత 3 లక్షణాపరిణయము 4 పాండవజననము 5 పాండవప్రవాసము 6 పాండవాశ్వమేధము 7 మృచ్ఛకటిక 8 ముద్రారాక్షసము 9 బాలరామాయణము ప్రథమ భాగము 11 బుద్ధచరిత్ర 12 వేంకటేశ్వరవిలాసము (చెళ్ళపిళ్ళ సరసకవి విరచితము) 12 పల్లెటూళ్ళ పట్టుదలలు (చక్కని ప్రహసనము) 13 అపూర్వ కవితావివేచనము (స్కూలు పిల్లల పార్సుసహితము) 14 విక్రమాంకదేవ చరిత్ర (వచనము) 15 నానారాజసందర్శనము (రాజులరికార్డు) 16 గీరతము 1వ భాగము 17 చంద్రప్రభ చరిత్ర 18 శృంఖలాతృణీకరణము 19 వైరాగ్యశతకము.

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి

శతావధాని

## శ్రీతిరుపతి వేంకటేశ్వరు లొనర్చిన తెలుఁగు పుస్తకములు.

| | |
|---|---|
| 1 రసికానందము. | 0—1—6 |
| 2 శుకరంభాసంవాదము. | 0—4—0 |
| 3 పాండవరాజసూయము | 0—5—0 |
| 4 పాండవోద్యోగము. | 1—0—0 |
| 5 పాండవవిజయము. | 1—0—6 |
| 6 సుకన్య. | 0—5—0 |
| 7 పండితరాయచరిత్ర. | 0—10—0 |
| 8 అనర్ఘనారదము. | 0—8—0 |
| 9 దంభవామనము. | 0—6—0 |
| 10 కామేశ్వరీశతకము. (సర్వరసయుక్తము) | 0—4—0 |
| 11 శనిగ్రహము. (ప్రసిద్ధికెక్కినది) | 0—1—3 |
| 12 శతావధానసారము. | 0—12—0 |
| 13 గీరతము 2 వ భాగము (గురుదక్షిణ) | 0—10—0 |
| 14 డిటో 3 వ భాగము (విగ్రహారాధనము) | 0—8—0 |
| 15 గుంటూరుసీమ 1 వ భాగము (పూర్వరంగము) | 1—0—0 |
| 16 డిటో 2 వ భాగము (ఉత్తరరంగము) | 1—0—0 |
| 17 డిటో 3 వ భాగము (వేమవరపుశతావధానము) | 0—12—0 |
| 18 ఎడ్వర్డు పట్టాభిషేకనాటకము | 0—6—0 |
| 19 అష్టకములు | 0—4—0 |
| 20 కాళీసహస్రము (సంస్కృతము) | 0—8—0 |
| 21 ప్రభావతీప్రద్యుమ్నము | 0—12—0 |
| 22 హర్షచరిత్రము | 0—12—0 |
| 23 దివాకరాస్తమయము | 0—12—0 |
| 24 బాలరామాయణము 2 వ భాగము | 0—8—0 |
| 25 ఏలామాహాత్మ్యము | 0—4—0 |

| | | |
|---|---|---|
| 1 | *దేవీభాగవతము. (ప్రథమస్కంధము) | 0—10—0 |
| 2 | *డిటో (ద్వితీయస్కంధము) | 0—6—0 |
| 3 | *డిటో (తృతీయస్కంధము) | 0—12—0 |
| 4 | *డిటో (చతుర్థస్కంధము) | 0—9—0 |
| 5 | *డిటో (పంచమస్కంధము) | 0—11—0 |
| 6 | *డిటో (షష్ఠస్కంధము) | 0—12—0 |

*ఈ గురుతుగల పుస్తకములు కాత్యాయనీగ్రంథమాల చందాదారులకు మొత్తముగా రు 3-0-0 ల కొనంగంబడును.

దేవీభాగవతము( సప్తమస్కంధము చందాదారులకు 1-0 యితరులకు 1-4-0

స్వకృతములగు చిన్న గ్రంథములు.

| | | |
|---|---|---|
| 1 | గ్రామసింహము | 0——0 |
| 2 | కవిసింహగర్జితములు | 0——0 |
| 3 | భారతవిశేషములు | 0——0 |

ఇతరకృతములగు చిన్నగ్రంథములు

| | | |
|---|---|---|
| 1 | బిడాలోపాఖ్యానము | 2—0 |
| 2 | సంగదోషము | 0—2—0 |
| 3 | కవితావివేచనము | |
| 4 | అత్యద్భుత విమర్శనము | 0—— |

వరా:—ఈగ్రంథములు బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశా గారు, శతావధాని, కడియం, యీస్టుగోదావరిజిల్లా యనిగాని, దివాకర్ల వేంకటావధానిగారు, దిగమర్తివారివీధి, కాకినాడ, యనిగాని, యీదిగువ అడ్రెస్సునకుగాని వ్రాసినం బడయంగలరు.

తంగిరాల జగన్నాథశాస్త్రి

సంపాదకుండు.

కాత్యాయనీ గ్రంథమాల, తణుకు